# చంద్రయ్యలో చైతన్యం

మూలం :

లియో టాల్‌స్టాయ్

హిందీ రూపాంతరం :

శ్రీ జైనేంద్రకుమార్

తెలుగు అనుకృతి :

శ్రీ దండమూడి మహీధర్





## శ్రీ జైనేంద్రకుమార్

జననం : 1905. ప్రారంభికవిద్యాప్రాప్తి. బ్రహ్మచర్యాశ్రమం— హస్తినాపురంలో (1911-18). ప్రైవేటు మెట్రిక్ 1919. కాశీ విశ్వవిద్యాలయంలో—1919-1920. సహాయ నిరాకరణోద్యమంలో కాలేజి పరిత్యాగం—1921. ప్రథమ కారాగారవాసం-1924. పునః కారాగారవాసాలు-1930-1932. ఆతరువాత నిరుద్యోగం. తననుతాను శాశ్వత నిరుద్యోగినని చెప్పుకొనేవాడు.

మొదటి కథలసంపుటి 'ఫాంసీ' [ఉరి] తో 1929 లో సాహిత్య రంగంలో అడుగుపెట్టాడు. మొదటి నవల 'పరఖ్' ప్రచురణ — 1930. మొదటి తాత్త్విక గ్రంథం 'జైనేంద్రుని అభిప్రాయాలు' - ప్రచురణ 1937. సాహిత్యరంగంలో ఈయన ప్రవేశమువల్ల ఉద్భవించిన కలకలాన్నిగురించి కతిపయ విజ్ఞుల ఈ ఉద్ఘాటనలవల్ల ఊహించవచ్చు —

"... నువ్వు గోర్కీ కాగోరుతున్నావా? భారత దేశంలో గోర్కీ కాగలిగినవారూ - అయినవారూ ఎవరైనా ఉన్నారా అంటే ఒక్క జైనేంద్రుడు మాత్రమే."

— ప్రేమ్‌చంద్.

" 'జైనేంద్రుని అభిప్రాయాలు' చదువుతూ టాల్‌స్టాయ్ రచనలు చదువుతున్నంత — కాదు, ఇంకా చాల అధికంగా ఆనందానుభూతిని పొందాను నేను...."

— కిశోర్‌లాల్ మశ్రూవాలా.

"....హిందీ కథాసాహిత్య క్షేత్రంలో, ఇప్పుడు మనం రవీంద్రనాథ్, శరత్‌బాబులను జైనేంద్రునిలో ఒకేసారిగా పొందగలిగాము — తిరిగి పొందగలిగాము."

— మైథిలీ శరణ గుప్త.

# మీరు చదివారా ?

## అపూర్వమైన సాహిత్యం! జైనేంద్ర సాహిత్యం!

మళ్లీమళ్లీ చదువతగ్గది! ఎన్నిసార్లయినా చదువతగ్గది!
అధ్యయనంచేయతగ్గది! ఆ సాహిత్యమే అటువంటిది!

| | | |
|---|---|---|
| సునీత | (జైనేంద్రకుమార్) | 3-75 |
| సుఖద | ,, | 3-75 |
| కల్యాణి | ,, | 3-00 |
| రాజీనామా | ,, | 2-00 |
| జయంత్ | ,, | 2-50 |
| జితేంద్రుడు | ,, | 3-75 |
| కామము-ప్రేమ-పరివారము | ,, | 3-00 |
| చంద్రయ్యలో చైతన్యం | ,, | 2-00 |

త్వరలోనే సమస్త జైనేంద్ర సాహిత్యమూ
పూర్తిగా ప్రచురింపబడుతుంది.

## ఇవికూడ

| | | |
|---|---|---|
| సన్యాసి | (ఇలాచంద్రజోషీ) | 7-50 |
| ప్రేతము - ఛాయ | ,, | 4-00 |
| నిర్మల | (ప్రేమ్‌చంద్) | 3-00 |
| సేవాసదనం | ,, | 3-00 |

# ప్రవేశకము

"కాంతా - కాంచనం" - మానవునికి స్వర్గసౌఖ్యం చవిచూపినా, నరకజ్వాలల్లో పేల్చినా ఈ రెండే. ఈ రెంటినీ సవ్యంగా వినియోగించుకోకపోతే మానవుడు, తద్వారా ఆ సమాజం అంతులేని యమయాతనలకు సర్వనాశనానికీ పాల్పడుతుంది. అందుకే ప్రతిజాతీ కాలమానపరిస్థితులనుబట్టి ఈ రెంటివిషయంలోను కొన్ని కట్టుబాట్లు పెట్టుకుంది. ఆకట్టుబాట్లను కాలానుగుణంగా మార్చుకుంటూ వచ్చింది. అలా మార్చుకోనిపక్షంలో అవి జాతికి బంధనాలై మారుతుంటాయి. అయినా ఆకట్టుబాట్లవెనుక కొన్నికొన్ని ప్రాథమిక నైతికసూత్రాలు శాశ్వతంగా నిలిచి వుంటాయి. ఆ ప్రాథమిక సూత్రాలనుసహితం కాలదన్నినమానవుడు, జాతి నైతికపతనంచెంది, అధోగతిపా లవుతారు. అలాంటి నైతికపతనం ప్రతి దేశ సాంఘికచరిత్రలోనూ ఎప్పుడో ఒకప్పుడు తానవస్తుంది. అలాంటి నైతికపతనం సంభవించినప్పుడల్లా మహాకవివీరులు బయలుదేరి ఆ నైతికపతనాన్నుంచి జాతిని రక్షించేందుకు కలాలకు పదునుపెడుతూంటారు. అలాంటి మహాకవులకోవలోవారే వాల్మీకి, కాళిదాసు, హోమరు, గ్రీకు నాటకకర్తలు, జోలా, ఇబ్సెన్, టాల్‌స్టాయ్ ప్రభృతులు.

పరకాంతమీది మోహంవల్ల జాతినంతటినీ నాశనంచేసుకున్న రావణాసురునికథను వర్ణించాడు వాల్మీకి. వైవాహికనియమాలకు విరుద్ధంగాప్రవర్తించిన హెలెనా పారిస్‌ల కామకలాపంమూలంగా ఆజాతులురెండూ ఎలా నాశనమయ్యాయో వర్ణించాడు హోమర్. గాంధర్వవివాహం అనేవంకతో కన్యలను లోబర్చుకొని అక్కరతీరినతరువాత ముఖం చాటేయటంవల్ల సంభవించే అరిష్టాలు తెలియజేసేందుకే కాళిదాసు ఏరి ఏరి శకుంతలగాథ నాటకంగా వ్రాశాడు. ఇలానే గ్రీకు నాటకకర్తలు, జోలా, ఇబ్సెన్ ప్రభృతులు, టాల్‌స్టాయ్!

డబ్బు మహాపాపిష్టిది. దానికి లైంగికసంబంధంకూడా జోడయితే ఇక చెప్పే దేముంది? అగ్నికి వాయువు తోడయినట్టే! డబ్బుమీద దురాశ

ఎన్నిసాహాలకయినా దారితీయిస్తుంది.కామం కన్నుకానసీయదు.నీతినియమాలు గంగలో కలుస్తాయి. మానవునిలో పాశవత్వం ప్రవేశిస్తుంది. అలాంటి నీతి నియమరహితజీవితం తాత్కాలికంగా సౌఖ్యంకట్టబెట్టినా చివరికి నరకజ్వాలలలో పడవేస్తుంది. ఈ కాంతా కాంచనాలమీదివ్యామోహం ఒకదానితోఒకటి పెనవేసుకుని ఎలాంటి విషపరిణామాలకు దారితీసేదీ కళ్ళకుకట్టినట్టు చిత్రించిన మహాకవి మహర్షి టాల్‌స్టాయ్!

టాల్‌స్టాయ్‌పేరు వినని వా రుండరు. ఆయనరచనలు ప్రపంచప్రజల మన్నన లందుకున్నాయి. ఆయనకాలంలో అంటే 19 వ శతాబ్దంలో రష్యనుజాతి నావహించిన నైతికపతనాన్ని కళ్ళారాచూసి బాధపడి ఆ నైతిక పతనానికి వ్యతిరేకంగా కలంపట్టినమహాకవి టాల్‌స్టాయ్! చాలాకథలు, గాథలు నవలలు, నాటకాలు ఆ నైతికపతనాన్ని ఒడిచిపెట్టివేసి జాతిని పునరుజ్జీవింపజేయాలనే ధ్యేయంతో రచించాడు టాల్‌స్టాయ్. ఆయన నాటకాలలోనే కాదు, ప్రపంచనాటకాలలోనే ఉత్తమస్థానం అందుకున్న నాటకం 'ద పవర్ ఆఫ్ డార్క్‌నెస్!'

ధనవ్యామోహం—|—కామలోలత్వం - ఈ నాటకానికి కథావస్తువు. గ్రీకు నాటకం ఒడిపస్ తరవాత చెప్పుకోతగ్గ విషాదనాటకం ఇది. దీనిలోని విషాదంముందు హేమ్లెట్, ఒథెల్లో మొదలయిన విషాదరూపకాలలోని విషాదం వెలవెలబోతుంది. ఈరెండు వ్యామోహాలకుగురయిన వ్యక్తుల జీవితాలు, మనసులు ఎలా కుష్కించికుష్కించి మహావేదనఅనుభవిస్తాయోపఠితల హృదయాలకు హత్తుకునేటట్టు చిత్రించాడు టాల్‌స్టాయ్!

ఇందులోని నాయికా నాయకులు చేయని ఘోరపాపాలంటూ లేవు. ఇందులోని నాయిక ముసలిభర్తచాటున ఇంటినౌకరుతో కామక్రీడలు అనుభవిస్తూ డబ్బుకోసం, స్వేచ్ఛకోసం భర్తను విషంపెట్టి చంపి ఉపభర్తను భర్తనుచేసుకుంటుంది. ఈ పాపంలోనుంచి జనించిన వివాహం ఆమెకు సుఖప్రదం కాలేదు. రెండవభర్త డబ్బు చేజిక్కించుకొని ఆమెకళ్ళముందే ఆమె సవతికూతురితో ప్రేమకలాపంసాగిస్తూ ఆమెను ఈసడించసాగాడు. కాలిక్రిందవేసి నలిపివేయసాగాడు. చివరకు ఆమెబ్రతుకు బండబై పోయింది....తనువూ మనసూకూడా కుష్కించిపోయింది....ఒంటరిగా పాపభారం మోయలేకపోయింది. అతగాడూ హంతకుడు కావలసిందే, పాప

మంటే ఏమిటో, హత్యఅంటే ఏమిటో అతనికి తెలిసిరావాలని పగతీర్చుకో డానికా అన్నట్లు అతనిచేత పట్టుబట్టి శిశుహత్యచేయిస్తుంది. సవతికూతు రుకు పెళ్ళిచేసి, భర్తను తిరిగి స్వాధీనపర్చుకుని సుఖిద్దామని కలలుకంటుంది. కాని చివరికి కథ అడ్డంతిరిగి భర్త పాపాలను ఒప్పేసుకోవడంతో సర్వనాశన మవుతుంది. షేక్స్పియర్ సృష్టించిన హేమ్లెట్ తల్లిపాత్రను, లేడీమాక్బెత్ పాత్రను మరిపించేపాత్ర యిది.

ఇక నాయకుడో: అతని నాటకజీవితం పాపపంకిలంతోనే ప్రారంభ మవుతుంది. రాజమ్మ అనే కన్నెపిల్లను చెరిచి, డబ్బుగల యజమానురాలు వలలోచిక్కేసరికి ఆమెను వదిలివేస్తాడు. అక్కడనుంచి ఒకపాపంలో నుంచి ఇంకొకపాపంలోకి అడుగిడతాడు.

యజమానురాలిని వివాహమాడి వావివరుసలు పాటించకుండా ఆమె సవతికూతురుతో ప్రేమకలాపం బాహాటంగా సాగిస్తాడు. చేతినిండా డబ్బు వుందిగా....తాగుడుకు లోనవుతాడు. జీవితమంతా మహాకులాసాగా గడిచి పోతున్నట్లే కనిపిస్తుంది. కాని చేసినపాపం నెత్తిఅణుస్తుంది. శిశుహత్య చేయక తప్పిందికాదు. కన్నతల్లి, చేసుకున్నభార్యా, ఇద్దరూకలిసి అతనిచేత బలవంతాన శిశుహత్య చేయిస్తారు. చూస్తూ చూస్తూ నిండుప్రాణాలు తీయ లేక తటపటాయిస్తాడు. మొరాయిస్తాడు. కాని ఆ రాక్షసులముందు అతని మాట సాగలేదు. పాతపాపాలసంకెళ్లు హత్యచేయిస్తాయి. పసిపిల్లవాని ఎముకలకిర్రు అతనిచెవులలో గింగురుమంటుంది, వెంబడిస్తుంది. మనసును దహించివేస్తుంది. ఆ మనోవేదనకు అంతుకానరాదు. అతనిలో "జీవంచచ్చి పోయింది.....ప్రాణాలు కంఠందాకావచ్చి అడ్డంపడ్డాయి. అవి లోపలికి పోవడంలేదు, బయటకీ పోవడంలేదు." తను చెరిచినకూతుర్ని పెండ్లివారికి అప్పగించవలసివచ్చేసరికి కళ్లు తెరుచుకున్నాయి. పెండ్లిపెద్దలముందు పాపాలన్నీ ఒప్పేసుకుని పోలీసులకు స్వాధీనమవుతాడు. శిశుహత్యచేసే దృశ్యం, పాపాలను ఒప్పేసుకునేదృశ్యం - ఈ రెండుదృశ్యాలను నడపడం లోనూ, ఆపాపాలకు అతనిమనసు దహించుకుపోవడం చూపెట్టడంలోనూ టాల్స్టాయ్ అసమానప్రతిభ గోచరిస్తుంది.

కథానాయకునితల్లి తులశమ్మ. ఈమె బహు విచిత్రమైనవ్యక్తి. మాటకారి, ఏవిషయమైనా ఎదటివానికి నచ్చచెప్పి వారినివశంచేసుకోవడంలో

అంచె వేసినచేయి. 'వయసులో ఉన్నవాళ్ళు ఇంతతిని ఇంత పరాచికాలాడు తూంటారు. ఇవన్నీ లేతవయసులో చెయ్యకపోతే మరెప్పుడు చేస్తారు?' ఇదీ ఈమె సిద్ధాంతం. ఈ సిద్ధాంతమే కొడుకుకి నూరిపోసింది. నిజం చెప్పాలంటే ఈమె సైతాన్ అపరావతారం. ఈ నాటకంలో జరిగిన ప్రతిపాపకార్యానికీ ప్రోద్బలం ఈమెదే. ఈ పాత్ర చిత్రించడంలో కూడా టాల్‌స్టాయ్ శిల్ప చాతుర్యం వెల్లడవుతుంది.

అయితే... పాపాన్నీ పాపినీ ఒకే దృష్టితో చూడవద్దనీ, పాపం నుంచి పాపిని వేరు చేసి చూడగలిగినంత ఓర్పును నీ వలవరచుకున్ననాడు పాపి యెడల నీకు సాహానుభూతే కలుగుతుందనీ జైనేంద్రకుమార్ సిద్ధాంతం. ఆయన రచించిన "కామము ప్రేమ పరివారం" అనే గ్రంథం చాలవరకు ఈ సిద్ధాంతం మీదనే సాగింది. ఈ దృష్ట్యా యోచించినట్లయితే తులశమ్మ అనే పాత్ర కంటేకూడా తులశమ్మపాత్రలోని ధనాకాంక్షే సైతాను అని చెప్పవచ్చు. ధనాకాంక్షకు, అనగా సైతానుకు, వశీభూతుడైన వ్యక్తి మానవత్వానికి దూరమై ఎంత పైశాచికత్వానికి పాల్పడగలడో చిత్రించడంలో పరాకాష్ఠ నందుకుంది ఈ తులశమ్మపాత్ర. అందుచేతనే "జితేంద్రుడు" అనే నవలలో "శ్రమే డబ్బుకావాలి, డబ్బు ధ్వంసమైపోవాలి - డబ్బు అనేది నాశనమైపోవాలి" అని ఉద్ఘోషించాడు జైనేంద్రకుమార్.

సైతానుకు తులశమ్మ ప్రతినిధి అయితే కథానాయకుని తండ్రి రామయ్య కొంచెమించుమించు టాల్‌స్టాయ్‌కి ప్రతినిధి. ఐహిక ఆముష్మిక విషయాలలో టాల్‌స్టాయ్ చెప్పదలచిందంతా అతని నోటనే పలికించాడు. "డబ్బు పాపిష్టిది....అన్నిటికీ మూలం అదే! డబ్బు లేకపోయినా పనిజరుగదు, డబ్బు చేతికొచ్చిందో పంచమహాపాతకాలూ చుట్టుకున్నా యనుకో....ఇదుగో చూడు....భలే సుడిగుండంలో పడ్డారు సుమీ మనుషులందరూ....చూడు.... కష్టంచేసుకు బతకమని దేవుడు నీకు చెక్కపేడుల్లాంటి రెక్క లిచ్చాడే! కాని నువ్వు బాంకులో డబ్బుదాచి ముసుగులన్నీ పడుకుంటూ సోమరిపోతల్లే! బాంకులో డబ్బు నీకు తిండిపెడుతోంది....చూడు....కష్టంచేయకుండానే! అది దొంగతిండి కొండయ్యా....చూడు....నువ్వేమన్నా అను....అది పట్టి తప్పుడుతిండి....నీతిమాలినతిండి! ...చూడు....న్యాయమైందికాదు." "ఒక్కసారి పాపానికి ఒడిగడితే....ఆవెంటనేమరో పాపం!....చూడు....ఆవెంటనే

మరోటి.... చూడు, గొలుసుకట్టులా ఆవరస తెగదు." బహుశా టాల్‌స్టాయ్ ఇవ్వదలచిన సందేశం ఇదేనేమో. అసలు ఈనాటకంకూడా ఇలానే నడుస్తుంది. ఒకపాపకార్యం ఇంకో పాపకార్యానికి దారితీస్తుంది. నాటకంమొత్తం అంతా 'గొలుసుకట్టులా వరసతెగదు !'

కథానాయకుడు చంద్రయ్య రాజమ్మను చెరిచినవాడు ఆమెను పరిత్యజించకుండా తంత్రిమాటవిని వివాహమాడిఉంటే అస లీ నాటకమే లేదు. కాని డబ్బున్నయజమానురాలు అతనినికామించింది. "పెళ్ళిచేసుకోవలసివస్తే చాలమందిని చేసుకోవాలి. అప్పుడు చుట్టూ పెళ్ళాలే వుంటారు. అయినా పెళ్ళెందుకు? పెళ్ళిచేసుకున్నట్టే ఉందిగదూ...."అనుకుంటాడు. డబ్బుకోసం యజమానురాలిని వివాహంచేసుకుంటాడు. అయితే మొదటినుంచీ వ్యభిచారానికి అలవాటు పడ్డవాడు. చేతినిండా డబ్బువుంది. తాగుడుకు దిగాడు. పెళ్ళాం సవతికూతురు చంపుకుతింది. కాదనలేకపోయాడు. దానిఫలితం భార్యతో పోరు. శిశుహత్యాపాతకం. శిశుహత్యాపాతకం జైలుకుదారితీసింది. కథానాయిక బంగారమ్మకూడా ఒకపాపంలోనుంచి వెనక్కితిరగలేక ఇంకో పాపంలోకి దిగిపోయింది. ప్రతిసంఘటనా ఇంకోసంఘటనకు దారితీస్తుంది. కనకనే నాటకరచనాశిల్పం ఇందులో పరాకాష్ఠఅందుకుందని చెప్పాల్సి ఉంటుంది.

అంతేకాదు ఇందులోనిపాత్రలు నేటికీ మనకళ్లముందు వాస్తవిక ప్రపంచంలో కనిపిస్తాయి. అందుకే ఈనాటకం విశ్వజనీనత సంపాదించుకుంది.

పాత్రచిత్రణలోనేమి, రచనాశిల్పంలోనేమి, పాత్రల అంతరజీవితాలను కళ్ళకుకట్టినట్లు ద్యోతకంచేయడంలోనేమి టాల్‌స్టాయ్‌సామర్థ్యం అసమాన మనడం అతిశయోక్తి కాదు.

టాల్‌స్టాయ్ 'ద పవర్ అఫ్ డార్క్‌నెస్' అనుసరించి భారతీయ వాతావరణానికి అనుగుణంగా మలచింది సుప్రసిద్ధహిందీరచయిత జైనేంద్రకుమార్. ఈయన టాల్‌స్టాయ్‌నాటకాన్ని "పాప్ ఔర్ ప్రకాష్" అనేపేరుతో అనువదించి భారతప్రభుత్వబహుమానం పొందారు. నేటి భారతీయరచయితలలో అగ్రశ్రేణికిచెందిన ప్రముఖుడు జైనేంద్రకుమార్. స్వతహా జైనేంద్రకుమార్ ఒక సుప్రసిద్ధ రచయిత - తత్త్వవేత్త - సత్యాన్వేషి. ఈయన

ఏమిరచించినా అందులో ఒకానొక పరమసత్యం తప్పక సాక్షాత్కరిస్తూ వుంటుంది పాఠకునికి. అటువంటి ఉత్తమశ్రేణిరచయిత అయిన జైనేంద్ర కుమార్ తనభావాలకు పూర్తిగా అనుగుణంగా ఉండటంవల్లనే టాల్‌స్టాయ్ నాటకానికి హిందీరూపాంతరం కల్పించివుండవచ్చునని తోస్తుంది. ఇటువంటి భావసామ్యం ఋషితుల్యులైన మహాపురుషులలో పూర్వపరిచయం లేకుం డానేకూడా సంఘటించుతూవుండటం కద్దు. ఇప్పటివరకు జైనేంద్రకుమార్ ఎన్నో తాత్త్వికగ్రంథాలు, నవలలు, కొన్నివందల కథలు వ్రాశారు. ప్రేమ్ చంద్‌వంటి మహాకవుల ప్రశంస లందుకొన్నారు. ఈయనరచనలు దేశ, విదేశభాషలు పెక్కింటిలోకి అనువదింపబడి ప్రచురింపబడ్డాయి. ప్రేమ్ చంద్ పబ్లికేషన్సువారు జైనేంద్రసాహిత్యమంతా తెలుగులో వరుసగా ప్రచురిస్తున్నారు.

జైనేంద్రుని "పాప్ ఔర్ ప్రకాష్" నకు తెలుగుసేత ఈ "చంద్ర య్యలో చైతన్యం." అనువాదకులు శ్రీ దండమూడి మహీధర్. హిందీ భాషలో మంచి పండితులు. హిందీచందమామ మొదలైన పత్రికలలో సహాయసంపాదకులుగా పనిచేస్తూ, అనేక హిందీరచనలు అనువదించారు. ఈనాటకంలో సంభాషణలు సాఫీగా నడిచాయి. భాష సరళంగా సుబోధ కంగా ఉంది. ఇటువంటి మహానాటకాన్ని తెలుగునాటకసాహిత్యానికి అర్పిం చిన శ్రీ దండమూడి మహీధర్, ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్‌వారూ అభినంద నీయులు.

"నాట్యకళ"
విజయవాడ-2
20—2—59

శ్రీనివాస చక్రవర్తి

# పాత్ర పరిచయం

—***—

జోగయ్య : ఒక సామాన్య రైతు. వయస్సు సుమారు నలభై రెండు. రెండవ వివాహము చేసుకున్నాడు. అస్వస్థుడు.

బంగారమ్మ : జోగయ్య భార్య. వయస్సు ఇరవైయేడు-ఇరవై యెనిమిది. అలంకారప్రియ.

మేనక : జోగయ్య మొదటి సంబంధం కూతురు. వయస్సు పదహారు. కొద్దిగా చెవుడు. అవికసిత మస్తిష్కం.

సునంది : జోగయ్య. బంగారమ్మల కుమార్తె. వయస్సు పది.

చంద్రయ్య : జోగయ్య నౌకరు. అందగాడు. వయస్సు ఇరవై అయిదు. అలంకార ప్రియుడు.

రామయ్య : చంద్రయ్య తండ్రి. వయస్సు యాభైకి పైగా కల్లకపటం ఎరుగని పాపభీతిగల రైతు.

తులశమ్మ : రామయ్య భార్య. చంద్రయ్య తల్లి. వయస్సు సుమారు యాభై.

రాజమ్మ : ఒక అనాథ బాలిక. వయస్సు ఇరవైరెండు.

దేవకి : జోగయ్య చెల్లెలు.

కొండయ్య : వయసులో వున్నపుడు సిపాయిగా పనిచేసిన ఒక ముసలి నౌకరు.

కృష్ణారావు : రాజమ్మ భర్త.

పెళ్లికొడుకు : మేనకకు కాబోయేభర్త.

నారాయణస్వామి : పెళ్లికొడుకు తండ్రి.

కుంతి : ఒక పొరుగింటావిడ.

రెండో పొరుగింటావిడ.

ఒక పిల్ల.

రెండో పిల్ల.

పోలీసు ఆఫీసరు

బండివాడు.

మున్సబు.

పురోహితుడు.

పెండ్లికివచ్చిన అతిథులు.

పాటలుపాడే అమ్మాయిలు వగైరా....

# చంద్రయ్యలో చైతన్యం

## [ఒకటో అంకం]

[చలికాలం. ఒక పెద్దగ్రామము. జోగయ్య మండువా లోగిలి. జోగయ్య మంచంమీద కూర్చున్నాడు. బంగారమ్మా, మేనకా నెమ్మదిగా ఏదో గొణుగుకుంటూ రాట్నం వడుకుతున్నారు]

జోగయ్య : (కిటికీలోగుండా బయటికి చూచి) ఈ ఎద్దు మళ్లా ఊడదీసుకున్నది. ఎవరికీ ధ్యాసేలేదు. బండెలదొడ్లోపడుతుంది పోయి చంద్రయ్యా ! ఓ చంద్రయ్యా ! చెవుడేమయినా వచ్చిందా ఏంరా నీకు ?.... (ఆడవాళ్ళవైపు తిరిగి) ఆపండి, వడికినంతవరకు చాలులే ! మాటా పలుకూ విన్పించనీయకుండా ఒకటే గొడవ :

చంద్రయ్య : (బయటినుంచి) ఏమిటండీ ?

జోగయ్య : ఎడ్లను కొస్త లోపల కట్టేయరా !

చంద్రయ్య : అలాగేనండి, కట్టేస్తాను.

జోగయ్య : (తలూపుతూ) కట్టేస్తాడు! అబ్బా, ఏం నౌకర్లో ఏమిటో! కొంచెం నా ఆరోగ్యం కుదటబడనీయండి ! ఒక్కొక్కరి విషయం చూస్తాను, అబ్బా ! అన్నీ చిక్కులే ! ఒక్కపని సరిగా కావటంలేదు. (లేచి మళ్ళీ కూర్చుంటాడు) చంద్రయ్యా !.... ఓ చంద్ర (దగ్గొస్తుంది).... ఎంతసేపని నోరు చించుకోమంటావురా ?....ఏమేయ్....మీ ఇద్దరిలో ఎవరేనా వెళ్ళండి. ఒసేయ్, మేనకా, వెళ్ళి ఎద్దును కొస్త లోపలకి తోలిరా !

మేనక : ఏమిటీ....? ఎద్దునా ?

జోగయ్య : కాదు, నా తలకాయ.

మేనక : సరే ! (వెళ్ళిపోతుంది)

జోగయ్య : అబ్బ! వీడు వట్టి రౌడీవెధవ దొరికాడు మనకు. పనీ పాటా చేయటం చేతగాదు. ఇటుపుల్లతీసి అటుపెట్టడానికి మహాబాధగా ఉంది.

బంగారమ్మ : మహా నీవేదో ఘనకార్యం చేస్తున్నట్టు! వసారాలో కూర్చుంటావు. లేకపోతే మంచంమీద తిష్ఠవేస్తావు. అదిచెయ్యి, ఇదిచెయ్యి అని ఆజ్ఞాపిస్తూంటావు.... అంతేగా—

జోగయ్య : అంతగాక నెత్తి నెక్కించుకోమంటావా ? అట్టాగయితే నోట్లో దుమ్ముకొట్టుకున్నట్టే ! అబ్బా ! ఏం మనుషులు !

బంగారమ్మ : పనిమీదపని చెబుతూంటే ఎవరికైనా ఎట్టాఉంటుంది? పైగా ప్రతిదానికీ పేర్లుపెడతావు. మహాచేసేవాడికైనా చెల్లదు.

జోగయ్య : (నిట్టూరుస్తూ) దీని సిగతరగ! ఈ జబ్బేలేకపోతే.... వాణ్ణి అసలు ఒక్కనిమిషం ఉంచేవాణ్ణి కాదు ! ఏమనుకున్నావో ఏమిటో !

మేనక : (దూరంగా) ఛా ఛా....ఛా ఛా....

[ఆవుదూడ అరుస్తుంది. ఎడ్ల గిట్టలచప్పుడు విన్పిస్తుంది. వెదురు వాసాలతోకట్టిన గేటుతెరిచి మళ్లామూసిన శబ్దం.]

జోగయ్య : వాడికి ఏమితెలిసినా తెలియకపోయినా ప్రతిదానికీ సరే ననటం తెలుసు. వాణ్ణి పంపించేస్తే బావుండును.

బంగారమ్మ : (ఈసడింపుగా) పంపించేస్తే ఎందుకు బావుండదు,మహా బాగా ఉంటుంది. ముందు నీ శరీరం బాగుచేసుకో ! అప్పుడు నీ ఇష్టంవొచ్చి నట్టు మాట్లాడుదుగాని !

మేనక : (వస్తుంది) అబ్బా! ఏం తిప్పలు పెట్టినాయ్! దానిదుంపదెగ ! ఆ ఎలపపెద్దు మరీను....

జోగయ్య : చంద్ర య్యేమయ్యాడు ?

మేనక: ఎవరు ?....చంద్రయ్యా?....అయనకేం....బాగానే ఉన్నాడు. బజార్లో నిలబడి దిక్కులు చూస్తున్నాడు.

జోగయ్య : బయట నిల్చున్నాడా ?....ఏం చేస్తున్నాడు ?

మేనక : ఏం చేస్తున్నాడు ? ముచ్చట్లు చెపుతున్నాడు !

జోగయ్య : అబ్బా ! దీనితో మాట్లాడటమే కష్టం. ఎవరితోనే వాడు ముచ్చట్లు చెప్పేది ?

మేనక : (విన్పించుకోకుండా)....ఆం ఏమిటీ ?

[జోగయ్య మేనకను పక్కకుతప్పుకోమన్నట్టుగా చేత్తోసంజ్ఞచేస్తాడు బయటికిచూస్తూ, మేనక రాట్నం దగ్గరకూర్చొని వడుకుతుంటుంది]

సునంది : (తల్లిదగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చి) ఒసే అమ్మా ! చంద్రయ్య నాన్న వచ్చాడే ! నిజంగానమ్మా ! చంద్రయ్యను తీసుకెళ్తాడట !

బంగారమ్మ : సరేలే, నీ అబద్ధాలూ, నువ్వూను !

సునంది : కావాలంటే పందెంవేసుకుందాం. (నవ్వుతుంది) నే బయటికి వెళ్తూంటే చంద్రయ్య కన్పించాడు, 'సునందమ్మా ! నే వెళ్ళిపోతున్నా. నువ్వు సుఖంగా ఉండు. నా పెళ్ళికి నువ్వు తప్పకుండా రావాలి సుమీ !' అనిచెప్పి నవ్వటం మొదలెట్టాడు. నిజంగానమ్మా !

బంగారమ్మ : (భర్తతో) చూశావా ? వాడికి మనంతప్ప గతిలేదన్నట్టు మాట్లాడావు. ఇప్పుడు చూడు, వాడంతట వాడే వెళ్ళిపోతాడట ! ఇప్పుడే మంటావో అను !

జోగయ్య : వెళ్తే వెళ్ళనియ్. మనుషులే కరువయ్యారా ఏం ?

బంగారమ్మ : మరి మనకు వాళ్ళివ్వాల్సిన అప్పుసంగతేమిటి ? (సునంది గుమ్మంలో నిలబడి, కాస్సేపు వాళ్ళమాటలు విని వెళ్ళిపోతుంది)

జోగయ్య : వేసవిదాకా పనిచేసి ఆ అప్పుతీర్చి మరీ పొమ్మంటే సరి !....

బంగారమ్మ : ఎప్పటికైనా వాణ్ణి వెళ్ళగొట్టాలనే....పుట్టింది నీకు.... పూటకి సోలెడు గింజలు ఆదా అవుతాయి ! ఇంతేనా....నీ ఆలోచన?.... చాకిరీఅంతా చేయటానికి నేనున్నాను ! ఇక నీ ముద్దులకూతు రున్నదంటే ఇటు పుల్లదీసి అటు పెట్టలేదు. నీకేమో వసారాలో మంచానికి కరుచుకు పడుకోవటంకంటే మరోపని లేదు ! నీ ఆలోచనలు కనిపెడుతున్నాలే !

జోగయ్య : ఓసి నీదుంపదెగ ! ఇంకా నోట్లోమాట నోట్లోనే ఉంది. ఆలోచనాలేదు పాలోచనాలేదు. అప్పుడే వాణ్ణి పీకిపారేసినట్టుగానే విరుచుకు పడతావేమే ?

బంగారమ్మ : కొంపంతా పశువులతో నింపేశావు ! ఆ అవునుకూడా అమ్మలేదు ! గొఱ్ఱెలు మేకలు మందకుమంద తెచ్చిపెట్టావు ! ఇన్ని గొడ్లను చూట్టానికి ప్రత్యేకం ఒక మనిషి కనిపెట్టుకుని ఉంటేనేతప్ప పని జరగదు. ఇంతఉంటే నీవేమో వాణ్ణికాస్తా పనిలోనుంచి పీకేస్తానని బెదరిస్తున్నావు. నేను ముందే చెబుతున్నా : మొగాళ్ళుచేసే అపనులు నేను ముట్టుకునేదే లేదు ! నేనుకూడా ఒక మంచం వాల్చుకుని వసారాలో పడిఉంటాను ! ఎక్కడ పనులు అక్కడ నాశనంగానీ....అవన్నీ నువ్వే చూసుకో....చేసుకో.... మానుకో....నాకేం తెలీదు !

జోగయ్య : ఒసే మేనకా! అది అపుచెయ్యి, కాస్తవెళ్ళి గొడ్లకు నీళ్లూ మేతా పన్లు చూడు నువ్వు.

మేనక : ఏమిటీ ? నీళ్లూ మేతా ? సరే ! (లేచివెళ్ళి ఒక తాడు తీసుకుంటుంది)

బంగారమ్మ : నేను పనీ గినీ చేసేదిలేదు. ఆ గొడ్లుగోడ విషయం

ఇక నువ్వు చూసుకోవలసిందే. ఇప్పటిదాకా అనుభవించాను చాలు! ఇక నాదగ్గర ఎవరి ఆటలూ సాగవు.

జోగయ్య : సరే సరే, అపు! అర్థంపర్థంలేని మాటలన్నీను....

బంగారమ్మ : అవును కాదు అని చెప్పటం చేతగాదు; తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళంటావు! అటూ ఇటూ కాకుండాఉన్నావు. పందల్లే పొట్టకింత తినటం పడుకోటం! రెండే పనులు. వేరే పనేల్లేదు.

జోగయ్య : (ఉమ్మేస్తాడు. భుజంమీద ఉత్తరీయం వేసుకుంటాడు) పాడుగోల! ఎంత గయ్యాళిగంపరా భగవంతుడా! సరే, వెళ్ళి నేనే చూసుకుంటానులే! నీ పోరు పడలేకుండా ఉన్నాను.

బంగారమ్మ : (వెళ్లేవాడి వెన్నున) ఫో! నీ చావు నేలబడ!

మేనక : ఎందుకే అట్లా తిట్టుకుంటావు అయన్ని?

బంగారమ్మ : నీకెందుకే.... నీ జిమ్మడ! నువు నోరుముయ్యి!

మేనక : (తలుపుదాకా వెళ్ళి) నీవెందుకు తిట్టేది నాకు తెలీకపోలేదులే!.... నువ్వే నోరుమూసుకో! నన్ను ఒకటంటే నేను రెండంటాను. నీబుద్ధి పొట్టి కుక్కబుద్ధి.... కుక్కబుద్ధి! నేను భయపడతాననుకున్నావా?

బంగారమ్మ : ఏమిటీ?.... ఏమంటున్నావు? (లేచి నిలబడి కొట్టడానికి కర్ర వెదుకుతుంది)... నిలబడు! అక్కడ నిలబడు! నీవాళ్ళు వాలవకపోతే నాపేరు కాదు!

మేనక : (తలుపుతెరుస్తూ) ఓసి కుక్కా, ఓసి దయ్యమా! ఓసి దయ్యమా, ఓసి కుక్కా! ఓసి కుక్కా, ఓసి దయ్యమా! (పారిపోతుంది)

బంగారమ్మ : (ఆలోచించి) 'నాపెళ్ళికి తప్పకుండా రావాలిసుమీ!' అన్నాడటనే! ఏమిటిది? వాడు పెళ్ళిచేసుకోటమే! జాగ్రత్త చంద్రయ్యోయ్! నిజంగా నీకు ఇట్టాంటి బుద్ధిపుట్టిందో.... నువ్వు మళ్ళీ.... ఊహూం, వాడు లేకుండా నేను ఉండలేను. వాణ్ణి పోనివ్వను.

చంద్రయ్య : [ప్రవేశించి నాలుగువేపులా పరీక్షగా చూస్తాడు. బంగారమ్మను ఒంటరిగా చూసి దగ్గరకొస్తాడు నెమ్మదిగా అంటాడు]... పెద్ద చిక్కొచ్చింది మా నాన్నతో! ఏంచేయాలో తోచటంలేదు. వెళ్లిపోదాం రమ్మంటున్నాడు. వచ్చి పెళ్ళిచేసుకుని ఇంటిపట్టునే ఉండమంటున్నాడు.

బంగారమ్మ : వెళ్లు! వద్దన్నదెవరు? వెళ్లి పెళ్లిచేసుకో! నాతో ఎందుకు చెప్పటం?

చంద్రయ్య : వాహ్! బలేమాటన్నావే! అప్పుడే మూతిముడుచు కున్నావు! ఈ ప్రమాదం ఎలా తప్పించుకోటమా అని నే నాలోచిస్తూంటే నువ్వు నామీద ఒంటికాలిమీద లేస్తున్నావే. నువ్వుకూడా నన్ను పెళ్ళిచేసుకో మంటున్నావా? ఏఁ, ఎందుకని? (కన్నుగీటి) నన్ను మరచిపోయావా?

బంగారమ్మ : ఆఁ వెళ్లు! వెళ్ళి పెళ్ళిజేసుకో! నాకెందుకు!

చంద్రయ్య : అంత కోపమైతే ఎట్టాగు? అంటుకోబోతే ఆమడ దూరం పరుగెత్తుతున్నావే; అసలు విషయమేమిటో చెప్పరాదూ?

బంగారమ్మ : విషయమా? నేను చెప్పాలా? నువు నన్నుమోసగించా లని చూస్తున్నావు. అందుకనే నీవంటే నాకిష్టంలేదు. తెలిసిందా?

చంద్రయ్య : ఓహో నారాణీ! నిన్నుమరిచిపోతానా నేను? బొందిలో ప్రాణంఉండగానేనా నిన్ను మరచిపోవటం! నేనా మోసంచేసేది? ఎప్పుడూ కాదు. మగవాడు ఒక్కమాటమీదనే నిలబడతాడు. ఒకవేళ నన్ను బల వంతంగా తీసుకెళ్ళి పెళ్ళిచేసినా తిరిగి మళ్ళీ నీ దగ్గరకే వచ్చేస్తాను. ఉన్న దల్లా ఇంటిదగ్గరే ఉండిపొమ్మంటాడేమోననిగాని....

బంగారమ్మ : పెళ్లయితే నీకు నా అవసరమేముంటుందిక?

చంద్రయ్య : అరె, అయితే ఇంతకోపమా? మరి తండ్రిమాట తప్పించుకోటం ఎలాగు?

బంగారమ్మ : అవునులే. తప్పంతా తండ్రిమీదకు నెట్టు! ఇందులో నీ నాటకం ఎంతఉందో నీమనసుకే తెలుసు! నాకు తెలీదనుకున్నావేమో.... ఆ రాజమ్మతో నీకున్నసంబంధం! అంతాతెలుసు! అదే నిన్ను పెళ్ళిచేసుకుంటేగాని వీల్లేదని పట్టుపట్టివుంటుంది. ఆవేళ అది ఇక్కడికి ఊరికే వచ్చిందా ?

చంద్రయ్య : రాజమ్మా! అదేమిటి ? దానికీ నాకూ సంబంధమేమిటి ?....దానిచుట్టూ ముసురుకునే మందేమయినా తక్కువుందా ?

బంగారమ్మ : అయితే మరి మీ నాన్న ఇక్కడికెందుకొచ్చినట్టు.... నువు కబురుచేయకపోతే! ఇంతమోసమా నువు చేసేది ?....నన్నెందునా కాకుండా చేశావు. (ఏడుస్తుంది.)

చంద్రయ్య : నీకు భగవంతుడంటే నమ్మకముందా ? అయితే విను : నాకు నిజంగా ఏమీ తెలీదు. ఆవంతకూడా తెలీదు, నిజంచెబుతున్నాను. ఇదంతా మా నాన్నకుపుట్టిన బుద్ధే!

బంగారమ్మ : నీకు ఇష్టంలేకపోతే నిన్ను బలవంతం ఎవరుచేస్తారు? డూడూ బసవన్నా అంటే నువు తలూపుతున్నావు! లేకపోతే గాడిదను బందెలదొడ్లోకి తోలినట్టుగా నిన్నెవరేనా తోలగలరా ?

చంద్రయ్య : అవుననుకో, కాని తండ్రిమాట కాదనటంమాత్రం కొంచెం కష్టమే! అయినా నెత్తిన నోరుబెట్టుకుని ఆయనకు నేను చెబుతూనే ఉన్నాను—నా కిష్టంలేదని!

బంగారమ్మ : అంతే, ఆ మాటమీదనే నిలబడిఉండు, ఏచిక్కూలేదు!

చంద్రయ్య : మాటమీద నిలబడి ఉండమంటే-మా ఊరి విషయమొకటి గుర్తుకొచ్చింది ; ఏం జరిగిందో తెలుసా ?....ఒకతను ఇలాగే తను పట్టినకుందేటికి మూడేకాళ్ళని పట్టుపట్టి కూర్చునేప్పటికి ఊరిపెత్తందారు వాణ్ణి పిలిపించి పొట్టురేగేట్టు కొట్టించాడు. మొండిపట్టుకు ఫలితం ఏమో

ఇప్పటికేనా తెలిసిందా ?....అట్టా వాళ్లు చిట్లగొట్టించుకోటం నాకిష్టంలేదు! ఆ మర్యాదకూడా జరిగిందంటే....

బంగారమ్మ : అధికప్రసంగం చాలించు! ఇదుగో చూడు చంద్రయ్యా, ఒకటేమాట చెబుతున్నా : నువ్వేగనక ఆ రాజమ్మను పెళ్ళిచేసుకుంటే నేనేం చేస్తానో చెప్పల్లేను. నేను అధర్మానికి పాలుపడ్డాను. పాపకృత్యాలకు ఒడి కట్టాను. ఇక వెనక్కు తిరగటం నాతరంకాదు. నువెళ్లి పోతానంటావా.... సరే, పో!....నేను యే నుయ్యో....గొయ్యో....

చంద్రయ్య : అరె, నేనెందుకెళ్లిపోతాను ? వెళ్లాలనుకుంటే ఎప్పుడో వెళ్లి ఉండేవాణ్ణి కాదూ ?....ఆ లక్ష్మయ్యగారు తన దగ్గరికొచ్చి గుర్రాలమీద అజమాషీ పని చూడమన్నాడు. వెళ్లి ఉంటేజీవితం మజాగా గడిచిపోయేది! కానినేను వెళ్ళలేదు. ఎందుకటా ?—నాదింకా చిన్నవయస్సు. యౌవనంలోనే ఉన్నాను; ఇద్దరికి నేనంటే ఎంతో ఇషం! కాని....నువు నన్ను ప్రేమించటంలేదంటే అది వేరే విషయం.

బంగారమ్మ : చంద్రయ్యా, నువ్వొక విషయం గుర్తుంచుకో; మా ముసలాణ్ణి చూడబోతే కాటికి కాళ్లుచాచుకొని కూర్చున్నాడు. ఆయన కాస్తా గుటుక్కుమంటే నువు నన్ను పెళ్లిచేసుకోవచ్చు, ఇప్పటి మన సంబంధం బయటికి పొక్కనేపొక్కదు! అప్పుడు నువ్వే ఈ ఇంటికి యజమానివి!

చంద్రయ్య : ఏమో, ముందేం జరుగుతుందో ఎవరు చూశారు ? అయినా నాకా చింతలేదు. 'నేను చేసేది నౌకరీ కాదు, నా సొంతపని!'— అన్నభావంతోనే నేనంతా చక్కబెట్టుకు పోతున్నాను. యజమానికి నేనంటే ఇష్టం! ఆయన భార్యకు నేనంటే ప్రాణం. ఇంకా చుట్టుపక్కల ఆడవాళ్ళు కూడా నామీద కన్నేసి ఉన్నారంటే—అది నా తప్పేమీకాదు.

బంగారమ్మ : మరి నువు నన్ను ప్రేమిస్తున్నావా ?

చంద్రయ్య : (కౌగలించుకొని) నువ్వు నారాణివి ! నిన్ను ప్రేమించక పోవటమేమిటి ? నువెల్లప్పుడు నా హృదయంలోనే ఉంటావు.

[అప్పుడే తులశమ్మ ప్రవేశిస్తుంది. వాళ్లిద్దర్నీచూచి చూడనట్టు నటిస్తుంది. నోట్లో నోట్లోనే 'శివశివ, శివశివ....' అంటూ వుంటుంది. బంగారమ్మ, చంద్రయ్య దూరంగా నిల్చుంటారు]

తులశమ్మ : ఆఁ, దీంట్లో ఏముందిలేబాబూ! కామినీక్రీడ....సహజమేలే! వయస్సులోఉన్నవాళ్లు ఇంత తిని, ఇంత పరాచికాలాడుకుంటూ ఉంటారు. ఇవన్నీ లేతవయసులో చెయ్యకపోతే మరెప్పుడుచేస్తారు?....సరేగాని, ఒరే నాన్నా ! బయట మీ యజమాని నిన్ను పిలుస్తున్నారు !

చంద్రయ్య : నేను గొడ్డలి తీసుకెళదామని వచ్చాను !

తులశమ్మ : తెలుసు తెలుసు, నా కంతాతెలుసులేరా నాన్నా ! గొడ్డలనేది ఆడదానిదగ్గిరే ఉంటుంది.

చంద్రయ్య : (గొడ్డలితీసుకుంటూ) అమ్మా, నా పెళ్ళినిగురించి ఆలోచిస్తున్నారటగా మీరు ? నిజమేనా ? ఇప్పుడు నాకు పెళ్లేమిటి ? అసలు నాకది ఇష్టంలేదు.

తులశమ్మ : అవునురా నాన్నా ! ఎందుకొచ్చినపెళ్ళి ! లేకపోయినా జరిగిపోతున్నదిగా ! సాగుతున్నబాట బాగానేఉండె ! నే నేమన్నా కళ్ళులేని కబోదినిరా నాన్నా ! ఈ తిరుగుళ్ళన్నీ తెచ్చిపెడుతున్నవాడు మీ నాన్నే ! సరే, నువ్వెళ్ళు ! అదేదో మేము చక్కబెడతాంలే !

చంద్రయ్య : ఏమిటో, అంతావిచిత్రం! ఒక గడియలో పెళ్లంటారు. మరోగడియలో ఏమీవద్దు పొమ్మంటారు ! నాకేమీ అర్థంకావటంలేదు మీ మాటలు ! (వెళ్లిపోతాడు)

తులశమ్మ : ఏమమ్మాకోడలా, బంగారమ్మా ! ఇంకా వాడికి పెళ్లెందుకు ? అంటా ఈ ముసలాడికి పుట్టినబుద్ధి ! పెళ్లికొడుకులేకుండా పెళ్లేమిటి నాబొంద? అసలు అన్నీ ఇంట్లో అమిరిఉంటే అక్కడా ఇక్కడా దేవులాట్టం దేనికి ? ఏమంటావు ? ఇంత తిని నలుగురికిపెట్టే తాహ తున్నప్పుడు.... కాళ్లతిప్పట దేనికి....చెప్పు? (కన్నుగీటి) నేను ఆ మాత్రం తెలుసుకోలేకుండా ఉన్నానా ?

బంగారమ్మ : ఇంకా నీ దగ్గర నాకు దాపరికమెందుకు అత్తా ?— నీకన్ని సంగతులూ తెలుసు ! నేను కాలుజారినమాట నిజం. నీ కొడుకుమీద నాకు మనసైంది !

తులశమ్మ : పిచ్చిపిల్లా, ఈసంగతులన్నీ నాకు తెలీవనుకున్నావా ? బంగారమ్మ నా బంగారుకోడలు ! ఈ తులశమ్మకూడా ప్రపంచంచూచింది. ఒక్కమాట చెబుతాను వినుకోడలా !—ఈ తులశమ్మదృష్టి రాతిగోడల్ని చీల్చుకొని పోగలుగుతుంది, లోకంలో ఎవరూ నా కళ్ళు కప్పలేరు ! కాని ఎంతవరకు చూడాలో అంతవరకే నేను చూస్తాను....ఆపైన చూడను.... ఆపైన తెలుసుకోను....విన్నావా కోడలా ! నాకు మాత్రం తెలీదూ ?.... వయసు పెళ్ళాలకు నిద్రమందు కావాలి. అది నేను తీసుకొచ్చానులే !.... (రుమాలువిప్పి కాకితంపొట్లంతీస్తుంది.) ఈ తులశమ్మకూడా యౌవన వసం తాలు చూడకపోలేదు ! ముసలి భర్తలతో కాపరం చెయ్యాలిసొచ్చినప్పుడు ఒకటి రెండు విషయాలు గుర్తుంచుకోవాలి ! ఇలాంటి సమయంలో అనుస రించాల్సిన ఉపాయాలు నాకు బోలెడు తెలుసు ! నీ మొగుడు నిజంగా వట్టి డొల్ల, ఏమీ అక్కరకురాడు, రేపో నేడో మన్నయిపోకమానడు. ఎవరు వెళ్ళదీయగలరు కోడలా, అలాంటివాడితో రోజులు ! రామ, రామ ! కత్తితో పొడిచినా ఒక్క నెత్తురుచుక్కంటూ వస్తుందోలేదో ఆయన శరీరంనుంచి! చూస్తూఉండు,వచ్చే వసంతకాలంనాటికి మీఆయనస్వర్గానికి వెళ్లకపోతే నన్ను

మారుపేరున పిలువు! ఆతరువాత ఎవరో ఒకరు ఇంట్లో ఉండాలి! నాకొడుకు నీకు తోడు ఉండనేఉంటాడు. మాచంద్రన్నకేమన్నా వంకఉందా? వాడిలాంటి మనిషి వెదికితేమాత్రం దొరుకుతాడా? వాడికి నచ్చిన చోటునుంచి తప్పించటం నా కిష్టంలేదు. నువ్వేచెప్పు? దానివల్ల నాకు ఒరిగేదేమిటి? నేనేమీ తెలియనిదాన్నా? నా కొడుకంటే నాకు చేదా? వాడికి నేను శత్రువునా?

బంగారమ్మ : సరేసరే, ఎలాగైనా ఇక్కడే ఉండేట్టుచేయి.

తులశమ్మ : వాడెక్కడికిపోతాడు? ఇక్కడేఉంటాడు. కోడలా, చెప్పుడుమాటలు వినబోకు! నువ్వు మా ముసలాయన్ను ఎరుగుదువుగా? కొంచెం తలతిరుగుడుమనిషి! ఏదైనా పట్టుపడితే అయ్యేదాకా వదలడు! అలాంటి మంకుపట్టు ఆయనది.

బంగారమ్మ : అసలు ఈ గొడవ ఎలా బయలుదేరింది?

తులశమ్మ : ఎలా బయలుదేరిందంటావా? కోడలా, నీకు నా కొడుకెలాంటివాడో తెలుసు! ఆడపిల్లలువాడంటే పడిచస్తారు. వయసులో వున్నాడాయె, పైగా మంచి అందగాడుకూడాను. అసలు ఈ విషయం నేను నీకు చెప్పగూడదనుకో, అయినా తప్పదు!....వాడు రైలువేలో కొంతకాలం పని చేశాడు, నీకు తెలుసుగా? అక్కడ వీడికొక దిక్కుమాలింది దొరికింది. అన్నంనీళ్లు కాచిపెడుతుండేది. చివరకు వీడివెంటబడింది.

బంగారమ్మ : ఎవరూ? రాజమ్మా?

తులశమ్మ : మరే! అదేనమ్మా, దాని శిరసుగొట్ట!....ఇంకా దానికీ వీడికీ అసలు ఏంకలిసిందో ఏంలేదో....ఎట్టాగయితేనేం దాని విషయం మా ముసలాడి చెవినబడింది! గిట్టనివాళ్ళెవరేనా చెవులు కొరికారోలేక ఆ ముదనష్టపుదేవచ్చి ముసలాయనదగ్గర గోలకెత్తిందో....నాకుమాత్రం తెలీదుతల్లీ....

బంగారమ్మ : అంత సిగ్గువిడిచి ఎలా వెళ్ళిందట్లా అది?

తుల : ఇక మా ముసలాయనున్నాడంటే వట్టి మూర్ఖపుమనిషి. ఆపిల్ల చెప్పిందంతా వినేప్పటికి బుర్ర తిరిగిపోయింది. అప్పటినుంచి....'పెళ్ళో పెళ్ళో' అని ఒకటే జపం ! 'ఇంతాజరిగాక పెళ్లికావల్సిందే' నంటాడు. వెంటనే పిల్లవాణ్ణి ఇంటికి పిలిపించమని కారాలు మిరియాలు నూరాడు. ఎట్టాగయినాసరే పెళ్ళి చేసెయ్యాలని ఆయన పట్టుదల ! నేనాయన మనసు మార్చాలని శతవిధాలా ప్రయత్నించిచూశాను; కాని వీలుపడిందికాదు. అప్పుడు దీనికి విరుగుడుగా నేనూ ఏదోఒక పన్నాగం పన్నాలని ఆలోచించాను. లేకపోతే ఇలాంటి మూర్ఖులు మన చెప్పుచేతల్లోకి రారు ! అందుకని నేను ఆయన చెప్పినదానికల్లా ఊఁకొట్టాను. అఁ!....ఇటువంటివాళ్ళతో సై అంటే సై అంటూనే అదనుచూసి ఆయువుపట్టుమీద దెబ్బకొట్టాలి! నీకు తెలియందేముంది ? కావాలంటే ఆడది....కన్నుమూసి కన్నుతెరిచేలోగా.... లక్షఉపాయలు ఆలోచిస్తుంది. ఇదిమనకి లెక్కా డొక్కా ! అందుకని మా ముసలాయనతో సరేనన్నాను. పిల్లవాడి పెళ్ళి చేసేద్దామన్నాను. పెళ్ళికి ముందు పిల్లవాడి మనసెలా ఉందోకూడా తెలుసుకుందామన్నాను. కావాలంటే జోగయ్యగారి అభిప్రాయంకూడా అడుగుదామన్నాను. ఇట్టా మాట్లాడుకుని మేము ఇక్కడికొచ్చాం కోడలా !

బంగారమ్మ : అలాగా! కాని ఈ పని అవుతుందా ? కొంపతీసి మీ ముసలాయన చంద్రయ్యని పెళ్లిచేసుకుంటేకాని వీల్లేదని నిర్బంధిస్తే ?

తులశమ్మ : వాగులో నిర్బంధం ! ఏమిటాయన నిర్బంధం? నీకెందుకు, నువు గాభరాపడమాకు ! ఆపెళ్ళి జరగదు. నీ మొగుడు దగ్గరకు నేను స్వయంగా వెళ్తున్నా. అక్కడ నేనీ కుళ్లుదోతులందర్నీ సుబ్బరంగా కడిగేసి విడిచిపెడతాను. కలికానికిలేకుండా కడిగేస్తాను. నేను రావడంకూడా పరిస్థితి ఏపాకానికొచ్చిందో చూద్దామనే వచ్చాను... చూచాను....ఈ స్థితిలో వాడికి పెళ్ళిచేయటమా ? వాడికేం ? రాజాలాగా రోజులు గడిపేస్తున్నాడు. ముందు కూడా ఇలాగే గడిపేయగలడు ! ఇలా ఇంద్రభోగాలు అనుభవిస్తున్నవాణ్ణి నే

నిక్కడనుంచి తీసుకెళ్తానా? నువ్వుమాత్రం.భయపడకు కోడలా! నేనేమంత మూర్ఖురాల్ని కానులే!

బంగారమ్మ: అసలు ఆ రాజమ్మ గోలఒకటి ఇలా ముంచుకొస్తుం దని నేననుకోలేదు! నిజంచెబుతున్నాను: అత్తా! చంద్రయ్య పెళ్లిచేసుకో బోతున్నాడని తెలీటంతోనే నాగుండెల్లో గాలంనాటుకున్నంత బాధ కలిగింది. చంద్రయ్య ఆవిణ్ణి ప్రేమిస్తున్నాడని నాకు ఈమధ్యనే తెలిసింది!

తులశమ్మ: అయితే కోడలా, నాకు తెలీక అడుగుతాను: నా కొడుకు అలాంటి మూర్ఖుడనేనా నీ ఉద్దేశం? ఆ తాడూ బొంగరంలేనిదాన్ని వాడు కంఠానికి కట్టుకునేది? నా చంద్రయ్య చాలా తెలివిగలవాడు. ఎవరిని ప్రేమించాలో వాడికి బాగా తెలుసు! కనుక నువ్వు అనవసరంగా కినుకపూనకు, మనసు పాడుచేసుకోకు! ఇక్కడినుంచి వాడు కాలుకదపడు; మెడబట్టి మేం వాడి పెళ్లి చేయనూచేయము! వాడిక్కడే ఉంటాడు! కాస్త డబ్బూ దస్కం కావాల్సిఉంటే ఇస్తూఉండు!

బంగారమ్మ: నిజంచెబుతున్నా: చంద్రయ్య ఇక్కడినుంచి వెళ్ళా డంటే నా బ్రతుకు భారమైపోతుంది!

తులశమ్మ: నిజమేకోడలా! యౌవనంలో వియోగబాధ భరించటం చాలా కష్టం! పైగా నీలాంటి నిండుజవ్వనికి చేవచచ్చిన ఈ ముసలి మొగ డుతో కాలంగడపటం ఎంతకష్టమో నాకు తెలీందికాదు కోడలా!

బంగారమ్మ: నిజంచెబుతున్నాను తులశమ్మత్తా: నాకసలు ఆ ముస లాడి మొహం చూట్టానికూడా—

తులశమ్మ: తెలుసమ్మా, తెలుసు! నాకిలాంటి విషయాలన్నీతెలుసు! [నాలుగువేపులాచూసి గుసగుసగా మాట్లాడుతుంది.] ఇదిగో, నేనా సిద్ధుడి దగ్గరికి వెళ్ళొచ్చాను. ఆయన రెండుమందులిచ్చాడు. ఒకటేమో నిద్రమందు.

ఈ మందుగనక ఇస్తే నీ మొగుణ్ణి కుంభకర్ణుడినిద్ర ఆవరిస్తుంది. పైనుంచి మీదదూకినా మెలుకువరాదు. పోతే, ఈ రెండోమందు చాలా ముఖ్యమైంది. దీనికి వాసనా, వెగటూ, రుచీపచీ ఏమీఉండదు. ఇది ఏడురాత్రిళ్ళు భోజనంతో కలిపి తినిపించాలి. ఒక్కోసారి ఒకచిటికెడు, ఇట్లా మీ అయనకు ఏడురోజులిచ్చావంటే నీకున్న బంధనాలన్నీ తీరిపోయినట్టే!

బంగారమ్మ: అ-లా-గా!

తులశమ్మ: ఏమీ పట్టుచిక్కదు. ఎవ్వరికీ అంతుతెలీదు. నా దగ్గర రూపాయి వసూలుచేశాడు ఆ సిద్ధుడు. అంతకు దమ్మిడీతక్కువ తీసుకోనన్నాడు! అయినా ఇలాంటి వస్తువు కావాలంటేమటుకు దొరుకుతుందా? అందుకని అమ్మాయి-నేను దీనికి ఒక రూపాయి ఖర్చుపెట్టాను. నీకు కావాలంటే తీసుకో. లేకపోతే ఆ వృద్ధలక్షాధికారి. లక్ష్మయ్యాగారి పెళ్ళాంలేదూ రత్తామ?—ఆవిడకిస్తాను. ఆవిడకూడా కావాలందిలే.

బంగారమ్మ: ఓరిబాబోయ్! దీనివల్ల ఏంకొంపమునుగుతుందో! నాకు భయంగాఉంది!

తులశమ్మ: ఇందులో కొంపమునిగేదేముందమ్మా పిచ్చిపిల్లా! నీ మొగుడు అందంగా, ఆరోగ్యంగా ఉంటే బాగానేఉండేది. కాని అలా లేడు. చూడబోతే ఆయన ఇటు బ్రతికినట్టూలేడు అటు చచ్చినట్టూకాడు! ఇలాంటి వాళ్ళు ప్రపంచంలో బ్రతికి లాభమేముంది? అందుకని.... ఇలా జరిపేయటమే మంచిది.

బంగారమ్మ: ఉహుఁహూఁ....ఎందుకో నా తల తిరిగిపోతోంది. దీనివల్ల ఎట్టాంటి గొడవలు బయలుదేరుతాయో! నాకు భయంగాఉంది! వద్దు....వద్దు....ఇలా నేను....

తులశమ్మ: నీ ఇష్టంకోడలా! ఈ మందు పొట్లాలు తీసుకెళ్ళి ఇచ్చేసివస్తాను!

బంగారమ్మ : అయితే, ఈ పొట్లంకూడా మొదటిదానిలాగా నీళ్ళలో
కలిపే ఇవ్వాలా ?

తులశమ్మ : కాఫీతో కలిపిఇస్తే మంచిదన్నాడు సిద్ధుడు. వాసనా
రిగటూ, వికారం—ఏమీ ఉండవట. ఎంతగింజుకున్నా పట్టుచిక్కదట.
ఆయన సిద్ధుడుకాదుటమ్మా !....

బంగారమ్మ : (పొట్లాలుతీసుకొని) అమ్మోయ్....నా తల తిరిగి
పోతోంది. నా జీవితం నరకమైపోయింది. లేకపోతే నాకిలాంటి బుద్ధులు
పుడతాయా ?

తులశమ్మ : ఏంభాగ్యం....ఒక్కరూపాయి ఖరీదు ! ఇప్పుడు వెళ్ళి
ఆయన కిచ్చిరావాలికూడాను ! పాపం ఆయనా ఇబ్బందుల్లో ఉన్నాడు.
విన్నావా ?

బంగారమ్మ : సరే, [పొట్లాటలుతీసుకెళ్ళి పెట్టెలో దాచిపెడుతుంది]

తులశమ్మ : ఇదిగో చూడు, నా వరహాలకోడలా ! ఈ విషయం నీ
మనసులోనే ఉంచుకోసుమీ ! బయటికి పొక్కనీకు. ఎవరేనా పొరపాటున
వింతగా చూస్తే—ఎలుకలమందని చెప్పు ! (రూపాయి తీసుకుంటుంది)
ఎలుకలకుకూడా పనికొస్తుంది ఈమందు ! (టక్కునమాట ఆపుచేస్తుంది)

[రామయ్య ప్రవేశిస్తాడు. ఎదురుగా కృష్ణుని పటం చూచి నమస్క-
రిస్తాడు. అప్పుడే జోగయ్యవచ్చి కూర్చుంటాడు.]

జోగయ్య : ఏం రామయ్యా ! ఏమిటి విశేషాలు ?

రామయ్య : ఇశేషాల కేం కొదవ జోగయ్యబాబూ ! కొల్లలుగా
ఉండాయి. ఇదుగో చూడు....గొప్ప యిశేషాలుండాయి. ఇదుగో చూడు....
ఏంచెప్పమంటావు ?.... ఘోరమనుకో ... పిల్లగాణ్ణి మంచిదారిన బెట్టా

లయ్యా....మంచిదారిన బెట్టాలి....ఇదుగో చూడు....ఔనంటావా కాదం టావా ?

జోగయ్య : నువు ముందుకాస్త విశ్రాంతిగా కూర్చోవయ్యా, కంగారు పడకు. [రామయ్య కూర్చుంటాడు.] అదీ ఊఁ, ఇప్పుడు చెప్పు విషయ మేమిటో ?....అయితే చంద్రయ్య పెళ్ళిచేసేయాలంటావు !....అంతేనా ?

తులశమ్మ : జోగయ్యబాబూ, నువ్వేచెప్పు—వాడి పెళ్ళికి ఇప్పుడేం తొందరొచ్చిపడింది ? మాఇంటి విషయాలుమీకు తెలియనివికావు. దినంగడవ టమే కష్టంగాఉంది. వాణ్ణిచూస్తేనా, ఇంకా చిన్నతనం. వాడి సంపాదన వాడి పొట్టకే చాలటంలేదు. అలాంటప్పుడు ఇప్పుడు పెళ్ళికేం తొందర రొచ్చింది ?

జోగయ్య : ఏంచేస్తే బావుంటుందో ఆలోచించండి మరి !

తులశమ్మ : అదేనండీ, నేనంటున్నది-ఇప్పుడంతగా ముంచుకొచ్చిం దేమిటి ? పెళ్ళంటే పండబారిన రేగుపండా ఏమిటి—గబుక్కున గొంతులో వేసుకు మింగటానికి ?

జోగయ్య : ఒకరకంగాచూస్తే పెళ్ళిచేస్తేనే మంచిది !

రామయ్య : అవునవును....అదే జోగయ్యబాబూ, నేనూ అనేది.... పెళ్ళిచేయటమే మంచిది ! ఇదుగో చూడు....నేను....నాకు....పనిదొరికింది! పట్నంలో నౌకరీ అయింది.

తులశమ్మ : దొరికిందిలే మహా గొప్పనౌకరీ ! కక్కూసులు కడిగే నౌకరీ ! నిన్నచూశానుగా : కొంపకొచ్చేసరికి కంపుకొడుతున్నావు ! ముక్కు బద్దలైంది నీదగ్గర నించుంటేనే ! అక్కడ పనిచేసేవాళ్ళు....రోజూ....ఎట్టా బతుకుతారో మరి !

రామయ్య : నిజమే జోగయ్యబాబూ, ఆమాటా నిజమే !....కొంచెం....

చూడు....డోకువచ్చేట్టే అనిపించింది....కడుపులో కెమిలిందిలే ! కాని.... చూడు....ఏంచేస్తాం? అదే అలవాటయిపోతుందిలే జోగయ్యబాబూ, దాందే ముంది !....చూడు....మనవాళ్ళే పాచివాళ్ళు ...మనలో ఎంతపాచిలేదు?.... తెల్లారిలేస్తే....ఏమంటావు....అవునా కాదా ?... ఇంటికొచ్చాక బట్టలు గుంజుకొని స్నానంచేస్తే సరి....చూడు....నాకు పావలాడబ్బులు కూలి కావాలి....నా పిల్లగాడు ఇంటిపట్టున బుద్ధికలిగుండాలి !....అంతే నాకు కావలసింది....

జోగయ్య : ఇంతకీ మీవాణ్ణి ఇంటికే తీసుకెళ్ళాలని ఉంది నీకు ! మంచిదే ! అయితే మరి మాదగ్గర వాడు ముందుగానే జీతండబ్బులు తీసుకున్నాడే ! మరి దానివిషయమేమిటి ?

రామయ్య : డబ్బుతీసుకున్నాడా? ఇదుగో చూడు, జోగయ్యబాబూ.... డబ్బువిషయంలో కొంచెం గట్టిగా ఉండాల్సిందే ! ఇదుగో చూడు....అప్పళంగా ఎవరుమాత్రం ఈయగలరు ?....నౌకరీ అంటే నౌకరీయే ! చూడు.... డబ్బుతిన్నాడంటే....మనిషి అమ్ముడుపోయినట్టే !....చూడు జోగయ్య బాబూ....ఊరకనే డబ్బు ఈయనేకూడదు....సోమరితనం బలిసిపోతుంది. మీ బాకీ తీరిందాకా చంద్రయ్య ఇక్కడే ఉంటాడు. కాని....చూడు....పెళ్ళి మాత్రం జరిపించాలి....ఒక్కవారంరోజులు....చూడు....సెలవిప్పించు.... పెళ్ళికాంగానే మళ్ళీ వాణ్ణి ఇక్కడికే తోలేస్తాను.

జోగయ్య : అలాగే, దానికేం !

తులశమ్మ : ఇదుగో జోగయ్యగారూ, ఈయనమాటల కేమొచ్చె గాని....పెళ్ళి అప్పుడే కుదిరిందనుకోమాకండి ! మీకు నేను నిజం చెబుతున్నాను, భగవంతుడిసాక్షిగా ! అసలు ఈవిషయంలో మీరు కొస్త మధ్యవర్తిగా ఉండండి. ఈ ముసలాయనకు పెళ్ళిచేయాలనే పిచ్చిపట్టింది. కొస్త అడగండి : పిల్లనెక్కడ చూశాడో : పెళ్ళంటే కొస్త మంచిపిల్లనుచూడాలా?

నాకొడుకు నాకు విరోధికాడు; ఆ పిల్లను చేయటంమాత్రం నా కిష్టంలేదు. అది పట్టి బజారుముండ।

రామయ్య : రామరామ। ఆపిల్లదాన్నంటే రెండుకళ్లా పోతాయి। ఇదుగోచూడు....ఆపిల్లది అట్టాంటిదికాదు। భూదేవిలాంటిది। తప్పంతా పిల్లగాడిదే।... అంటే....చూడు....ఆపిల్లను చెడగొట్టింది మన పిల్లగాడే।

జోగయ్య : చెడగొట్టాడా ?

రామయ్య : అవును।....చప్పగా చెడగొట్టాడు....చూడు....ఆపిల్ల ....వీడిమాట నమ్మింది....చూడు....వీడితో కొంతకాలముంది....చూడు ....ఇప్పుడు మరి....

తులశమ్మ : నోరుమూసుకో ముసలయ్యా।....నేనెప్పుడూ నిజం చెబుతాను, అబద్ధంమాట నా నాలికమీదకే రాదు। జోగయ్యబాబూ, మీకూ తెలుసుగా, మావాడు మీదగ్గరకు రాకపూర్వం రైలువేలో ఉండేవాడు. అక్కడొకపిల్ల వీడిచుట్టూ తిరుగుతుండేది. అతీగతీలేని ముండ। దానిపేరు రాజమ్మనుకుంటా। అక్కడ నలుగురైదుగురు కూలీలకు అన్నం వండిపెడుతుండేది। ఎక్కడెక్కణ్ణించి పోగుచేసిన పాపమో మా చంద్రయ్య నెత్తిన చుట్టాలని చూస్తోంది. ఈ సత్తెకాలపోడు ఒక్కడే దానికి మెత్తమెత్తగా దొరికాడు....తప్పంతా నీదేనంటూ వీడివెంటపడింది ఆ పోకిరీముండ।

జోగయ్య : ఛీ ఛీ। ఏమైనా ఇలాంటిపనులు మంచివికావు తులశమ్మా।

తులశమ్మ : జోగయ్యగారూ....ఆ బజారుముండమాట మీరూనమ్మితే ఎట్టనండీ ?....దానికొక నీతీ, నియమం అంటూ ఉందా ? ఎవరు కాస్త ఎర్రగా పుల్లగా కనబడితే వాళ్ళవెంటేబడుతుంది। అదీ ఒక మనిషేనా ?

రామయ్య : మళ్ళా అదేమాటంటావే ? ఇదుగోచూడు....నేను

నమ్మను !....కాస్తకూడా....నమ్మనంటే నమ్మను....తప్పు దానిదికాదు.... ఇదుగో చూడు....తప్పు ఆపిల్లది కానేకాదు ! ఆపిల్లదాని గోడుఅంతా అబద్ధ మేనంటావా ?.... కాదుకాదు....ఇదుగో చూడు.. నువుచెప్పేదంతాఅబద్ధం...

తులశమ్మ : చాల్చాలే ! నోటికి కాస్త తాళంవేసుకో ! నోటికొచ్చి నట్టు వాగడమాకు ! మాటిమాటికీ 'ఇదుగో చూడు !.... ఇదుగో చూడు!....' అంటూ చెవికోసినమేకలాగ తెగవాగుతావేం ? ఏమిటిచూసేది....నీబొంద నాబొంద ? నీ నోరు వాగేదేమిటో నీకు తెలుస్తోందా అసలు ! జోగయ్య గారూ ! — నేచెప్పేదే నమ్మమని నేను చెప్పనుగాని....మీరుకాస్త స్వయంగా ఆపిల్లనుగురించి వాకబుచెయ్యండి ! నిజం మీకే తెలుస్తుంది. అది పచ్చిపోకిరీ ముండండీ !

జోగయ్య : అయితే రామయ్యా, పిల్ల అట్టాంటిదయితే చంద్రయ్య పెళ్ళి ఆపిల్లతో చెయ్యటం నాకేమంత మంచి విషయంగా కనిపించటం లేదయ్యా ! నచ్చకపోయినప్పుడు మార్చుకోటానికి కోడలంటే కాలిచెప్పే దేమీకాదు గదా !

రామయ్య : (ఆవేశంగా) జోగయ్యబాబూ ! అంతా అబద్ధం !.... ఇదుగో చూడు....మాముసల్ది చెప్పిన మాటలన్నీ అబద్ధాలు ! ఆ పిల్లది.... చూడు....భూదేవి....చూడు.... ఇది చెప్పేవన్నీ అబద్ధాలే....నామాటనమ్మ జోగయ్య బాబూ! పిల్లది చాలా గుణవంతురాలు !....చూడు....ఆ భూదేవిని అన్నవాళ్ళనోట్లోపురుగులు పడతాయి! చూడు....ఆ పిల్లబతుకు నాశనంచేసిన వాళ్ళని.... దేవుడు మెచ్చడు....ఆపిల్లది....నాకు చాల దుఃఖంగాఉంది....

తులశమ్మ : ఏంప్రారబ్ధమొచ్చిందిరా దేవుడా ! ఇంటివాళ్ళమాట పట్టించుకోడు, వీధివాళ్ళకోసం ఏడుస్తాడేమండీ ఈయన ! ఆ బజారు ముండనుబట్టుకుని బూదేవి బూదేవి అంటూ గెంతులేస్తాడేమంట ! పిల్ల గాడిమేలు ఈయనకేమీ పట్టినట్టులేదే ! ఇదుగో ముసలయ్యో ! నీకిదే

చెప్పటం: నీకంతగానచ్చితే ఆపిల్లను నీమెడకేకట్టుకుని ఊరేగు!....అంతే... తెలిసిందా! ఇక నాతో ఎక్కువగా వాదించావంటే బాగుండదు....ఏమను కున్నావో....

రామయ్య : ఏం వాదించటం....ఇదిగో చూడు....

తులశమ్మ : ఎహె నోరుముయ్, ఏమిటి చూసేది నీబొంద? నువు నోరుమూసుకో....నామాట చెప్పనీ....

రామయ్య : (మధ్యలోనే) ఏమిటి? నోరుమూసుకో మంటావా? మూసుకోను! ఆపిల్లనుగురించి నువుచెప్పినవన్నీ పచ్చి అబద్ధాలు! నీమాట నెగ్గించుకోటానికి లేనిపోని కథలు కల్పించిచెపుతున్నావు! ఇదుగో చూడు....దేవుడున్నాడు....చూడు....దేవుడంతా కనిపెడుతున్నాడు —

తులశమ్మ : అసలు నీతో మాట్టాడినంత బుద్ధితక్కువ పని మరొకటి ఉండదు!

రామయ్య : నిజం!...ఇదుగో చూడు...ఇట్టాంటి బుద్ధితక్కువ మాటలు మాటాడకూడదు....చూడు...ఆపిల్ల చాలా తెలివిగలది; వళ్లువంచి పనిచేస్తుంది. ఇల్లంతా...ఒక్కతే సంబాళించగలదు! పేద కుటుంబాల్లో.... చూడు...పనిమంతులైనవాళ్ళు అవసరం! అంతే....చూడు.... వళ్లువంచి పనిచేసేవాళ్లు! ఇదుగో చూడు....పెళ్ళికూడా కొస్తతక్కువ ఖర్చు లోనే అయిపోతుంది....అయిపోవాల్సిందే!....చూడు....మన పిల్లగాడు చేసింది ఊరికే పోతుందా?....చూడు....ఆపిల్ల ఉందే....ఆపిల్ల...దిక్కు లేనిది!....చూడు.....నా అనేవాళ్ళులేరు. ఆ పిల్లదాని మానమర్యాదల్ని మంటకలపటం....

తులశమ్మ : ఆహా! మహా మానమర్యాదలు కాపాడేవాడివి బయలు దేరావులే....అసలు అది చెప్పేవీ, నువు చెప్పేవీ అన్నీ అబద్ధాలే!

బంగారమ్మ : మేము ఆడవాళ్ళమే అయినా కాస్త మామాటకూడా ఆల కించాలి రామయ్యగారూ ! అసలు కొన్ని విషయాలు మాకు తెలిసినంతగా మీకు తెలియనే తెలియవు !

రామయ్య : ఆరిభగవంతుడా.... ఇదుగో చూడమ్మా.... భగవంతు డనేవాడు పైనలేడూ ?.... చూడు ...ఆపిల్ల....ఆపిల్ల మనిషి కాదను కున్నారా ? భగవంతుడి దృష్టిలో అందరుమానవులు సమానమే ! చూడు....

తులశమ్మ : చూశాంలేవయ్యా ! నీతో చావొచ్చిపడింది !

జోగయ్య : ఇదుగో రామయ్యా, అయినా ఆపిల్లమాటమీదే నీకంత నమ్మకం యేమిటి? అసలు ఏమి జరిగిందో ఏమిటో మీవాణ్ణి పిలిచి అడిగితే తెలుస్తుందిగా ! అన్నీ వాడే చెబుతాడు. చూస్తూ చూస్తూ అబద్ధాలాడి అనర్థా నికి పాలుపడడుగా ! వాడిని కాస్త ఇలాపిలవండి ఎవరేనావెళ్లి ! (బంగా రమ్మ వెళ్తుంది)

తులశమ్మ : పెద్దమనిషి చెయాల్సిన పనే చేశారుమీరు ! కడిగితుడి చేసినట్టు వ్యవహారం ఒక కొలికికి తీసుకొచ్చారు. రానివ్వండి, కుర్రాడేం చెబుతాడో విందురుగాని ! ఈనాటి పిల్లకాయలు పెళ్లివిషయంలో ఎవరి ఒత్తిడికీ లొంగరులే ! పిల్లవాడు 'ఊఁ' అంటేనే పెళ్లి, లేకుంటే లేదు ! నా చంద్రయ్య ఆ పోరంబోకుపిల్లను చేసుకుని తన పరువు తాను తీసు కుంటాడా ? వాడికీ తెలివితేటలున్నాయి ! వాడింకా లోకంలో నాలుగు కాలాలపాటు జీవించాలి. నాఉద్దేశంమాత్రం : ఏదో మీదగ్గరే పడి ఉంటే బావుంటుందని ! వెనుకటిలాగానే మీ పనిపాటులన్నీ చేసిపెడు తుంటాడు! వేసవికాలంలోకూడా వాణ్ణి యింకిటి తీసుకెళ్లాల్సిన అవసరం నాకేమీ కన్పించటంలేదు. అంతగా మాకు అవసరమైతే ఆ నాలుగురోజులూ మేమే ఒక కూలివాణ్ణి పెట్టుకుంటాం ! మీ రిప్పటిదాకా ఇచ్చే ఆ పదిరూపా యలిస్తే చాలు ! వాడిక్కడ హాయిగా ఉండటమే మాకొ్కవాలి !

జోగయ్య : సరే, చూద్దాం. మొదట ఈవిషయ మేదో తేలనియ్. ఆతరువాత దాని విషయం ఆలోచిద్దాం.

రామయ్య : ఇదుగో చూడు....నేను చెబుతున్నాను జోగయ్యబాబూ, ఈవిషయంలో....మనచేతనయింది మనంచేయాలి....చూడు....ఆపైని భగవంతుడి దయ. మనం అసలు వాణ్ణిమరచిపోతుంటాం! మన పబ్బం గడుపు కోటానికి....చూడు....రకరకాలుగా మాట్టాడి వ్యవహారాన్ని కిందా పైనా బెడతాం....చూడు....దాంతో రారాని కష్టాలువచ్చి పడతాయి....జల్సాగా, కులాసాగా ఉండాలని....చూడు....మనం ఎన్నో ఎత్తులువేస్తుంటాం.... కాని....చూడు....మన దురాశలు మనల్నే ముంచేస్తాయి! భగవంతుడిని మరచిపోయినవాళ్లు....చూడు....

జోగయ్య : నిజం నిజం, మనం భగవంతుణ్ణి మరచిపోకూడదు.

రామయ్య : భగవంతుణ్ణి మరచిపోతే....చూడు....మన పనులు రవంతకూడా ముందుకు జరగవు. భగవంతుడి చల్లనిచూపు మనమీదఉంటే, చూడు....మనకేం తక్కువుంటుంది? మనకు ఎంతో మేలు చేకూరుతుంది! అందుకని నేను చెప్పేదేమిటంటే....చూడు....కుర్రాడిని పిలిపించి ఆపిల్లను ముడిపెడితే బావుంటుంది! అంటే....చూడు....వాడుచేసిన దోషానికి పరిహారం జరగాలి; లేకపోతే వాడు అనుభవిస్తాడు!....ఏదోఒక ఇంటివాడు అయితే బావుంటుందిగాని....చూడు....నేను ఆ పట్నం నౌకరీలో చేరతాను పోయి. అదేమంత చెడ్డపనేమీకాదులే!....చూడు....నాలుగు పిచ్చికలు చేతిలోపడతాయి! అంతే! ఆ భగవంతుడి దృష్టిలోకూడా ఇది చాలా ధర్మమైన పనే!....చూడు....ఆ అనాథపిల్ల, తలిదండ్రులు లేనిది....చూడు.... సంవత్సరం క్రిందటిసంగతి : కొంతమంది కుర్రకారుకలిసి ఒక పిల్లను ఎత్తుకెళ్లిపోవాలని చూశారు! ముందుగానే చౌకీదారుకు లంచంపెట్టి లోబరచుకున్నారు! కాని....చూడు....ఆభగవంతుడికి లంచంపెట్టి ఆయన్నులోబరచుకోగలరా?....

(చంద్రయ్య సునందితో వస్తాడు)

చంద్రయ్య : నన్ను పిలిచారా ? (కూర్చొని బీడీతీస్తాడు)

జోగయ్య : (కొంచెం ఎత్తిపొడుపుగా) ఏం చంద్రయ్యా, ఏలోకంలో ఉన్నావు ? కొంచెమన్నా మంచీమర్యాదా ఉండనక్కర్లేదూ ? తండ్రి పిలిపిస్తే వచ్చి ఇలాగేనే కూర్చోబడటం? వచ్చినవాడివి వచ్చి, ఆచేతిలో బీడీఏమిటి ? కొంచెమన్నా మర్యాదా-మట్టూ అంటూ ఏమన్నా ఉందా ? లేచి నిలబడు !

చంద్రయ్య : (నిలబడతాడు. ఒకకాలు బల్లమీదుంచి దాన్ని ఊపుతూ ఉంటాడు-నవ్వుతుంటాడు)

రామయ్య : చంద్రయ్యా, నీ మీదకు ఒక నిందవచ్చి పడిందిరా !.... ఇదుగో చూడు... ఒక నేరంవచ్చి పడిందనుకో-ఒక అపరాధం !

చంద్రయ్య : నేరమా ? ఎవరు నామీద నేరంమోపేది ?

రామయ్య : ఎవరంటావా ? ఆ పేదపిల్ల రాజమ్మ....చూడు. ..నువు నిజంచెప్పు : ఆ నేరం నువు చేశావా ?

చంద్రయ్య : (నవ్వుతాడు) మహాగొప్పనేరమే ! తనే స్వయంగా వచ్చి చెప్పిందా ?

రామయ్య : నేడిగినదానికి సమాధానంచెప్పు !....ఇదుగో చూడు.... నాకు సూటిగా సమాధానంచెప్పు ! ఆపిల్లదాన్ని కలుసుకుంటూ, కలుపుకుంటూ ఉండేవాడి వంటగా ?

చంద్రయ్య : అసలువిషయమేమిటో నాకేమీ అర్థంకావటంలేదు !

రామయ్య : విషయమా ? ఇదుగో చూడు....అసలు నేనడిగేదానికి సమాధానంచెప్పు ...అసలు ఆపిల్లకూ నీకూ సంబంధం ఉందా లేదా ? నువు తెలివితక్కువగా ప్రవర్తించావా లేదా ?.... ఇదుగో చూడు....కొంచెం చెడుగా నడిచావా లేదా ?....

చంద్రయ్య : అహా! చాల్లేద్దూ! ఊసుపోనప్పుడు కాసంత సరస మాడితే కొంపమునుగుతుపోయిందా? అంతమాత్రం సరదాలు ఎవరికుండవేం? అప్పుడప్పుడు మేము ఆట్లాడుకున్నాం—మాట్లాడుకున్నాం—అదే అపరాధమా?

జోగయ్య : టాలాటోలీ చేశావంటే ఊరుకునేదిలేదు చంద్రయ్యా! చెప్పు : మీనాన్న అడిగినదానికి సరైన సమాధానంచెప్పు!

రామయ్య : (గంభీరంగా) ఏదైనా మనిషిముందు దాచటం నీకు తేలికే, కాని....ఇదుగో చూడు....ఆ భగవంతుడి కళ్ళు కప్పలేవు!.... చూడు....అది తలిదండ్రులులేని పిల్ల....దాని మర్యాద మంటగలుపుతా వంట్రా?.....పాపం నా అనేవాళ్ళు లేరు దానికి!....ఇదుగోచూడు. ..అసలు ఏమిజరిగిందో ఉన్నదున్నట్టు చెప్పేసెయ్!

చంద్రయ్య : ఏముంది చెప్పటానికి? చెప్పవలసిందేదో ఇదివరకే చెప్పేశాను. ఇంకేమీలేదు చెప్పటానికి! (ఉద్రేకంతో) నానోట్లో నాలుకే లేదనుకుందేమో! నోటికొచ్చినట్టల్లా నామీద ఉన్నవీ లేనివీ పుట్టిస్తూంది. నామీద ఇన్ని చెబుతూంది....ఆ రాఘవయ్యమీదేమీ చెప్పదేమో మరి? అయినా వయసులోఉన్నవాళ్ళకి ఏసరదాలూ లేకుండానే ఉంటాయా? దాని నోటికి హద్దూ-ఆపా? అనే వాళ్ళెవరన్నా ఉంటేగా? స్వతంత్రురాలు!

రామయ్య : చంద్రయ్యా, చెబుతున్నా విను : అబద్ధ మెప్పుడూ దాగదు!....చూడు....ఇంతకీ నీవల్ల ఏమన్నా దోషం సంభవించిందో లేదో చెబుతావా లేదా?

చంద్రయ్య : (తనలో) తనమాటేగాని నే చెప్పేది వినిపించుకోడే! భలే తగలాటం వచ్చిపడింది! (బిగ్గరగా) చెప్పానుగా, నాకేమీ తెలీదని! నేనేమన్నా చేసివుంటే (కోపంగా) ఆ భగవంతుడే ఉన్నాడు (కళ్లపైకెత్తి

చేతులు జోడిస్తాడు) అంతా ఆ భగవంతుడు చూస్తూనే ఉంటాడు! (ఎవ్వరూ మాట్లాడరు. చంద్రయ్య ఆవేశంతో మాట్లాడతాడు) ఇంతకీ నాకూ ఆపిల్లకూ ముడిపెట్టాలని చూస్తున్నట్టున్నారు! ఏమిటి మీఉద్దేశం! దీనికి అర్థం-పర్థంలేదు. చూస్తాను! అసలీ రోజుల్లో ఇష్టంలేకుండా పెళ్లిచేయటానికి వీల్లేదు. ఒక్కటేమాట నేను చెప్పదలచింది: ఆపిల్లకూ నాకూ ఎలాంటి సంబంధంలేదు. లేదంటేలేదు. ఒట్టేసుకొని చెప్పాను. అంతే!

తులశమ్మ: (భర్తతో) ఇక నీఇష్టమొచ్చినట్టుచేసుకో. నీది మట్టి బుర్ర గనక ఎవరేమి చెప్పినా ఇట్టేనమ్ముతావు. నీలాగే అందర్నీ నమ్మమంటే నమ్ముతారా? ఇప్పుడు చూడు....చంద్రయ్య చెప్పినదానికి ఇక తిరుగులేదు. వాడు వాడియజమాని దగ్గరే ఉండిపోతాడు! ఇప్పుడు మన అవసరానికి జోగయ్యగారు ఒక పదిరూపాయలు సర్దుతారు. తక్కిన సంగతు లన్నీ తరవాత చూచుకోవచ్చు.

జోగయ్య: మరి నువేమంటావు రామయ్యా?

రామయ్య: (కొడుకువైపు అసంతోషభావంతో చూచి) గుర్తుంచుకో చంద్రయ్యా....ఆ దీనపిల్ల ఉసురు నీకు తగలకపోదు! ఆ అనాధ కార్చే కన్నీరు వృథాపోదు....ఇదుగో చెబుతున్నా విను....ఆ కన్నీరు నీ శిరసు మీద పడుతుంది!....ఇదుగో చూడు... గుర్తుంచుకో!

చంద్రయ్య: ఏముంది గుర్తుంచుకోటానికి! అదేదో నువ్వే గుర్తుంచుకో.

సునంది: (నెమ్మదిగా) వెళ్ళి అమ్మతో చెపుతాను! (వెళ్ళిపోతుంది)

తులశమ్మ: ఇదుగో జోగయ్యగారూ! చూశారుగా, మాముసలాయన తెలివితేటలన్నీ ఇలాగే ఉంటాయి. బడబడా వాగటానికి తప్పితే ఇంకెందుకూ పనికిరాడు. ఆ బుర్రలోకి ఏమాటయినా ఎక్కిందంటే....ఇక కక్క లేక ఇలా కోతిగంతులేస్తాడు. అనవసరంగా మిమ్మల్నికూడా శ్రమపెట్టాం.

వెనకటిలాగానే కుర్రాడు మీదగ్గరే ఉంటాడు. వాడు మీవాడు, మీనౌకరు.... మీరెట్లా అనుకుంటే అట్లా!

జోగయ్య : ఏమంటావు రామయ్యా! నీ అభిప్రాయమేమిటి?

రామయ్య : నా అభిప్రాయం.... జోగయ్య బాబూ.... పిల్లగాడు పెద్ద వాడైనాడు.... చూడు.... వాడికి వాడే యజమాని.... నా అభిప్రాయం.... చూడు.... జోగయ్యబాబూ.... నా అభిప్రాయం....

తులశమ్మ : అసలు నువు ఏమి మాట్లాడుతున్నావో నీకైనా తెలుస్తున్నదా? "చూడు, నా అభిప్రాయం....చూడు, నా అభిప్రాయం" అంటూ ఏమిటా పనికిమాలినవాగుడు! అసలు వాడికి ఇక్కడినుంచి కదిలిరావటం ఇష్టంలేకపోతే...ఎందుకీ బలవంతం? లక్షణంగా ఉన్నవాణ్ణి లాక్కెళ్ళి, ఏమిటి నువ్వు తవ్వితలకెత్తేది వాడికి? వాడుమాత్రంవచ్చి వారగదోసేదేముం దక్కడ? వాడులేకుండా ఇప్పటిదాకా గడవలేదా?

జోగయ్య : ఇదిగో రామయ్యా! నాదొకమాట: నాట్లువేసేరోజుల్లో గనక వాణ్ణి తీసుకెళ్ళాలని ఉంటేమటుకు తీసుకెళ్ళు, అయితే మళ్ళా శీతాకాలంనాటికి తిరిగొస్తేమటుకు పనిలోకి రానిచ్చేదిలేదు! ఉండేట్టయితే, సంవత్సరమంతా వాడిక్కడే ఉండాలి.

తులశమ్మ : ఉంటాడండీ! ఎందుకుండడు? నే చెబుతున్నానుగా... సంవత్సరమంతా ఉంటాడు! అంతగా మాకు అవసరమైతే మేమే కూలివాణ్ణి పెట్టుకుంటాం లెండి. కుర్రాడుమాత్రం ఇక్కడుండేదే ఖాయం. ప్రస్తుతానికి ఒక్క పదిరూపాయలు—

జోగయ్య : అయితే సంవత్సరంపొడుగూ ఉంటాడుగా?

రామయ్య : (నిట్టూరుస్తూ) సరే...చూడు....జోగయ్య బాబూ!.... సరే...అలాగే కానివ్వండి!

తులశమ్మ : ఉంటాడంటీ, సంవత్సరమంతా ఉంటాడు! ఈ దసరా పండగనుంచి వచ్చే దసరాపండగదాకా! మీ యిష్టమొచ్చినప్పుడే వాడికి జీతమిస్తూ ఉండండి. కాని ఇప్పుడుమాత్రం జోగయ్యబాబూ...మాకు ఒక్క పదిరూపాయలు ఇప్పించు. చాల అవసరం. మరీ ఇబ్బందిగా ఉండి అడుగుతున్నాను. (లేచి నిలబడి జోగయ్యఎదుట ముందుకు వంగుతుంది)

[సునంది, బంగారమ్మ వస్తారు. బంగారమ్మ ఒక పక్కన కూర్చుంటుంది]

జోగయ్య : నిర్ణయం కావాల్సిందేదో అయిందిగా, ఇక పదండి దొడ్లోకివెళ్దాం! లేవయ్యా రామయ్యా! కాసిని కారపు సెనగలు తిందువుగాని రా: ఒకచుక్క కల్లుకూడా రుచిచూస్తే బావుంటుంది గదూ?

రామయ్య : వద్దు జోగయ్యబాబూ...చూడు...నాకూ దానికీ సరిపడదు

జోగయ్య : అయితే కాఫీ తాగుదుగానిలే!

రామయ్య : కాఫీయా? ఓ దానికేం!...చూడు. .ఆ తప్పునుంచి నేను తప్పించుకోటంలేదులే!

జోగయ్య : అయితే పదండి ఆడవాళ్లుకూడా! వెళ్దాం. ఇదుగో చంద్రయ్యా! నువ్వెళ్ళి కాస్త గొర్రెలదగ్గర సరిజేసి కొంచెం మేతవడేసిరా!

చంద్రయ్య : అట్లాగే! (చంద్రయ్యను వదిలి అంతా వెళ్ళిపోతారు! చంద్రయ్య బీడీ వెలిగిస్తాడు. చీకటి దట్టమవుతుంది) అబ్బా! పట్టుబడితే మనిషి పుటమారుస్తాడుగదా! ఆయనకు ఈ ప్రేమగొడవలన్నీ చెప్పాలి గాబోలు! ఒకటయితే చెప్పచ్చు! ఎన్నని చెప్పాలి? ఆపిల్లను పెళ్ళిచేసుకోమంటాడు! పెళ్ళిచేసుకోటమేవస్తే చాలామందిని చేసుకోవాలి! అప్పుడు చుట్టూ పెళ్ళలేడుంటారు! అయినా నాకు పెళ్లెందుకు? పెళ్లిచేసుకున్నట్లే ఉందిగదా! ఎంతోమంది నా అదృష్టంచూసి కుళ్ళిచస్తున్నారు. దేవుడుమీద

ఒట్టేసుకునేప్పుడు నా గుండెలు కొంచెం బితుకుబితుకుమన్నాయి! ఏదో పైనుంచి తలమీద పడ్డట్టయింది. మజాఅంతా మట్టిపాలవుతుందేమోనని భయపడ్డాను! అందుకేగా బోలు-తప్పుడుప్రమాణాలుచేస్తే నెత్తి అంటుకుం దంటారు. ఆ(. అనంతా వట్టి నాటకంలెద్దూ.... అంతా బూటకం.

(మేనక వస్తుంది)

మేనక : ఎవరూ దీపం వెలిగించనే లేదే!

చంద్రయ్య : ఎందుకూ? నిన్నుచూట్టానికా? వెలుతురు లేకుండానే వెలిగిపోతున్నావుగా నువ్వు?

మేనక : చాల్లే ఆపు! (అంటూ వెళ్ళిపోతుంది)

(సునంది వస్తుంది, వచ్చి చంద్రయ్యచెవిలో ఏదో చెబుతుంది)

సునంది : ఎవరోనిన్ను బయట పిలుస్తున్నారు— అదే—. అక్కడుంది.

చంద్రయ్య : ఎవరూ?

సునంది : ఆ రైలువేలోఉండే రాజమ్మ! బయట దొడ్డివాకిలి దగ్గర నిలబడింది.

చంద్రయ్య : అంతా వట్టిదే!

సునంది : నిజం-నీమీద ఒట్టు.

చంద్రయ్య : ఏమంటున్నదేమిటి?

సునంది : నిన్ను బయటికి పిలుస్తోంది! ఏదో నీతో ఒకమాట ఉన్న దట! ఏమిటని నేనడిగాను, కాని నాకుచెప్పలేదు. 'చంద్రయ్య మీఇంట్లోంచి వెళ్ళిపోతున్నాడట నిజమేనా?' అని అడిగింది. అట్టే లేదు, వాళ్ళనాన్న తీసుకెళ్లి పెళ్ళిచేయాలనుకున్నాడు, కాని చంద్రయ్య రానన్నాడు, ఇంకో సంవత్సరం ఇక్కడే ఉంటాడు' అని నేనుచెప్పాను. అప్పుడు నన్ను బతిమా

లింది : 'సునందమ్మా, సునందమ్మా, ఒక్కసారి చంద్రయ్యను ఇట్టా పంపించు, నీకెంతేనా పుణ్యముంటుంది. చాల అవసరంగా కలుసుకోవాల్సిన పనుంది, తొందరగా ఒక విషయం మాట్లాడాలి' అంటూ ఎంతో బతిమాలింది. పాపం చాలసేపట్నుంచి బయట నీకోసం కాచుకొనివుంది. పో, ఒకసారి పోయిరారాదూ ?

చంద్రయ్య : ఆఁ ఎందుకులెద్దూ, నేను వెళ్లేం జేస్తాను ?

సునంది : ఒకవేళ నువ్వు రాకపోతే తానేవచ్చి కలుసుకుంటానని చెప్పింది ।

చంద్రయ్య : ఇక్కడికే పమ్మంపటనా ? ఏం రాలేదులే। కొంచెంసేపు నిలబడి తానే పోతుంది ।

సునంది : 'సునందమ్మా ! కొంపదీసి చంద్రయ్యపెళ్ళి మేనకతో చేసి పారెయ్యరుగదా !' అనికూడా అన్నది నాతో ।

(మేనకవస్తుంది. ఏదో పనిమీద చంద్రయ్యకు దగ్గరగా నడిచి వెళ్తుంది)

మేనక : మేనకతో పెళ్లి ? ఎవరిదే ?

సునంది : ఏం, చంద్రయ్యది ।

మేనక : మహాఅయిందిలే పెళ్ళి । ఎవరామాట అనేది ?

చంద్రయ్య : (మేనకవైపు చూసి నవ్వుతాడు)....ఎవరేముంది ? లోకులు చెప్పుకుంటున్నారు । ఏమిటి మేనకా మరి నన్ను పెళ్లాడుతావా ?

మేనక : నిన్నా ?....నేను ?....ఇదివరకయితే చేసుకునేదాన్నేమో, ఇప్పుడుమాత్రం ఆ ఉద్దేశంలేదు.

చంద్రయ్య : ఏం ? ఎందుకని ?

మేనక : ఎందుకేముంది ? నువ్వు నన్ను ప్రేమించవు ।

చంద్రయ్య : అదేమిటి ? నేను నిన్నెందుకు ప్రేమించను ?

మేనక : హుం, అసలు నిన్ను ప్రేమించనిస్తేగా....(నవ్వుతుంది)

చంద్రయ్య : ఎవరు ప్రేమించనివ్వరంటావు ?

మేనక : మా సవతితల్లి ? ఇంకెవరు ? ఆవిడకు నీవంటే ఎలాంటి అభిప్రాయం ఉన్నదీ నాకు తెలీదనుకున్నావా ? లేకపోతే నీవేపు అలా ఎందుకు చూస్తూంటుంది ఎప్పుడూ ?

చంద్రయ్య : (నవ్వి) ఏమిమాటలివి ? ఈ కల్లిబొల్లి కబుర్లు ఎక్కడ నేర్చుకున్నావు ?

మేనక : నేనా కల్లిబొల్లి మాటలు చెప్పేది ?.... నేను ?.... నేనేమన్నా కళ్లులేని కబోదినా ? నాకళ్ళకు ఏమీ కన్పించదనుకున్నావా ? మా నాన్నమీద మాటిమాటికి మండిపడుతూనే ఉంటుంది.అది ఆడదేనా — అ రంకులాడి — (వెళ్ళిపోతుంది)

సునంది : (కిటికీలోగుండా బయటికిచూసి) చంద్రయ్యా ! ఆమె వస్తోంది. అదిగో—ఆమె కాకపోతే నా పేరుకాదు. నే వెళ్లిపోతున్నాలే. నాకెందుకు. (వెళ్తుంది)

రాజమ్మ : (ప్రవేశించి) నన్ను నువు ఎందునా ఉంచేట్టులేవే !

చంద్రయ్య : ఎందునా ఉంచకపోవటమేమిటి ? నేనేంజేశాను ?

రాజమ్మ : నన్ను వదిలిపెట్టాలనుకుంటున్నావా ?

చంద్రయ్య : (కోపంగా) అసలు నువ్విక్కడికివస్తే లోకులు చూసి ఏమనుకుంటారో కొంచెమన్నా ఆలోచించావా ?

రాజమ్మ : ఆఁ-ఆలోచించేవచ్చాను !

చంద్రయ్య : ఆఁ అంటే సరా ? బలే బుద్ధిమంతురాలివేలే ! అసలు నువ్విక్కడకు ఎందుకొచ్చినట్టు ?

రాజమ్మ : చం[దయ్యా !

చం[దయ్య : ఆఁ, ఏమిటి ? చం[దయ్యతో నీకేంపని ? వెళ్ళిపో ఇక్కడినుంచి! నే చెప్పేది వింటున్నావా? వెళ్ళిపో తక్షణం !

రాజమ్మ : నా కర్థమయిందిలే ! నువు నన్ను వదిలివేయాలనుకుంటు న్నావు ! అవునా ?

చం[దయ్య : ఇది బాగుంది అన్నిటికంటె. వదలకుండా పట్టుకు కూర్చోటానికి నీకూ నాకూ ఉన్న సంబంధమేమిటి ? నీకు అంతమా[తం తెలివిలేదేం ? అక్కడ దొడ్డిగుమ్మంలో నిలబడి సునందిని పంపింబావు నా దగ్గరకు ! నేను రాకపోతే అర్థంచేసుకోనక్కర్లేదూ....నీ అవసరం నాకేం లేదని ? ఇప్పుడైనా అర్థమైందా ?....ఇక దయచెయ్యి ! వెళ్లు !

రాజమ్మ : నా అవసరమేం లేదంటావా ? అయితే నా అవసరం తీరిపోయిందన్నమాట ! నన్ను [పేమిస్తున్నానని నువు చెబితే నమ్మాను. అన్నివిధాలా నా సర్వస్వం కాజేశావు. ఇక ఇప్పుడు నా అవసరం లేదంటు న్నావు !

చం[దయ్య : ఎక్కువగా మాట్లాడి [పయోజనంలేదు. వెళ్లి మా నాన్నకు చాలా చాలా చెప్పావే....ఇక నెందుకు ? వెళ్ళు ఇక్కడినుంచి ! వింటున్నావా ? వెళ్లాలి !

రాజమ్మ : నేను నిన్నుతప్ప ఎవరినీ [పేమించలేదని నీకు తెలుసు. నీతోనే ఉంటిని ! నువు నన్ను పెళ్ళిచేసుకో, చేసుకోకపో, నాకేమీ కోపం లేదు. నేను నీకేమీ చెరుపు తలపెట్టలేదు. కాని నేను నిన్ను పువ్వుల్లోపెట్టి పూజించానుగదా....నామీద నీకింత ఈసడింపుదేనికి....నా [పేమను తిరస్క రించటందేనికి_అదేనాకు....

చం[దయ్య : చం[దుడికోసం చేతులుచాచితే వచ్చి వాళ్ళోపడతాడా ?

రామరామ, ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిరాదేం నీకు? పో, అవతలికి పో!
నన్ను విసిగించమాకు!

రాజమ్మ : పెళ్ళిచేసుకుంటానాని నాకు మాటిచ్చావు; కాని ఆమాట మీద నువ్వు నిలబడనందుకుకూడా నాకు బాధేమీలేదు. మనిషి ఒకప్పుడు పరవశమైపోతాడేమో, కావచ్చు. కాని నువ్వు నా ప్రేమను తిరస్కరిస్తున్నావు. పైగా మరెవరి ప్రేమనో స్వీకరిస్తున్నావు. ఇదే నా బాధ! ఆవిడ ఎవరో కూడా నాకు తెలుసు!

చంద్రయ్య : (కోపంగా కొట్టవచ్చినట్టు ఆమెను సమీపిస్తాడు) అసలు నీలాంటి బుద్ధిమాలినవాళ్ళతో మాట్లాడటం నాదే తెలివితక్కువ! వెళ్ళిపో ఇక్కడినుంచి! వెళ్ళకపోయావంటే..,నిన్నేం చేస్తానో తెలుసా?... తరువాత విచారిస్తే లాభంలేదు! నడు, నడు!

రాజమ్మ : ఏం, చంపుతావా? సరే చంపు! అలా వెనక్కు వెళ్ళిపోతావేం? కానియ్ చంద్రయ్యా, రా, చంపు!

చంద్రయ్య : ఇదిగో చెబుతున్నా విను: ఇలాంటి సమయంలో అధికంగా నాకు కోపం తెప్పించావంటే పరిణామం చాలా చెడుగాఉంటుంది. తెలిసిందా? ఎక్కువగా మాట్లాడి లాభమేమిటి?

రాజమ్మ : అంతేనా చంద్రయ్యా! ప్రేమించినదానికి ఫలితమిదేనన్న మాట! నా సర్వస్వాన్ని పోగొట్టుకున్నాను. ఇప్పుడేమో నువ్వు నన్ను అంతా మరచిపొమ్మంటున్నావు. అయితే విను చంద్రయ్యా!—నేను పెళ్ళికాని పిల్లను. నా మానమర్యాదల్ని కంటికిరెప్పలాగ కాపాడుకుంటూ వచ్చాను. నువ్వు నాకు రకరకాల ఇచ్చకాలు చెప్పి నీ వలలోవేసుకుని నా శీలాన్ని చెరిచావు. తలిదండ్రులులేని నా మీద నీకు దయాదాక్షిణ్యాలుకూడా లేవా...చంద్రయ్యా,...అంతమాత్రం కనికరంలేదా? (ఏడుస్తుంది) నన్ను చెరిచి విడిచేస్తావా! నాకెక్కడా చోటులేకుండా చేస్తావా?..చచ్చిపోవటంకంటే

ఇప్పుడు నాకు మరో మార్గంలేదు. నేను మాత్రం నీకు చెరుపుకోరను. నీ తప్పులు మన్నించమనే దేవుణ్ణి ప్రార్థిస్తాను. నాకంటే మంచి స్త్రీ దొరికితే నువు నన్ను మరచిపోతావు, చెడ్డది దొరికితే నన్ను గుర్తుంచుకుంటావు. సరే కానీ...నే వెళ్ళిపోతున్నా. నిన్ను ఎంత గాఢంగా ప్రేమించాను! అదంతా....సరే! శాశ్వతంగా నిన్ను వదలి వెళ్ళిపోతున్నాను. (పాదాలు స్పర్శించటానికి చంద్రయ్యముందు వంగుతుంది)

చంద్రయ్య: (చటుక్కున పాదాలు వెనక్కి లాక్కొని) — నీలాంటి వాళ్ళతో మాట్లాడటంకూడా నాకిష్టంలేదు. నువు వెళ్ళకపోతే నేనే వెళ్ళి పోతున్నా, అంత కోరికగాఉంటే ఒంటరిగా నిలబడు ఇక్కడే!

రాజమ్మ: (బిగ్గరగా ఏడుస్తూ) ఓరి నిర్దయుడా! (బయటికి వెళ్తూ) భగవంతుడు నిన్ను కరుణించడు! (ఏడుస్తూ వెళ్ళిపోతుంది)

మేనక: (పక్క గదిలోనుంచి వస్తుంది) నువు ఎంత చండాలుడివి చంద్రయ్యా!

చంద్రయ్య: ఏం? ఎందుకని?

మేనక: అబ్బా! ఆమె పిలుపులో ఎంతబాధఉందో నీకు కనిపించనే లేదా చంద్రయ్యా! (ఏడుస్తుంది)

చంద్రయ్య: అరె! ఇదేమిటి? నువ్వేడుస్తావు ఎందుకు?

మేనక: ఎందుకా?...అబ్బా, ఆమెను నీవెంత క్రూరంగా హింసించావు! నన్నుకూడా అట్లాగే హింసిస్తావా? నువు వట్టి నీతిమాలిన కుక్కవు; నిజంగా కుక్కవే నువు! (పక్కగదిలోకి వెళ్ళిపోతుంది)

చంద్రయ్య: ఇదంతా బలేగొడవగా ఉందే! ఈ ఆడవాళ్ళందరితోనూ నేను తియ్యగా పటికబెల్లంలాగ మసులుకుంటున్నాను. కాని వాళ్ళమాటకి కాస్తఎదురుచెపితేనా...ప్రాణాలు కొరికేస్తారు. అబ్బబ్బా! బలే చావొచ్చి పడిందే వీళ్ళతో!

## రెండో అంకం

[ఆరుమాసాలు గడిచిపోయాయి. గ్రామంలోని ఒకవీధి : ఎడమవైపున జోగయ్య ఇల్లు. ఇంటిముందర చావిట్లో బంగారమ్మ వడ్లుదంచుకుంటున్నది.]

బంగారమ్మ : (దంచటం ఆపి, ఏదో వింటున్నట్లు అభినయిస్తుంది) మళ్లా మొదలు; నీ సణుగుడు చల్లార ! లేచి కూర్చున్నాడల్లే ఉంది !

(మేనక ప్రవేశిస్తుంది. చేతిలో డబ్బా ఉంది)

బంగారమ్మ : చూడవే ! ఆయన పిలుస్తున్నట్టుంది ! ఏదో మునిగి పోతున్నట్టే గొడవచేస్తాడు.

మేనక : నువ్వే వెళ్ళిరాకూడదూ ?

బంగారమ్మ : ఇంతకూ నువు వెళ్తావా లేదా ? (మేనక వెళుతుంది) అబ్బ ! నాకు ఉన్నమతికూడా పోతున్నది. బలే చిక్కొచ్చింది ! డబ్బెక్కడ దాచాడో ఏమిటో బయటపెట్టటంలేదు ! నిన్న వసారావైపుకు వెళ్ళినట్టున్నాడు. బహుశా అక్కడే ఎక్కడేనా పూడ్చిపెట్టాడో మరెక్కడ మాయం చేశాడో తెలీటంలేదు. ఇదీ కొంత కీడులో మేలేలే ! చేతులుదాటి బయటికి మాత్రం పోలేదు. ఇంట్లోనే ఉంటుంది. ఎలాగో చేజిక్కించుకో వచ్చు ! నిన్నమాత్రం....వంటిమీద ఎంత వెదకినా ఆ డబ్బు కన్పించనే లేదు ఎక్కడ దాచాడోగాని. ఈ మాయదారివాడితో నా ప్రాణాలు జిల్లార్చుకు పోతున్నాయి.

(మేనక వస్తుంది)

బంగారమ్మ : ఎక్కడికే బయలుదేరావు ?

మేనక : వెళ్ళి దేవకి అత్తయ్యను పిలుచుకునిరమ్మంటున్నాడు నాన్న. తానిక బతకనని చెప్పి. కన్ను మూసేలోగా ఒకపర్యాయంవచ్చి చూసివెళ్ళమని చెప్పమన్నాడు.

బంగారమ్మ : (స్వగతం) తన చెల్లెలికి కబురంపుతున్నాడా ! అయితే ఇంకేం, ఆ డబ్బు కాస్తా ఆవిడకే ఇచ్చేట్టున్నాడు. ఇక నాగతేం గాను ? (మేనకతో) ఏయ్ ! ఎక్కడికే నువు వెళ్ళేది ?

మేనక : చెప్పానుగా, అత్తయ్యను పిలుచుకరావటానికని !

బంగారమ్మ : వద్దు, వెళ్ళొద్దు ! తెలిసిందా ? నేను వెళ్ళిచూస్తాను, అదేదో ! నీవీ బట్టలు తీసుకెళ్ళి చెరువులో ఉతుక్కురా ? పని కొంచెం తొందరగా పూర్తిచేసుకొనిరా; చాలా బట్టలున్నాయి. సాయంత్రందాకా అక్కడే కూర్చునేవు ?

మేనక : నాన్న అత్తయ్యను పిలుచుకొని రమ్మన్నాడుగా !

బంగారమ్మ : ఎన్నిసార్లు చెబుతావు ఆమాట ? నన్ను విసిగించకు ! వెళ్ళి నే చెప్పినపని చేసుకరా ! దేవకిని నేను పిలుచుకువస్తానని చెప్పానుగా! నూతిగోడమీదున్న ధోవతికూడా తీసికెళ్లు !

మేనక : నువ్వు వెళ్తావామరి ? నాన్న తప్పకుండా వెళ్ళమన్నాడు !

బంగారమ్మ : అసలు నే చెప్పేది నీకు విన్పిస్తున్నదాలేదా ? వెళ్తాను వెళ్తానని గొంతుచించుకుంటూంటే నీ చెవులల్లో చెట్లు మొలిచినయ్యా ? సునంది ఎక్కడున్నది ?

మేనక : సునంది అవుదూడను చూస్తున్నది.

బంగారమ్మ : దాన్ని కాస్త నాదగ్గరకు పంపించివెళ్లు, పనుంది. ఇంతట్లోకే అదెక్కడికీ పారిపోదులే. (మేనక బట్టలు తీసుకొనివెళ్తుంది)

బంగారమ్మ : ఇప్పుడా దేవకిదగ్గరికి పోకపోతే ఈ ముసలాడు నిలవనీడు. పోనీ వెళ్ళిదాన్ని తీసుకువస్తే ఉన్ననాలుగుడబ్బులు ఆ ముండకు ముట్టజెప్పేస్తాడు ! నే పడినపాటంతా వ్యర్థమై ఊరుకుంటుంది. నాకేమి చేయటానికీ పాలుపోవటంలేదు !

(వడ్లుదంచుతూంటుంది)

(ఇంతలో తులశమ్మ ప్రవేశిస్తుంది. ఒక చేతిలో మూట, మరోచేతిలో కర్ర....యాత్రవెడుతున్న వేషంలో ఉంది.)

తులశమ్మ : ఏమమ్మా కోడలా ! అంతా బాగున్నారా ?

బంగారమ్మ : (చేస్తున్నపని ఆపేసి సంతోషంతో ఉప్పొంగిపోతుంది, చప్పట్లు చరుస్తుంది.) ఆహా ! ఎంత అదృష్టం ! మంచిసమయానికి వచ్చావు అత్తమ్మా ! అంతా ఆభగవంతుడిదయ ! ఆభగవంతుడే నిన్ను పంపించినట్టున్నాడు.

తులశమ్మ : ఏం, అంతా సవ్యంగా ఉందా ?

బంగారమ్మ : ఏది సవ్యమో, ఏది అపసవ్యమో....నాకేమీ తోచటం లేదు. ముందు నుయ్యి, వెనుక గొయ్యిలా వుంది. నాబుర్ర పనిచేయటమే మానేసింది.

తులశమ్మ : ఇంకా ముసలాడు బతికేఉన్నాడటగా ?

బంగారమ్మ : ఉండకేమవుతాడు ? అటు చావడు, ఇటు బతకడు ! వేధించుకుతింటున్నాడు.

తులశమ్మ : ఆయన దగ్గరున్న సొత్తు మరెవరిచేతిలోకి పోలేదుగదా !

బంగారమ్మ : ఇప్పుడే తన చెల్లెలు దేవకమ్మకు కబురంపించాడు. బహుశా తనదగ్గరున్న డబ్బూ దస్కం ఆవిడకే ఇస్తాడేమో !

తులశమ్మ : లేకపోతే ఇంకెవరికిస్తాడు. ఇంతవరకుమాత్రం ఎవరికీ ఇవ్వలేదుగదా !

బంగారమ్మ : లేదు ! కళ్ళల్లో వొత్తులేసుకొని నేను కాచుకూర్చున్నానుగా ! జేజమ్మ దిగివస్తేమాత్రం నేను పోనిస్తానా !

తులశమ్మ : అసలు ఆ డబ్బెక్కడున్నట్టు ? కనిపెట్టావా?

బంగారమ్మ : ఎంతమొత్తుకున్నా అంతుచిక్కటం లేదు. కాసేపు ఇక్కడ ఒదిగొదిగి కూర్చుంటాడు, కాసేపు మరోచోట ఒదిగొగి కూర్చుం టాడు. బిడ్డ మేనక ఉందిగా! దానిబండబడ! చూట్టానికి చచ్చుపెద్దమ్మలా కనిపి స్తుందిగాని....దానికి నోట్లో లేవ పళ్ళు....లో ఉన్నాయి! ఎంత మెళుకువను న్నావు?....నాలుగువేపులా కనిపెడుతూనేఉంటుంది....వీళ్ళందర్నీ కనిపెట్ట లేక నాపుచ్చి పగిలిపోతోంది అత్తమ్మా!....నాకు పిచ్చెత్తిపోయేట్టుంది.... చచ్చిపోతున్నాననుకో !....ఏం చెప్పను నాతిప్పలు....!

తులశమ్మ : ఓసి నా వరహాలకోడలా, నామాటవిను : ఇప్పుడే కాస్త మెలుకువగా ఉండాలే తల్లీ! ఇలాంటప్పుడే ధైర్యం చిక్కబట్టుకోవాలే పిచ్చి పిల్లా! ముసలాడు ఆసొత్తుకాస్తా మరెవరిచేతిలోనైనా పెట్టాడూ అంటే.... నీ బతుకు బండలవుతుంది. చచ్చేవరకూ చింతతప్పదు నీకు! వాళ్ళు నిన్ను ఇంట్లోనించికూడా వెళ్ళగొట్టేస్తారు. ఈ చచ్చుపీనుగుతో ఇంతకాలం సత మతమయ్యావు. వీడితర్వాతకూడా దిక్కుమాలిన దానవై వీధివీధీ, ఇల్లిలూ తిరిపెమెత్తుకుంటూ తిరుగుతావనే చవటదద్దమ్మా! నాటి తిప్పలు చూచుకో, నేటివేమొచ్చె! దీపం ఉండగానే ఇల్లుచక్కబెట్టుకోటం తెలివైనవాళ్ళలక్షణం! జాగ్రత్త....నీమంచికోసమే చెపుతున్నాను.

బంగారమ్మ : నేనూ అదే ఆలోచిస్తున్నాను అత్తమ్మా : లోలోపల ఎంత అడిలిచస్తున్నాననుకున్నావు! తలుచుకుంటే గుండెలు గుభిల్లుమంటు న్నాయి! ఎవరినైనా సలహా అడుగుదామంటే నా అన్నవాళ్ళు లేకపాయె, చంద్రయ్యతో చెబితే తనకేమీ పట్టనట్టు విని ఊరుకున్నాడు! ఆ గదిలో తన మంచంకిందనే తవ్విపాతేసేడని మాత్రం చెప్పాడు—అంతే!

తులశమ్మ : మరి అక్కడచూశావా ?

బంగారమ్మ : ఎట్టా చూడగలను అత్తమ్మా! ముసలిపీనుగు గదిలో

నించి కాలుకదిపితేనా ? అయినా ఆ సొమ్మును ఒక తెన్నున ఉంచితేగా?.... ఒక రోజు మొలలో దాచుకుంటాడు, మరోరోజు మరే యిరుకునో మాయం చేస్తాడు !

తులశమ్మ : ఏమో కోడలా ! జాగ్రత్తగా మసులుకుంటేనే నీ మనుగడ కడతేరుతుంది ! ఒక కంట కనిపెట్టి ఉండు ముసలాణ్ణి ! వాడి యెత్తులకు పైయెత్తులువేస్తేగాని భంగపాటు తప్పదు. (చెవిలో రహస్యంగా చెబుతుంది) ఆ కాఫీలో కలిపి ఇచ్చేది—ఇచ్చేవా ?

బంగారమ్మ : ఓహో, (జవాబు చెప్పబోతుంది, అంతలోనే ఒక పొరిగింటావిడ వీళ్ళపక్కనించేపోతూ లోపలినించి వచ్చిన కేకవిని నిలిచిపోతుంది)

పొరుగింటావిడ : బంగారమ్మా! ఓ బంగారమ్మా! లోపల మీ ఆయన పిలుస్తున్నట్టున్నాదే నిన్ను !

బంగారమ్మ : ఆఁ, పిలవటంకాదు, పాడూకాదు. దగ్గుకాదూ అక్కాయ్? ....ఒకటే దగ్గు తెంపులేకుండా ! మాయదారి దగ్గు ఎక్కణ్ణించి వొచ్చిందో అమనిషిని కుంగదీసేస్తోంది. అలా దగ్గుతూంటే పిలుస్తున్నట్టే ఉంటుంది ! చూడబోతే ఆయనస్థితి ఏమీ బాగా లేదక్కాయ్ !

పొరుగింటావిడ : (తులశమ్మ దగ్గరికొచ్చి) ఏం పిన్నీ, అంతా బాగున్నారా ? చాలా దూరాభారంనుంచి వచ్చినట్టున్నావే !

తులశమ్మ : అవునమ్మా ! ఇంటిదగ్గర్నుంచే బయలుదేరివచ్చాను.... పిల్లగాణ్ణి చూచిపోదామని! ఇవి కాసిని వాడికోసమే తెచ్చాను. కన్నకడుపు తీపినీకు తెలీందేముంది తల్లీ ! వాడికిక్కడ ఏ లోపం లేకపోయినా నాచేత్తో పెట్టుకోవాలనే కోరిక అణుచుకోలేకుండా ఉన్నాను.

పొరుగింటావిడ : అయ్యో, కాదు పిన్నీ మరి. (బంగారమ్మతో)

బట్టలు తీసుకుని రేవుకు వెళ్దామనుకున్నాను, కాని ఇంతపొద్దున్నే వెళ్తే ఎవరేనా అక్కడ జత ఉంటారో లేదో....అనుకుంటూ ఇలా వచ్చాను!

బంగారమ్మ : ఆఁ, పోనిద్దూ. ఇంతపొద్దున్నే తొందరేమొచ్చింది!

తులశమ్మ : అవును కోడలా, తులసిదళంవేసి గంగాజలం తాగించావా ఆయనకు?

బంగారమ్మ : ఇచ్చాను పిన్నీ, నిన్న శాస్త్రిగారు వచ్చి ఇచ్చి వెళ్ళారుగా?

పొరుగింటావిడ : అవును పిన్నీ, నిన్న నేనుకూడా చూశాను. ఏదో గోరంత ప్రాణం ఇంకా శరీరాన్ని అట్టిపెట్టుకొనిఉంది. రామరామ! ఎంత హీనదశ! మనిషిచూస్తే మటుకు....ఇప్పుడో, ఇంకాసేపటికో అన్నట్టున్నాడు. మొన్న మాత్రం....మనిషిని సొంతం కిందపెట్టుకుని ఇంటిల్లిపాదీ గొల్లుమన్నారు. వాహనం ఏర్పాట్లుకూడా జరిగాయి!

బంగారమ్మ : అంతలోకే మళ్ళీ ప్రాణం వచ్చేసింది.

తులశమ్మ : అంతేనమ్మా, వచ్చేప్రాణం పోయే ప్రాణం....అలాగే ఉంటుంది. మరయితే దానధర్మాలు ఏమైనా చేయించావా లేదా?

బంగారమ్మ : అంతా అదే అన్నారు. ఈ రోజుగడిస్తే రేపు అలాగే నలుగురు బ్రాహ్మలకు పెట్టిస్తాను.

తులశమ్మ : అమ్మా బంగారమ్మా! ఉన్నమాట చెపుతున్నాను: ఆయన ఇటో అటో తేలేవరకూ నీకు ఊపిరిసలపదు. తిన్నతిండీ తాగిన నీళ్లూ వంటబట్టవు. ఎలా వేగుతావో తల్లీ!

పొరుగింటావిడ : నిజమే పిన్నీ! నేనూ చూస్తున్నానుగా: ఆయన సంవత్సరంనుంచీ ఇలాగే తీసుకుంటున్నాడు. అటు ఆయనకీ సుఖంలేదు, ఇటు పాపం బంగారమ్మకూడా నిద్రాహారాలకు ముఖం వాచిపోతోంది,

తులశమ్మ : ఇదేముంది, ఇంకా ముందున్నాయి! బంగారమ్మ కష్టాలు! వయసులో ఉన్న నాలుగురోజులు అలా సాగితే బాగానే ఉండేది. కాని ఆయన వొంట్లో నరికినా నెత్తురుచుక్క రాలకపాయె! అయినా ముసలి తనం వచ్చాక ఏం బ్రతుకులెద్దూ. నన్ను చూడరాదూ, ఇంటిదగ్గర్నించి ఇక్కడికి వచ్చేసరికే నా తలప్రాణం తోకకొచ్చింది. అవునుగాని మా చంద్రయ్య ఏడీ ?

బంగారమ్మ : అరక తోలుకువెళ్ళాడు. పద, కుంపటి అంటించి నీకు కొంచెం కాఫీ పెట్టిస్తాను, అలసట కొంచెం ఉపశమిస్తుంది.

తులశమ్మ : (నేలమీదకూర్చుంటూ) నిజమేనమ్మా, మరీ ప్రాణం దడదళ్ళాడుతూంది. చూడు, ఇలాంటప్పుడు దానధర్మాలుచేయటం చాలా అవసరంసుమీ! అలాచేస్తేనే ప్రేతాత్మకు సంతృప్తి!

బంగారమ్మ : రేపు బ్రాహ్మల్ని పిలిపించనా ?

తులశమ్మ : ఆఁ, తప్పకుండా పిలిపించు!....విన్నావా, మా ఊళ్ళో ఈమధ్య ఒక పెళ్ళిజరిగింది.

బంగారమ్మ : ఎవరిది ?

తులశమ్మ : కృష్ణారావుది! ఆయనకేఁ! లక్షాధికారి! మనలాంటి పేదవాళ్ళు మంచిచేసినాకూడా లోపాలు ఎంచుతుంది లోకం. ఆయన్ను ఎవ రేమనగలరు ? ఆ రాజమ్మను చేసుకున్నాడు!

బంగారమ్మ : దాని అదృష్టం పండిందిలే!

పొరుగింటావిడ : ఆయన వట్టి తిరుగుబోతువాడటగా! పిల్లలుకూడా ఉన్నారనుకుంటాను ?

తులశమ్మ : లేకేం ?—నలుగురు. చూస్తూ చూస్తూ పరువుమర్యాదలు గల ఏ తండ్రి తన కూతుర్ని ఇతగాడికిచ్చి గోతిలో తోస్తాడు ? అందుకనే ఆ రాజమ్మను చేపట్టాడు. ఏదో గంతకుతగ్గ బొంత!

పొరుగింటావిడ : రామరామ, లోకులేమనుకుంటారోనన్న మాటేనా లేదు. చేతిలో నాలుగుడబ్బులుండంగానే సరా ?

తులశమ్మ : ప్రస్తుతానికి ఇద్దరూ బాగా కలిసిమెలిసే ఉంటున్నారు !

పొరుగింటావిడ : ఉండకేమవుతారులే—ఇద్దరూ ఒకలాంటివాళ్లేగా !

(పొరుగింటిలోనించి ఒక మగగొంతు వినిపిస్తుంది.)

కుంతీ, ఓ కుంతీ ! ఎక్కడ చచ్చావ్ ! ఆ ఆవును కాస్త దొడ్లోకి తోలు ! (పొరుగింటావిడ వెళ్లిపోతుంది)

తులశమ్మ : (పొరుగింటావిడ వింటున్నంతవరకు మామూలు గొంతుతో) ఆ పెళ్ళికావటమే మంచిదయిందిలే ! లేకపోతే మా ముసలా యన నన్ను వేధించుకతినేవాడు—'పిల్లగాడిపెళ్లి' 'పిల్లగాడిపెళ్ళని ! (తటా లున గొంతుతగ్గించి) అమ్మయ్య ! బాధవొదిలింది. (గుసగుసలాడుతూ) నే తెచ్చిన పొడి ఇచ్చావా కాఫీతో ?

బంగారమ్మ : ఇక దానివిషయం ఎత్తబోకు అత్తమ్మా ! ముసలాడు ఎలాగూ పోయేట్టేఉన్నాడు ! అనవసరంగా నేనీ పాపకార్యంలో కాలు బెట్టాను !.... అబ్బా ! నాతల తిరిగిపోతోంది ! అత్తామ్మా !....నాతల తిరిగిపో తోంది ! అయినా ఆ మందు నువు నాకెందుకిచ్చావు ?

తులశమ్మ : మరి ఆ నిద్రమందు ?—ఓసి పిచ్చిపిల్లా ! ఆమందు ఎందుకివ్వలేదమ్మా ! దానివల్ల వచ్చే ప్రమాదం ఏమీలేదు.

బంగారమ్మ : నిద్రమందుమాటకాదు. ఇంకోటిలేదూ....అ తెల్ల టిది....

తులశమ్మ : ఓసి నా వరహాలకోడలా, అదిచూర్ణమమ్మా. అదే చాల గట్టిగాపనిచేస్తుంది.

బంగారమ్మ : (నిట్టూర్చి) నిజమే, కాని అమందు కలిపి ఇవ్వాలంటే

నాకు దడపుట్టుకొస్తున్నది. ముసలాడి కెన్ని అనుమానాలు ! తిన్నగా తాగి చస్తాడనే నమ్మకం లేదు నాకు.

తులశమ్మ : అసలు ఇచ్చావా ఒక మోతాదన్నా ?

బంగారమ్మ : ఇచ్చాను రెండు మోతాదులు.

తులశమ్మ : ఏమైనా మార్పు కన్పించిందా ?

బంగారమ్మ : నేనొక్కచుక్క నాలికమీద వేసుకు చూశాను. చేదు చేదుగా ఉంది. అంతా తాగేసి, 'ఇక కాఫీకూడా నాకు విషమైపోలావుంది'— అన్నాడు. అసలు నీ రుచి చెడిపోయిందిలే అన్నాను నేను. అనటానికి అలా అన్నానేగాని నా శరీరమంతా వణికిపోయింది. మనసులో చెయ్యి పెట్టి దేవినట్టయింది.

తులశమ్మ : ఎక్కువగా ఆలోచించకూడదు. తెలిసిందా ? ఎంత ఆలోచిస్తే అంతగా మనసు చెడిపోతుంది.

బంగారమ్మ : అసలు ఆ పాడుచూర్ణం నాకెందుకిచ్చావత్తా ?.... ఈపాపకార్యంలోకి నన్నెందుకు దించావు ? తలుచుకుంటే నాగుండెకు గాలం నాటుకున్నట్టుంటోంది.

తులశమ్మ : బలేమంచిదానవే కోడలా ! నీ ఉద్దేశమేమిటో నాకు అర్థం కావటంలేదు. ఆరి భగవంతుడా ! నామీద వేస్తున్నావా ఈ అభాండం? మంచి జరిగినా చెడుజరినా నాకేమీ సంబంధంలేదు. నాకేమీ తెలీదు, నేనేమీ ఎరగను. కావాలంటే ప్రమాణంచేసి చెబుతాను. నా అంతట నేను ఏమందైనా తీసుకొచ్చి నీకిచ్చానా ? ఆమందులు మాకులు నేనెన్నడూ చూడలేదు, వినలేదు. అసలు అలాంటి మందులుంటాయని కూడా నాకు తెలీదు. ఇక నీ విషయం నువు చూసుకో అమ్మా ! రేపటి సంగతి ఎవరికి తెలుసు ? నీ కష్టాలను చూసి సలహా ఇచ్చిపోదామని వచ్చాను. ఈ కష్టాలు ఎంతకాలం

భరిస్తావు? సహనానికైనా ఒక హద్దుంటుందిగా! నీ మారుటికూతుర్ని చూడబోతేనేమో శుద్ధ మొద్దావతారం! ఇటు నీ మొగుణ్ణి చూస్తేనేమో—చావడు, బతకడు! ఈ స్థితిలో మరొకరైతేనా?....

బంగారమ్మ : నిజమేనమ్మా, నేను కాదంటంలేదు. నా స్థానంలో మరొకరుంటే ఈపాటికి ఎంత రాద్ధాంతం చేసిఉందురో! ఏ నుయ్యో గొయ్యో చూసుకోటమన్నా జరిగేది, లేదా ముసలాడిగొంతు పిసికేసి గోదవతల పారేయటమన్నా జరిగేది!....నా బతుకు బండలయిపోయింది.

తులశమ్మ : నేను చెప్పేదీ అదే కోడలా! ఇది జాగుచెయ్యాల్సిన తరుణమా? నోరు తెరుచుక్కూర్చుంటే పనులు జరుగుతాయా? ఎలాగో లాగ ఆ నగదురూపాయలు చేజిక్కించుకోవాలి....తొందరగా మరో మోతాదు కాఫీ యిచ్చి నీ కష్టాలు కడతేర్చుకో.

బంగారమ్మ : అబ్బో! నా తల తిరిగిపోతోంది!....తిరిగిపోతోంది! ఏం చేయటానికీ తోచటంలేదు. భయంగా ఉంది. ఎలాగూ ముసలాడు చావటానికి సిద్ధంగానే ఉన్నాడు, మళ్లా పాపం తలకు చుట్టుకోటం దేనికి?

తులశమ్మ : (కఠినంగా) చచ్చేవాడైతే డబ్బు నీ చేతి కివ్వడేం? చస్తూ వెంట తీస్కుకెళ్తాడా ఏం? చివరకు అంత రొఖ్ఖం పరాయివాళ్ళపాలు చేసేట్టే ఉన్నాడు ఆయన, ఇది పాపం కాదా? ఇప్పుడు తాను మళ్ళీ బతికి నిన్ను ఉద్ధరించబోతున్నాడా? ఆయన వరసచూస్తే ఆ ఆశ ఏమన్నా కనిపిస్తోందా పోనీ చెప్పు? అటువంటివాణ్ణిగురించి యేమిటీ పిచ్చి నీకు?

బంగారమ్మ : ఏమో అత్తా, నాకేమీ తెలీదు—నాకేమీ తెలీటంలేదు. మంచంలోబడి తీసుకుంటూ నన్నుమాత్రం కాల్చుకు తింటున్నాడు.

తులశమ్మ : ఓసి పిచ్చిపిల్లా. అంతా తెలిసిందే! తెలీకపోటానికేముంది నరకఇందులో? ఇప్పుడు గనక వెనకడుగు వేశావా, తరవాత పశ్చాత్తాప

పడతావు! ఉన్న డబ్బు కాస్తా తన చెల్లెలికిచ్చిపోతే నువ్వు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటావు!

బంగారమ్మ : నిజమే అత్తా, నువ్వు చెప్పేదీ నిజమే! ఇప్పుడే చెల్లెలికి కబురంపాడు కూడాను. అయితే వెళ్ళిరానా మరి ?

తులశమ్మ : కొంచెమాగు! ముందు కాఫీపని కానీ....ఆ తరువాత ఇద్దరం వెతుకుదాం! భయపడకు! ఆ డబ్బెక్కడున్నదో దొరక్కపోదు!

బంగారమ్మ : ఏమైనా గొడవజరిగితేనో ?

తులశమ్మ : ఏమీకాదు! ఆ సొమ్ము నీది, నీ కళ్ళముందు ఉంది. అమాంతం ఇంకోళ్ళచేతుల్లోకి పోతూంటే చూస్తూ ఊరుకోవలసిందేనా ? వెళ్ళు, నీ కెందుకు....నేను చెప్పినట్టుగా చెయ్యి.

బంగారమ్మ : అయితే వెళ్ళి కాఫీ పెట్టి వస్తాను.

తులశమ్మ : ఊఁ వెళ్ళు! చేసేపని బందోబస్తుగా చెయ్యి. (వెళ్తున్న బంగారమ్మను వెనక్కి పిలుస్తుంది) ఇంకో విషయం: ఈ సంగతి చంద్రయ్యతో చెప్పేవు! వాడు వట్టిమూర్ఖుడు! చూర్ణం విషయంకూడా వాడికి తెలియనీవద్దు! వాడిది వట్టి పిరికి హృదయం! కోడిగుడ్డు చేతిలో తీసుకోడానికే భయపడేవాడు మొదట్లో! వాడికిదేమీ చెప్పమాకు. (నిశ్శబ్దితను చూసి భయపడి మౌనం వహిస్తుంది. గుమ్మంలోనుంచి జోగయ్య కన్పిస్తాడు)

జోగయ్య : (గోడపట్టుకొని నెమ్మదిగా నడిచివస్తూ హీనస్వరంతో పిలుస్తాడు) ఏమే! వినపడుతున్నదా ?....బంగారం....ఓ బంగారం! ఎక్కడున్నావే? ఈవిడెవరు ?....ఓహో నువ్వా!....

(బల్లమీద దభాలున కూర్చోబడతాడు)

బంగారమ్మ : (అవతలిమూలనుంచి తొందరగావచ్చి) ఏఁ? బయటికొచ్చావెందుకు మళ్ళీ? ఒకచోట కూర్చోరాదూ ?

జోగయ్య : ఇదుగో.... మేనక దేవకిని పిలవటానికి వెళ్ళిందా ?.... అబ్బా!.... ఈ ప్రాణాలు నన్ను వదలకుండా ఉన్నాయి !.... అబ్బా !.... ఆయాసం !....

బంగారమ్మ : దానికి తీరికేదీ ? బట్టలుతీసుకుని రేవుకు పోయింది. కొంచెమాగు, ఇక్కడ తెమల్చుకుని నేనేవెళ్ళి పిల్చుకొస్తాను.

జోగయ్య : చిన్నదాన్ని పంపించరాదూ ?.... అదెక్కడుంది ?.... నాపని అయిపోయిందే.... ఇక నే బతకను....

బంగారమ్మ : దాన్ని పిలిపిస్తాన్లే.

జోగయ్య : ఎక్కడుంది ?

బంగారమ్మ : ఏమో, ఎక్కడచచ్చిందో !

జోగయ్య : బంగారం.... నారాణీ.... భరించలేకుండా ఉన్నానే.... ఏదో లోపల.... సున్నపు బట్టీకిమల్లే.... పొగలు సెగలు రేగుతున్నాయి !.... నామీద నీకింత చిన్నచూపయితే ఎలాగే ?.... కుక్కచావుచచ్చేట్టుగా.... నాకు నన్ను విడిచిపెట్టేస్తావే !.... మంచినీళ్ళిచ్చేవాళ్లుకూడా లేరు !.... ఎందుకీ శిక్ష నాకు ?.... అయ్యో !.... చిన్నదాన్ని కాస్త పిలువు !

బంగారమ్మ : ఇదుగో, వచ్చింది ! సునందీ, ఇలారా, త్వరగావచ్చి మీనాన్న పిలుస్తున్నారు చూడు !

(సునంది పరుగెత్తుకుంటూ వస్తుంది, బంగారమ్మ ఇంటివెనక్కు వెళ్తుంది)

జోగయ్య : చూడమ్మా నందీ !.... కాస్తవెళ్ళి, దేవకి అత్తను పిలుచుకురా !.... నాన్న పిలుస్తున్నాడని చెప్పు !.... వెంటనే రమ్మను.... తొందరగా రావాలి, తెలిసిందా ? ...

సునంది : అలాగే నాన్నా !

జోగయ్య : తొందరగా రమ్మను.... నేను చచ్చిపోతున్నాననిచెప్పు.... వెంటనే రమ్మను.

సునంది : తొందరగా వెళ్లొస్తాను నాన్నా ! (పరుగెత్తుతుంది)

తులశమ్మ : (కనుసైగచేసి) ఇదేసమయం ! వెంటనే గదిలోకెళ్ళి అంతా వెదికిరా ! ప్రతిమూలా వెదుకు ! వస్తువులన్నీ తిరగేసి మరగేసి గాలించు ! తెలిసిందా ? ఇక్కడ నేను ఆయన దగ్గరేమైనా ఉన్నదేమో చూస్తాను.

బంగారమ్మ : నువు దగ్గరుంటే నాకు ధైర్యంగా ఉంటుంది. (తలుపు దగ్గరకెళ్ళి — జోగయ్యతో) నీకు కొంచెం కాఫీచేసి ఇయ్యమంటావా ?.... ఇదుగో తులశమ్మ వచ్చిందు... కొడుకును చూసివెళ్ళటానికి ! ఆవిడతోపాటు నీకూ కాస్త కాఫీ ఇస్తాను [illegible].

జోగయ్య : సరే-చేసి తీసుకరా !

(బంగారమ్మ లోపలికెళ్తుంది. తులశమ్మ వాకిలిదగ్గరి కొస్తుంది.)

తులశమ్మ : బావున్నావా, జోగయ్యబాబూ ! ఈ జబ్బు నిన్ను వదిలేట్టు కన్పించటం లేదే ! నీ మేలు మేం మరువలేం ! మా ముసలాయనకు ఎల్లప్పుడూ నీ ఆరోగ్యాన్ని గురించిన చింతే ! వెళ్ళి చూసిరమ్మని నన్ను పంపించాడు !

జోగయ్య : ఇక నేను బతకను తులశమ్మా !

తులశమ్మ : ఏమిటో బాబూ, నిన్ను చూస్తే అలాగే అనిపిస్తోంది ! ఎంతటివాళ్ళకైనా మరణం తప్పదుగదా ! మరీ బలహీనంగా ఉన్నావు ! ఈ జబ్బు నిన్ను బాగా కుంగదీసింది జోగయ్యబాబూ !

జోగయ్య : నాకు అంతిమఘడియలు సమీపించాయి తులశమ్మా !

తులశమ్మ : అంతా ఆ భగవంతుడి దయ నాయనా ! దాన్నిమనం

తప్పించుకోగలమా ? గంగాజలం పుచ్చుకున్నావా బాబూ ? ఇలాంటి దశలో చేసిన దానాలు, పుణ్యాలే....వెంటవచ్చేవి. నీకిప్పుడు రామనామమే శరణ్యం ! మరోచింతఏమీ పెట్టుకోమాకు. మీ ఆవిడకూడా చాలా తెలివి గలదేలే ! కర్మకాండ అంతా యథావిధిగా జరిపిస్తుంది ! నీ ఆత్మశాంతికి సమస్తం చేస్తుంది. అన్నీ ఘనంగా జరుగుతాయి. నీపేరు నిలబెడుతుంది మీ ఆవిడ ! ఇందుకు సందేహంలేదు.

జోగయ్య : ఏఁ నిలబెడుతుందో ఏమో !....దాని మనసు చాలా చంచలమైంది....ఇంకా దానికి చిన్నతనం....నాకన్ని విషయాలూ తెలుసు ! ....మేనకను చూడబోతేనేమో—వట్టిమొద్దు !....దానికి యుక్తవయస్సు వచ్చింది....ఏదో నాకు చేతనైనంతవరకు నేను....ఈసంసారాన్ని ఇప్పటి దాకా నెట్టుకొచ్చాను....ఇకపైని ఎలా సాగుతుందో ఏమో....అదే చింతగా ఉంది. (దుఃఖిస్తాడు)

తులశమ్మ : డబ్బూ దస్కం విషయంలోనేనా విచారం ?....ఆ వివరాలన్నీ ఆవిడకు చెబితే సరిపోతుందిగదా ?

జోగయ్య : ఏమే....సునంది వెళ్లిందా ?

తులశమ్మ : (స్వగతం) ఊఁ, చెల్లెల్ని మరవటంలేదు చూశావా ?

బంగారమ్మ : (లోపల్నుంచి) అప్పుడే వెళ్ళిందిగా ! నువు కాస్త లోపలికిరా ! నేను పట్టుకుంటాన్లే, లేచిరా !

జోగయ్య : నన్ను కాసేపు ఇక్కడే కూర్చోనివ్వూ! ఎలాగు మరణం సమీపించింది....ఇంకా లోపల పడుకోటం దేనికి ?....నా లోపల.... గుండె మండిపోతున్నట్టుంది....మంటలు.... జ్వాలలు.... అబ్బా !....చావు త్వరగా రాదేఁ !

తులశమ్మ : చావనేది మనం పిలిస్తే వస్తుందా జోగయ్యబాబూ ? మృత్యుదేవతనుకూడా నమ్మటానికి వీల్లేదు ! కాలం మూడాలి, పోవాలి,

ఎవరు చూశారు....నీ ఆరోగ్యం మళ్లా కుదటబడి ఎప్పటిలాగా లేచి తిరుగుతావేమో ! అధైర్యపడమాకు ! మా వూళ్లో ఇట్టాగే చావుబతుకుల మధ్య ఊగులాడీ ఊగులాడి ఒకమనిషి చట్టున లేచి—

జోగయ్య : నాకు తెలుసు....నేను మాత్రం ఇక బతకను !....నా సంగతి నాకు తెలుసు !....బాగా తెలుసు....(వెనక్కి ఒరిగి పడుకొని కళ్ళుమూస్తాడు)

బంగారమ్మ : (లోపల్నుంచి వచ్చి) లోపలికి వస్తావా రావా ? నీ కోసం ఆవిడకూడా కనిపెట్టుకుని ఉంది—విన్పిస్తోందా లేదా — ఇదుగో !— నిన్నే !—

తులశమ్మ : (సంకేతంతో బంగారమ్మను పిలుస్తుంది—మరో వేపుకు)....ఏమిటి, ఏమైనా దొరికిందా ?

బంగారమ్మ : ఏమీ దొరకలేదు.

తులశమ్మ : అంతటా చూశావా ?

బంగారమ్మ : అంతా వెదికాను ! దొరకలేదు ! ఇనప్పెట్లోనే పెట్టాడేమో ! నిన్న అటు వెళ్లటం చూశాను !

తులశమ్మ : అయితే వెళ్లి చూడు ! మూలమూలలా గాలించి విడిచి పెట్టాలి. స్పష్టంగా కనిపిస్తోంది. ఈ రోజు గడవదు....గోళ్లు నల్లబడి పోయినై, ఒళ్లంతా బూడిదరంగుకు తిరిగిపోతోంది ! ఈ వేళతో నీ కష్టాలు కడతేరినట్టే— కాఫీ తయారయిందా ?

బంగారమ్మ : నీళ్లు తెర్లొచ్చాయి !

చంద్రయ్య : (రెండోవైపునుంచి లోనికొస్తాడు, జోగయ్యను చూడడు) ఏం అమ్మా ! ఇంటిదగ్గర అంతా క్షేమంగా ఉన్నారా ?

పులశమ్మ : ఏదో భగవంతుడి దయవల్ల అందరూ బాగానేఉన్నారు నాయనా !

చంద్రయ్య : జోగయ్యగారి కెలా ఉంది ?

పులశమ్మ : ఇల్లో....ఆయన అక్కడే కూర్చున్నాడు.

చంద్రయ్య : కూర్చోనియ్, నాకేం ?

జోగయ్య : (కళ్లుతెరిచి) చంద్రయ్యా ! ఓ చంద్రయ్యా, ఇలా రా !

[చంద్రయ్య వస్తాడు, బంగారమ్మ, పులశమ్మ ఏదో గుసగుసలాడుతుంటారు]

జోగయ్య : ఏం ఈవేళ అప్పుడే వచ్చేశావు ?

చంద్రయ్య : దున్నటం అయిపోయింది.

జోగయ్య : వంతెనవతల చక్కకూడా దున్నివచ్చావా ?

చంద్రయ్య : అదెక్కడో చాలాదూరాన ఉందిగా ! రేపు చూస్తాను దానిపని.

జోగయ్య : రేపు దగ్గరకొస్తుందా ?....లేక ఈవేళ ఇల్లు నీకు దగ్గరకొచ్చిందా ?....వెళ్ళు....వెంటనే నాగలి కట్టుకెళ్ళి అదికూడా పూర్తిచేసుకురా !....అటునుంచి అటేవెళ్తే ఎంత దూరమయ్యేది ?....తల్చుకుంటే ఈ పాటికి.... రెండూపూర్తిచేసుకు రాకపోయేవాడివా ? (బంగారమ్మ కనపడకుండా ఒక పక్కన నిలుచుని అంతా వింటుంది.)

పులశమ్మ : ఒరే నాన్నా ! యజమానిపని అలాచేస్తే ఎలాగురా ! ఆయన మనస్సు కష్టపెట్టరాదురా ! అసలే ఆయన ఆరోగ్యం సరిగాలేదు. నీవే గదా ఆయనకు ఆధారం ! నీమీద గంపెడాశతో ఉన్నా డాయన ! తండ్రిగా భావించి నువు ఆయనకు సేవచెయ్యాలి! నువు ఆయన పనులన్నీ ఒక్కటి మీరుపోకుండా చక్కబెట్టుకు వస్తున్నావనే అనుకుంటున్నాను నేను.

జోగయ్య : అయ్యో....అమ్మా....వి త్తనాల బంగాళాదుంపలుకూడా కాస్త తీసి వెళ్లు!....ఆడవాళ్లు వాటిని సిద్ధం చేస్తారు!

బంగారమ్మ : (వేరుగా తులశమ్మతో) భయపడమాకు! నే నెక్కడికీ పోనులే! నా కంతా అర్థమవుతూనే ఉంది! మళ్ళీ అందర్నీ బయటికి పంపించే ఎత్తు వేస్తున్నాడు. డబ్బు చూస్తే ఆయనదగ్గరే ఉన్నట్టుంది. ఎక్కడో దాచిపెట్టాలనే ఆయన ఉద్దేశం!

జోగయ్య : అబ్బెబ్బే! చెప్పినా అర్థం కాదేం?....వెంటనే ఆ పని చూడకపోతే....నాట్ల సమయం వచ్చేటప్పటికి....బంగాళాదుంపలన్నీ కుళ్ళి పోతాయి....అందుకనే చెబుతున్నాను....ఇప్పుడే కాస్త వాటిని జాగ్రత్తగా ఉంచుకుంటే మంచిది!....అంతకన్న మరేంలేదు... (లేస్తాడు)

తులశమ్మ : (పరుగెత్తి జోగయ్యను పట్టుకుంటుంది) లోపలి కెళ్తావా జోగయ్యబాబూ, పద నేను తీసుకెళ్తాను.

జోగయ్య : సరేపద! (అగుతాడు)

చంద్రయ్య : (కోపంగా) అయితే ఏమంటావు?....

జోగయ్య : ఏమిలేదురా తమ్ముడూ....ఇక నేను . నీకు కన్పిం చను....నాయనా, చంద్రయ్యా....ఈ శరీరం ఈ రోజునే మట్టిలో కలిసి పోతుంది....చంద్రయ్యా, బాబూ, దేవుడిపేరు తలుచుకుని నన్ను క్షమించు ....నా అపరాధాలన్నీ మన్నించు....మనసా....వాచా....కర్మణా....నా అప రాధాలేమున్నా....అన్నీ మన్నించు తమ్ముడూ!....

చంద్రయ్య : నేను క్షమించడమేమిటి! నేనే ఒక పాపిష్టివాణ్ణి.

తులశమ్మ : ఒరే నాన్నా, చూడు, ఇలాంటప్పుడు కాస్త దయగా ఉండాలిరా,

జోగయ్య : చంద్రయ్యా, భగవంతుడికోసం....నన్ను క్షమించు నాయనా (ఏడుస్తాడు)....

చంద్రయ్య : (నిలువునా కరిగి) మీరంటే నా కెలాంటి దురభిప్రాయం లేదు అన్నాయ్! క్షమించాల్సింది, నేను కాదు, మీరే! నన్ను మీరు మొదటినుంచీ ప్రేమగానే చూసుకున్నారు! కాని నేనే మీపట్ల చాలా అపరాధాలు చేసి ఉంటాను! (ఏడుస్తాడు)

(జోగయ్య జేతులు జోడించి, వెక్కి-వెక్కి ఏడుస్తూ లోపలికి వెళ్తాడు, తులశమ్మ పట్టుకొని తీసుకునివెళుతుంది)

బంగారమ్మ : ఓహ్!....నా తల తిరిగిపోతోంది,....చెల్లెల్ని ఊరికే పిలిచి వుండదు! (చంద్రయ్య దగ్గరకువచ్చి) అవునుగాని-డబ్బు మంచం కింద పాతిపెట్టాడని చెప్పావు; అక్కడెక్కడా పాతేసిన జాడేలేదే. ఇంకెక్కడా కన్పించలేదు ఎంత వెదకినా!

చంద్రయ్య : (జవాబివ్వడు, ఏడుస్తుంటాడు) ఆయన నాకెప్పుడూ కీడు చేయలేదు; ఎల్లప్పుడు మేలేచేశాడు. అలాంటివాడికి నే నెంత చెడు చేశాను!

బంగారమ్మ : సరేగాని, డబ్బు ఎక్కడున్నదో చెప్పు.

చంద్రయ్య : (కోపంగా) నాకేంతెలుసు? నన్నడగమాకు!

బంగారమ్మ : ఓహో!....ఈ సున్నితహృదయం ఎప్పటినుంచి?

చంద్రయ్య : ఆయన్నుచూస్తే నామనసు నీరై పోతావుంది. ఎంత దీనంగా ఏడ్చాడు ఆయన....శ్రీరామచంద్రా!....

బంగారమ్మ : ఓహో! జాలిగా ఉందా నీకు? పాపం, ఇన్నాళ్ళకు ఒకరు దొరికారు నీకు జాలిదలచటానికి! ఇంతకాలంవించీ కుక్కను తరిమి

నట్టు తరిమిందంతా ఏమైపోయిందో! ఇప్పటికిప్పుడు నిన్ను బయటికి వెళ్ల గొడుతున్నాడే! ఆమాత్రం జాలికి నేను నోచుకోకపోయానా?

చంద్రయ్య: నీమీద జాలెందుకు?

బంగారమ్మ: ఆయనకాస్తా గుటుక్కుమంటే.... ఆ డబ్బెక్కడో అణగారిపోతే.... ఏంగావాలి?

చంద్రయ్య: భయపడకు! ఆ డబ్బుకేమీ పరవాలేదు.

బంగారమ్మ: ఓచంద్రయ్యా! ఆయన దేవకమ్మను పిలవనంపాడు! డబ్బంతా ఆవిడకే ఇచ్చేట్టున్నాడు. ఇక మనగతి దుర్గతే! అంతా ఆవిడ చేతిలోకిపోతే మనం బ్రతికే దెట్లా? అవిడ మనల్ని ఇక్కడినుంచి వెళ్ల గొట్టకుండా ఉండనిస్తుందా? దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవటం మంచిది! నిన్నరాత్రి ఇనప్పెట్టెదగ్గరకు పోయాడన్నావుకదూ?

చంద్రయ్య: అవును, అక్కణ్ణించివస్తూంటే నేను చూశాను. కాని డబ్బెక్కడుందో నాకేంతెలుసు?

బంగారమ్మ: ఓహ్, నాతల తిరిగిపోతోంది! సరే, నువ్వు వెళ్లి అక్కడ చూపిరా. (చంద్రయ్య ఒక పక్కకు వెడతాడు. అంతలోనే తుల శమ్మ చంద్రయ్య దగ్గరకు వస్తుంది.)

తులశమ్మ: ఎక్కడికీ వెళ్లనవసరంలేదు. డబ్బు ఆయన శరీరం మీదనే ఉంది. ఒక దారానికికట్టి మెడలో వేసుకున్నాడు.

బంగారమ్మ: అబ్బో!....నాతల తిరిగిపోతోంది....తిరిగిపోతోంది... నేను ఎలాగ....

తులశమ్మ: ఇప్పుడే జాగ్రతపడు. ఆ దేవకమ్మ వచ్చిందంటే నువ్వు గాలికి బ్రతకాల్సిందే. అజాగ్రతగా ఉన్నావో....సర్వనాశనమైపోతావు.

బంగారమ్మ : నిజమే, ఆవిడ వచ్చిందంటే ఇంకేముంది? ఇచ్చేసే డన్నమాటే. ఏంచేసేదీ? అబ్బో! నాతల.... అమ్మో! తిరిగిపోతోంది....

తులశమ్మ : ఇంకా ఏంచేసేదని అడుగుతావేమిటి? నీళ్లు మరిగినట్టు న్నాయి, కాఫీ తయారుచేసి తీసుకరా! (రహస్యంగా) ఆయన కప్పులో నేనిచ్చిన చూర్ణంవెయ్! కాఫీలాగటం పూర్తికాగానే--మనపని మనం చేసే ద్దాం! భయపడకు! మనకేమీ అడ్డం చెప్పడులే!

బంగారమ్మ : బాబోయ్! నాకు చాలా భయంగా ఉంది.

తులశమ్మ : భయపడటానికీ టైములేదు మాటాడటానికీ టైములేదు. నీ చావో బ్రతుకో క్షణంలో తేలిపోతుంది. పో, త్వరగా కాఫీ తీసుకురా : ఈలోపల దేవకమ్మవస్తే నేను మాటల్లోబెట్టి ఇక్కడే నిలవేస్తాను. డబ్బు చేతికి చిక్కగానే నాదగ్గరకు తీసుకరా! చంద్రయ్య భద్రంగా దాచిపెడతాడు.

బంగారమ్మ : అబ్బో! నాతల.... బాబోయ్! తిరిగిపోతోంది! నేను ఎలాగు?.... ఎలాగు నేను....

తులశమ్మ : పిచ్చిమాటలు మాట్లాడుతూ వేళ మించబెట్టకు. అట్టే వ్యవధానంలేదు! వెళ్లు, నే చెప్పినట్టు చెయ్! చంద్రయ్యా!

చంద్రయ్య : ఏమిటి?

తులశమ్మ : నువ్విక్కడే ఉండు. అవసరం రావచ్చు!

చంద్రయ్య : (స్వగతం_రెండుచేతులు వెలకిల తిప్పుకొని) ఓరి భగవంతుడా! ఈ ఆడవాళ్లు ఎంతకైనా తగుదురే! వీళ్ల చేతిలో మగవాడు ఒక పిండిబొమ్మ! కీలుబొమ్మ! వీళ్లు నాశనంగాను! నేవెళ్లి ఆ బంగాళా దుంపలపనిచూసుకుంటాను! (పోబోతాడు)

తులశమ్మ : (రెక్కపట్టుకొని) ఎక్కడికిరా! నువ్వెళ్లేది? ఇక్కడే ఉండమన్నానుగా!

(సునంది వస్తుంది)

బంగారమ్మ : ఆఁ, ఉండాలి.

సునంది : అమ్మా, అత్తయ్యా వాళ్ళ కూతురిగారితోటలో ఉంటే చెప్పివచ్చానే. ఇప్పుడే వస్తానంది.

బంగారమ్మ : వస్తానందా ? ఇంకెలాగ ?

తులశమ్మ : నే చెప్పినట్లు చేస్తే ఇంకా వేళమించి పోలేదు.

బంగారమ్మ : ఏం చేయను ? బండలు చేయటం ! నాకేమీ తోచటం లేదు ! అబ్బో....తల తిరిగిపోతోంది ! సునందీ ! వెళ్ళి ఆవుదూడను చూస్తూఉండు—ఊడదీసుకొని పారిపోతుందేమో!...వినిపించిందే? (సునంది వెళ్ళిపోతుంది) నాకెందుకో చాలా భయంగా ఉంది!

తులశమ్మ : సీళ్లు మసల్తున్నాయేమో చూసిరా !

బంగారమ్మ : అబ్బో....నాతల తిరిగిపోతోంది !....తిరిగిపోతోంది! (వెళుతుంది)

తులశమ్మ : (చంద్రయ్యదగ్గరకు వచ్చి) ఒరే నాన్నా, (అతని పక్కనే కూర్చుంటుంది) ఇప్పుడే కాస్త నీ సంగతికూడా ఆలోచించుకోవాలి. ఏమంటావు ? అవునా ? మరి....

చంద్రయ్య : నా సంగతా ?

తులశమ్మ : అవునురా నాన్నా ! నీ జీవితం ఎలా గడుస్తుందో మరి....నీవేమైనా ఆలోచించావా ?

చంద్రయ్య : జీవితం ఎలా గడుస్తుందోననా ?....ఏఁ ? లోకంలో ఎంతమందికి గడవటంలేదు ? అలాగే నాకూ గడుస్తుంది.

తులశమ్మ : మీ ముసలాయన ఇవ్వాళ ప్రాణాలు వదిలేట్టే ఉన్నాడు.

చంద్రయ్య : అది మనచేతుల్లో లేదుగా ! భగవంతుడు ఆయన ఆత్మకు శాంతి ప్రసాదించాలని కోరుకుంటాను ! అంతకంటె నాకేంసంబధం ఉంది ?

తులశమ్మ : (మాట్లాడుతూ మాట్లాడుతూ) తలుపువైపు చూస్తూంటుంది) అది కాదురా బాబూ !....జీవించి ఉన్నవాళ్ల జీవితాన్ని గురించి ఆలోచించుకోవాలి ! అయితే దీనికి కొంచెం తెలివితేటలు కావాలి !....తెలివితేటలు ! ఏమంటావు ? నీకోసం నేనెన్నిచోట్లకు తిరుగుతున్నానో, ఎన్ని తిప్పలు పడుతున్నానో నీకేం తెలుసు ? నా కాళ్ల కండెలుకడుతున్నాయనుకో ! ముందుముందు నన్ను మరచిపోయేవు సుమీ ! ఏమంటావు ?

చంద్రయ్య : అయినా ఎందుకు నీవింత గాభరాపడుతున్నావు ?

తులశమ్మ : ఎందుకేమిటి రా నాన్నా, అంతా నీ మంచికోసమే! నీ మేలుకోసమే !....సమయానికి మేలుకోకపోతే చివరకు మిగిలేది బండి సున్నే ! బ్రహ్మయ్యగారిని ఎరుగుదువుగా ?...మనూరు మునసబు ?...ఒక రోజున వేరేపనిమీద ఆయనదగ్గరికెళ్ళి ఈవిషయంకూడా ప్రస్తావించాను. 'ఒక షావుకారున్నాడు, ఆయన రెండు పెళ్ళిళ్లు చేసుకున్నాడు; ఆయనకు మొదటిసంబంధాని కొక పిల్ల రెండో సంబంధాని కొకపిల్ల ఉన్నారు; ఆ షావుకారు చనిపోతే ఆస్తి ఆవిధవను పెళ్ళిచేసుకున్న వ్యక్తికి లభిస్తుందా లేదా ? ఆ ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయిపోయాక ఆ వ్యక్తి ఆ ఇంటికి యజమాని కావచ్చునా లేదా?'—అని నేనడిగాను. అందుకాయన 'ఇది ఎలాగైనా కాస్త పేచీ వ్యవహారం; చేతులో డబ్బుంటే తేలిగ్గా పరిష్కారమైపోతుంది; డబ్బులేకపోతేమాత్రం కష్టమే !'—అన్నాడు.

చంద్రయ్య : (నవ్వి) అవును-డబ్బుంటే జరగని పనేముంది ?

తులశమ్మ : ఆ తరువాత నాన్నా, నేను ఉన్నదున్నట్టు అన్నివిషయాలు మునసబు బ్రహ్మయ్యగారితో చెప్పేశాను. ఆయన అన్నదేమిటంటే మొదట

నీ పేరు గ్రామ పట్టాలచిట్టాలో నమోదుచేస్తాడట! దీనికి కొంత ఖర్చవు తుందట. పంచాయతీదారుల్ని సంతోషపెట్టకపోతే పని జరగదుట. ఎందు కంటే పట్టామీద వాళ్ళ సంతకాలుకూడా కావాలి! అంతా చట్టప్రకారం జర గాలట! చట్టవిరుద్ధంగా ఏమీ జరగదట! (మూటవిప్పి, ఒక కాగితం తీసి ఇస్తుంది) మునసబు బ్రహ్మయ్యగారు రాసి ఇచ్చారు. చదువు ఏంరాశాడో! (చంద్రయ్య చదువుతాడు)

చంద్రయ్య: దీనికేం, ఇది పక్కా దస్తావేజు! పంచాయితీ పెద్దల సంతకాలుపడితే సరిపోతుంది. దీనికి పెద్ద బుర్ర ఉపయోగించాల్సిన పనేముంది?

తులశమ్మ: మున్సబుగారు మరోకీలకం చెప్పాడు. ఉన్నడబ్బు భార్య చేయిదాటిపోకుండా చూడాలన్నాడు! అందుకు ప్రారంభంలోనే జాగ్రత పడకపోతే తరువాత చేయగలిగేదేమీ ఉండదట. అసలు న్యాయచట్టంఅంతా స్వాధీనం చేసుకోవటంలోనే ఉందట. అందుకనేరా నాన్నా, నిన్ను కాస్త మెళకువగా ఉండమనేది. వ్యవహారం ఇప్పుడు మాంచి పట్టులో ఉంది.

చంద్రయ్య: నేనెందుకు మెళకువగా ఉండటం? ఆమె సొమ్ము!.... ఆమే మెళకువగా ఉండాలి.

తులశమ్మ: ఎంత తెలివితక్కువ వాడవురా నాయనా! కోర్టుచుట్టూ తిరగటం—ఆవ్యవహారం ఆడదానిచేతవుతుందా, చెప్పు? డబ్బంతా దాని చేతి లోనే ఉంచితే, అది జాగ్రత్తపెట్టగలదా అసలు? ఆడది ఏంచేయగలుగు తుంది? నువు మగాడివి, సొమ్ము దాచగలవు, అన్నిపనులు నిర్వహించగలవు. ఏవ్యవహారంవచ్చినా నిలబడగలవు!

చంద్రయ్య: ఓరిబాబోయ్! ఆడవాళ్ళదగ్గర తెలివితేటలున్నాయా— వలలున్నాయా!

తులశమ్మ : ఇందులో వలేముందిరా పిచ్చిమొఖమా ? డబ్బు చేతి కిస్తే ఆడది నీ చేతికిరాదు. అందుచేత కళ్ళెం నీ చేతుల్లో ఉంచుకుంటే గుఱ్ఱం ఎక్కడికీ పారిపోదు—తెలిసిందా ?

చంద్రయ్య : చాల్లే ఫో ! పాడుగోల ! నే పోతున్నాను !

బంగారమ్మ : (పాలిపోయినముఖంతో ఇంటి వెనకవైపు నుంచి వస్తుంది) అంతా దొరికింది ! శరీరంమీదనే ఉంది ! ఇదుగో తెచ్చాను. (పమిటి చెంగులోపల్నించి 'ఇదే'—అన్నట్టుగా చూపిస్తుంది)

తులశమ్మ : చప్పున చంద్రయ్య చేతికిచ్చెయ్ ! వాడెక్కడేనా భద్రం చేస్తాడు. చంద్రయ్యా !....తీసుకెళ్లు బాబూ ! ఎక్కడేనా జాగ్రతపరుచు !

చంద్రయ్య : సరే, ఇలాతే !

బంగారమ్మ : అబ్బో ! నాతల ! ఏఁ-ఊఁ-ఊఁ నేనే దాచిపెడతాన్లే !

(వాకిలివైపు వెళ్తుంది)

తులశమ్మ : (చెయ్యిపుచ్చుకుని) ఎక్కడికే నువ్వెళ్ళేది ? వచ్చి నన్నడుగులారు వాళ్ళూవీళ్లు ! పైగా దేవకి వస్తూనే ఉండాలి ! చప్పున చంద్రయ్య చేతికివ్వు ! వాడు జాగ్రత్తగా దాచిపెడతాడులే ! నీ చెవులకు వినపడటం లేదాయేమే మొద్దుగాడిదా !

బంగారమ్మ : (అనిశ్చయభావంతో నిలబడుతుంది) అబ్బో ! నాతల!.... నాతల !....పోతోంది ...పోతోంది !....

చంద్రయ్య : ఇలాతే ! నేను దాచిపెడతాను !

బంగారమ్మ : ఎందుకు ?—ఎక్కడికి ?

చంద్రయ్య : (నవ్వి) ఏం, భయంగా ఉందేమిటి ?

బంగారమ్మ : (మేనక వస్తూండటంచూసి) అదిగో, మేనకవస్తోంది!

అబ్బో! నాతల....(గాభరాగా డబ్బుమూట చంద్రయ్య కిచ్చేస్తుంది) చంద్రయ్యా! జాగ్రత్తగాచూడాలి!—

చంద్రయ్య : ఎందుకు భయపడతావు ?....మళ్ళీ నాకుకూడ కన్పించకుండా దాచిపారేస్తాను (వెళ్తాడు)

బంగారమ్మ : (భయపడుతూ) అత్తా.... ఈవిషయం ఎక్కడేనా....

తులశమ్మ : సరే సరే! ఆయన—ప్రాణం పోయినట్టేనా ?

బంగారమ్మ : పోయినట్టేఉంది! నేను శరీరంమీదినుంచి డబ్బు తీసుకుంటూంటే కదల్లేదు-మెదల్లేదు!

తులశమ్మ : సరే, లోపలికి పో, మేనక వస్తోంది.

బంగారమ్మ : హుం, పాపం మూటకట్టుకున్నది నేను, ధనం మూటకట్టుకున్నది మరొకరు!

తులశమ్మ : చాలు, చాల్లే పో!....అదుగో దేవకి వస్తోంది!

బంగారమ్మ : చంద్రయ్యను నమ్మిఇచ్చాను, చివరకు ఏం చేస్తాడో మరి! (వెళ్తుంది)

(దేవకి, మేనక చెరొకవైపునుంచి వస్తారు)

దేవకి : (మేనకతో)ఇంకాముందు వచ్చేదాన్నే, కాని మా అమ్మాయి గారింటి కెళ్ళాను! ఎలావుంది నాన్నకు ? ఏమంత ఎక్కువగా ఉన్నదా ఏమిటి ?

మేనక : (బట్టలు కింద ఉంచి) ఏమో, నాకు తెలీదు అత్తయ్యా, నేను బట్టలు తీసుకుని చెరువుకువెళ్ళి ఇప్పుడే వచ్చాను.

దేవకి : (తులశమ్మ వైపుచూపిస్తూ) ఆవిడెవరు ?

తులశమ్మ : మాది భద్రపురం అమ్మా! చంద్రయ్య మా అబ్బాయే!....

పాపం మీ అన్నగారు బొత్తిగా క్షీణించిపోయాడమ్మా. 'ఇక నేను బతకను, మా దేవకిని పిలిపించండి' అని ప్రొద్దున్నే చెప్పారు. లోపలికి వెళ్ళిచూసుకో అమ్మా. కాని చూపుఅందుతుందో లేదో నమ్మకం లేదు!

బంగారమ్మ : (ఒక్క అరుపు అరిచి ఏడుస్తూ బయటికొస్తుంది- వచ్చి స్తంభానికికరచుకొని బిగ్గరగా ఏడుస్తుంది)....ఓ దేవుడోయ్!....నే నెట్టా బతికేది దేవుడో!.... నా నోట్లో మట్టిగొట్టిపోయావు దేవుడో!....నేను ఎక్కడికి పోగలను దేవుడో!....నువ్వు ఏ స్వర్గానికి పోయావు దేవుడో!....నన్నుకూడా తీసుకుపో దేవుడో....ఓదేవుడా!....నాదేవుడా!....

[పొరుగింటావిడ వస్తుంది. తులశమ్మ, ఆవిడా కలిసి బంగారమ్మను ఓదారుస్తుంటారు. మేనక, దేవకి లోనికివెళ్తారు. జనంపోగవుతారు]

జనంలోనుంచి ఒక గొంతు : శవాన్ని కిందబెట్టమని వాళ్ళతోచెప్పండి.

తులశమ్మ : (కొంగు బొడ్లో దోపుకుని) వెళ్ళి నేనుకూడా కాస్త సాయపడతాను.

(తెర పడుతుంది)

## షష్ఠో అంకం

(ఒకటో అంకంలోని దృశ్యమే ! చలికాలం. వెనుకటి ఘటన సంభ వించి తొమ్మిదిమాసాలు గడిచిపోయాయి. బంగారమ్మ సాధారణమైన వస్త్రాలుధరించి రాట్నంవడుకుతోంది. సునంది చలిమంటదగ్గరకూర్చున్నది)

కొండయ్య : (వచ్చి, తలగుడ్డ, బనీనుతీసి చిలకొయ్యకు తగిలి స్తాడు) అమ్మయ్యా !.... ఇంకా యజమాని ఇంటికి రాలేదా ?

బంగారమ్మ : ఏమిటి ?

కొండయ్య : అయ్యగారు పట్నంనుంచి ఇంకా రాలేదా అంటా ?

బంగారమ్మ : రాలేదు.

కొండయ్య : అరి భగవంతుడా.... జల్సాచేస్తూ ఉంటారు....

బంగారమ్మ : పనిపూర్తయిందా ? కొష్టం బాగుచేశావా ?

కొండయ్య : ఓ.... అద్దంలాగా బాగుచేసివచ్చాను. చిట్టంతా ఒక దరికి జేర్చి పోగుపెట్టాను. పనంటే నేను వొళ్లుదాచుకునేవాణ్ణికాదు. అరి భగవం తుడా.... (చేతులమీద అంటుకున్న చిట్టు దులుపుకుంటూ) దొరగారు ఈసరికి రావాల్నే !.... చాలా వేళయింది....

బంగారమ్మ : ఆయనకు తొందరేమిటిలే ! జేబులో డబ్బు ఖర్చు కావాలిగా ! కులాసాగా తిరుగుతుంటారు!

కొండయ్య : అవునమ్మా ! డబ్బు జేబులో గలగల్లాడుతూంటే.... దర్జాగా ఖర్చుపెట్టడం మామూలే ! మేనకమ్మకూడా పట్నం వెళ్లిందంటగా, ఎందుకు ?

బంగారమ్మ : దాన్నేఅడుగు! పాడుముండ !

కొండయ్య : పట్నంగదూ ! చేతిలో చిలకలాడుతూంటే పట్నంలో ఏ ఆటైనా ఆడవచ్చు !

సునంది : అవునే అమ్మా : నేవిన్నాను....నీకొాక మంచివోణీ కొని పెడతాను రమ్మన్నాడే. అట్టా అనగానే కొత్తగుడ్డలు కట్టుకుని తయారయింది. మొఖమల్లు రవిక తొడుక్కుంది. నిజంగానే అమ్మా !

బంగారమ్మ : దానికేమన్నాసిగ్గా, శరమా? అన్నీవిడిచేసిన ముండ!

కొండయ్య : ఏముందిలేమ్మా! అంతా డబ్బు మహిమ! ఆతరువాత.... హే భగవాన్....ఈపాటికి వొస్తుంటారేమోలే. (బంగారమ్మ మాట్లాడదు) ఈలోగా నేనూ కొంచెం చలికాచుకుంటాను. (కుంపటిదగ్గర కూర్చుంటాడు) హే భగవాన్....హే ప్రభో....

పొరుగింటావిడ : (వచ్చి) మీ ఆయనింకా రాలేదా ?

బంగారమ్మ : రాలేదు.

పొరుగింటావిడ : చాలా ఆలస్యమైంది. ఎప్పుడో వెళ్లాడుగదా ! మధ్యలో సారాయిదుకాణందగ్గర ఉండిపోలేదుగదా ! మాచెల్లెలు చెప్పింది—పట్నంనుంచి వస్తూ చాలా బళ్ళు అక్కడ ఆగాయని !

బంగారమ్మ : సునందీ, ఓసునందీ !

సునంది : ఏమిటమ్మా !

బంగారమ్మ : వెళ్లు, పరుగెత్తుకెళ్లి సారాయితాగుతూ అక్కడే ఉన్నాడేమో చూసిరా !

సునంది : ఆలాగే (లేచి, వెళ్ళటానికి బట్టలువేసుకుంటూవుంటుంది)

పొరుగింటావిడ : మేనకకూడా వెంటవెళ్ళిందేమిటి ?

బంగారమ్మ : లేకపోతే ఒక్కడే వెళ్తాడా ? అది వెంటఉండటం వల్లనే పట్నంలో ఆయనకు అన్నిపనులు! అంతా అది ఆడిస్తున్న ఆటే.

పొరుగింటావిడ : (తయారుతూ) ఏం పాడుబుద్ధు లమ్మా !

(కొంచెంసేపు నిశ్శబ్దం)

సునంది : అక్కడ ఉంటే ఏం చెప్పమంటావే ?

బంగారమ్మ : ఏమీ చెప్పొద్దు. ఉన్నారో లేదో చూసిరాఅంతే ! త్వరగా రా.

సునంది : ఇక్కడున్నట్టు వచ్చేస్తాను. (వెళుతుంది)

(మళ్ళీ కొంతసేపు నిశ్శబ్దం)

కొండయ్య : (బిగ్గరగా) హే భగవాన్.... హే దయానిధీ !....

పొరుగింటావిడ : (ఉలికిపడి) అయ్యో....నేను దడుచుకున్నానే ఈ అరుపుకు ! ఈయనెవరు ?

బంగారమ్మ : కొండయ్య ! మా కొండయ్యే !

పొరుగింటావిడ : బలేగా భయపెట్టేశాడులే ! అడగటం మరచే పొయ్యాను బంగారమ్మా ! మేనక పెళ్ళిచెయ్యాలని చూస్తున్నారటగా ! ఎక్కడేనా సంబంధం కుదిరిందా ?

బంగారమ్మ : (రాట్నం వడకటం వదిలేసి వేరే పీటమీద కూర్చుంటూ) భద్రపురంలోనే ఒకరితో మాటలు జరిగాయి. కాని అక్కడికి కూడా ఈ వర్తమానం పాకిపోయింది. సంబంధం కాస్తా చెడిపోయింది, అంతే ! అయినా నువ్వే చెప్పు—ఎలా జరుగుతుంది?....

పొరుగింటావిడ : దొండపాడువాళ్లు ఎవరో వచ్చారు గాబోల్నే ఈమధ్య—

బంగారమ్మ : వచ్చారు, రావటానికి; కాని వాళ్ళూ తిరిగి వెళ్ళి పొయ్యారు ! ఇప్పుడు మన వూరు పేరుచెబితేనే చిర్రుబుర్రుమంటున్నారట వాళ్లు !

పొరుగింటావిడ : పిల్ల కూడా బాగా ముదిరిపో[illegible] కాపరం చేస్తూండవలసిన ఈడు !

బంగారమ్మ : ఈ బాధ ఎప్పుడు పోతుందా అని[illegible]నూ వెయ్యి దేముళ్ళకి మొక్కుతున్నాను. కాని ఎక్కడా ముడిపడకుండా ఉంది. నాకేమీ తోచదు. అసలు ఇద్దరిలో ఎవరికన్నా ఇష్టం ఉంటేగా....నిజం చెపుతున్నాను నమ్ము : మేనకమీద ఆయనకింకా మోజుతీరలేదు.

పొరుగింటావిడ : ఏమోనమ్మా ! ఈ విడ్డూరం ఎక్కడా చూడలేదు ! ఎంత గాదన్నా....వరసకు తండ్రి అవుతాడుగదా !—

బంగారమ్మ : ఏం చెప్పను అక్కాయ్ ! నా మాటంటే ఇప్పుడొక గడ్డిపరకలాగా ఉంది. నన్నొక కుక్కకావలిగా చేసి కూర్చోబెట్టారు ; చెప్పుకుని ఏం లాభంలే ! నా బుద్ధి గడ్డితిన్నది ! ఇతగాణ్ణి కట్టుకున్నాను ! నేను కనిపెట్టలేకపోయాను గానీ. వీళ్ళిద్దరి సంబంధం చాలకాలంనుంచే సాగుతోంది.

పొరుగింటావిడ : నిజం ?

బంగారమ్మ : నిజంగాక !? ఆ సంబంధం బాగా పెరిగిపోయింది. ఇద్దరూ నన్ను చాటేసి తిరుగుతున్నారు. నా రాత ! .ఇప్పుడేమి చెప్పుకుంటే మటుకు ఏం లాభం ? నా బతుకు బండలైపోయింది. నాకు మాత్రం అత నంటే ప్రేమాభిమానాలు లేకపోలేదు !

పొరుగింటావిడ : అవును, లేకేం !

బంగారమ్మ : ఇలాంటి వ్యవహారం జరుగుతూంటే ఎలా సహించి కూర్చోగలను ?....నా బాధ నాకే తెలుసు !

పొరుగింటావిడ : అవును ! ...నిజమెంతో అబద్ధమెంతో నాకు తెలీదనుకో—అప్పుడప్పుడు ఆయన నీ మీద చెయిజేసుకుంటున్నాడటగా !

బంగారమ్మ : ఏ నోటితో చెప్పమంటావక్కాయ్ ! మొదట్లో తాగొచ్చినా నాతో తియ్యగానే మాట్లాడేవాడు ! కొట్టడం మొదటినుంచీ ఉందనుకో ? అప్పుడు నేనంటే చాలా ఇష్టంగాకూడా ఉండేవాడు ! కాని ఇప్పుడు....మాటిమాటికీ కోప్పడుతుంటాడు. చేతికి ఏది అందితే దాంతో గొడ్డును బాదినట్టు బాదుతాడు ! మొన్న మటుకు మొన్న—నా జుట్టు పట్టుకుని ఎంతసేపటికీ వదలకపోయాడు. ప్రాణం పోయిందనుకో ! ఇక ఆ పిల్ల ఉందంటే....వట్టికూబి ! తాచుపాము అనుకో !

పొరుగింటావిడ : చాలా కష్టాల్లో ఉన్నావు నువ్వు ! ఇలాంటి కష్టాలు సహించటం మాటలా ?....ఎంత విడ్డూరమమ్మా—పొట్ట చేతబట్టుకొని వచ్చినవాడికి ఆశ్రయమిస్తే అతగాడు చివరకు నిన్నే ఇప్పుడు ముప్పుతిప్పలు పెడుతున్నాడు. నువు అతగాణ్ణి కాస్త అదుపులో ఉంచాల్సింది.

బంగారమ్మ : అమ్మో ! అదేమీ లాభంలేదు అక్కాయ్ ! అదంతా ఆ పెద్దాయనదగ్గర. ఆయనా కావటానికి కొంచెం కఠినుడేగాని—నేను ఎటు తిరగమంటే అటు తిరిగేవాడు ! కాని ఇతనిదగ్గరా ?....మనిషిని చూస్తేనే నా రోషమంతా మాయమైపోతుంది. మాట్లాడే ధైర్యంకూడా లేకుండా పోతుంది నాలో! అంతెందుకు?.... పిల్లికూనలా అయిపోతాననుకో !

పొరుగింటావిడ : మంత్రించినట్టు మారిపోయావు బంగారమ్మా ! ఆ తులశమ్మకు మంత్రతంత్రాలు తెలుసునని చెప్పుకుంటారు! ఎంతమటుకు నిజమో మరి ! ఆ మహాతల్లే ఏదో చేసి ఉంటుంది.

బంగారమ్మ : అవునక్కాయ్ ! నాకూడా అప్పుడప్పుడు అలాగే అనిపిస్తుంటుంది. మనస్సంతా కళవళపడుతుంది.దాన్ని ముక్కలుముక్కలుగా కోసిపారేయాలన్నంత కోపం వస్తుంది. కాని ఎదురుగా కనిపించేసరికి నా మనసు నన్ను వదలిపారిపోతుంది.

పొరుగింటావిడ : నీమీద నిజంగానే ఎవరో చేతబడిచేశారు ! చూడ రామా, చిక్కి సగమైపోయావు !

బంగారమ్మ : ఏం చెప్పుకోను....నా బతుకూ నేనూ....దాన్ని చూశావుగా — మేనక — అంసం చంసం లేనిమనిషి! అయితే ఏం....కన్నూ మిన్నూ కానరావటంలేదు దాని కిప్పుడు ! ఇంత ధైర్యం దానికెలా వచ్చిందో తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇప్పుడు చూశావుగా : వెనకటికంటె ఎర్ర బడింది. యుబ్బురాయల్లేఉబ్బుతాపుంది.పట్టిదచ్చమ్మలాకనిపించేదా ?....ఇప్పుడు ఈ యిల్లు, ఆస్తి....అంతా తనదేనంటుంది ! మా నాన్న నన్ను చంద్రయ్య కిచ్చే పెళ్ళిచేయటానికి నిశ్చయించాడంటుంది. ఇలా చెప్పటానికి దానిది నోరో, తాటిపట్టో మరి ! దానికి కోపం వచ్చినప్పుడు చూడాలి....సాక్షాత్తు చండికాదేవి అనుకో !

పొరుగింటావిడ : ఏమోనమ్మా ! నీ జీవితంచూస్తే మటుకు మనస్సు కరిగిపోతుంది. కాని ఇంకా నిన్ను ఆడిపోసుకునేవాళ్లు, ఈర్ష్యపడేవాళ్లు లేక పోలేదు. నీకేదో ఆస్తి ఉందట ! ఆస్తి ఉన్నంతమాత్రానే కష్టాలు గట్టెక్కుతాయా ?

బంగారమ్మ : ఆస్తిఅనేది శాశ్వతమా ? ఇవేళ ఉంటుంది, రేపటికి ఖాళీ అవుతుంది ! ఓడలు బళ్ళవుతాయి ! చూస్తున్నావుగా—డబ్బు నీళ్ళకుమల్లే ఎట్లా ఖర్చుచేస్తున్నాడో ఇతగాడు !

పొరుగింటావిడ : అయినా ఆ డబ్బు అతగాడి చేతికెలా వెళ్ళింది ? అంతా నీదేగదా ? అంత అమాయకురాల వెలా అయ్యావంట ?

బంగారమ్మ : నీకు అసలు రహస్యం తెలీదు ! నేను చాలా తప్పు చేశాను; చాలా పెద్ద పొరబాటు చేశాను !

పొరుగింటావిడ : నేనేగనక నీ స్థానంలో ఉంటే న్యాయస్థానానికి

వెళ్ళి ఉండేదాన్ని! దావావేసేదాన్ని! నీడబ్బు తీసుకోవటానికి ఆయనెవడు? అతనికేం అధికారం ఉందంట?

బంగారమ్మ: ఈరోజుల్లో నోరుగలవాడిదే అధికారం!

పొరుగింటావిడ: ఏమోనమ్మా! నువుమాత్రం వట్టి పుణ్యానికే నీరు కారిపోయావు! ఇంత పిరికిదాన్ని నేనెక్కడా చూడలేదు! నీ మనసులో కూడా నిబ్బరం లేకనేపాయె!

బంగారమ్మ: నిజం అక్కాయ్! నా తనువూ మనసూకూడా కృషించిపోయాయి. అలానన్ను అతగాడు ఉచ్చులో బిగించేశాడు. ఇప్పుడు ఏంచేయటానికీ నాలో చీమెత్తు శక్తిలేదు. అలా చిక్కిపోయాను, అతనికి. ఏంచేయాలో తోచదు! తలుచుకుంటే నాతల తిరిగిపోతుంది....

పొరుగింటావిడ: ఎవరో వస్తున్నట్టున్నారు! (తలుపుతెరచుకుని రామయ్య ప్రవేశిస్తాడు)

రామయ్య: (ఎదురుగా కన్పించిన కృష్ణుడిపటానికి నమస్కరించి లోపలికొస్తాడు) అంతా బాగున్నారా? ఏమిటమ్మా సంగతులు?

బంగారమ్మ: రా, మామయ్యా! (బంగారమ్మ చెంబుతో నీళ్ల తెచ్చి యిస్తుంది. రామయ్య పక్కకుపోయి కాళ్ల కడుక్కొనివచ్చి బల్ల మీద కూర్చుంటాడు.)

బంగారమ్మ: ఎప్పుడు రావటం మామయ్యా! ఇంటినుంచేనా?

రామయ్య: అవునమ్మా. చూడు....ఎప్పటినుంచో అనుకుంటున్నా: వచ్చి కొడుకునూ, కోడల్నీ చూసివెళ్దామని! పెందరాళే భోజనం చేసుకుని బయలుదేరాను. చూడు....దారి ఏమీ బాగాలేదమ్మా. మెల్లిగా నడుచు కుంటూ వచ్చేప్పటికి ఇంతసేపయింది....ఇదుగో చూడు....పిల్లలూ నువ్వూ తినండి (ఒకపొట్లంబంగారమ్మకిస్తాడు) చంద్రయ్య కనపడ్డేం? ఇంట్లోలేడా?

బంగారమ్మ : పట్నం వెళ్ళారు.

రామయ్య : వాడితో కొంచెం పనుందమ్మా !.... ఇదుగో చూడు.... ఆ రోజు చెప్పానే నీతో....గుర్రం సంగతి.... చూడు.... ఉన్నగుర్రం బొత్తిగా ముసలిదయిపోయింది....దాన్ని మార్చి మరో గుర్రాన్ని కొనాలి.... అందుకే.... బయలుదేరివచ్చాను.

బంగారమ్మ : నాతో ఆయనకూడా చెప్పారు ! పట్నంనుంచి రావటం తోటే మాట్లాడుదుగాని. (లోపలికెళ్తూ) నువు భోజనానికి లే మామయ్యా. ఆయన ఇంకా ఎప్పటికి వస్తారో.... కొండయ్యా.... ఓ కొండయ్యా.... నువుకూడా భోంచేద్దుగాని లే !

కొండయ్య : (నిద్రమేల్కొంటూ) హే భగవంతుడా ! హే పర మాత్మా !

బంగారమ్మ : ఏమిటి, విన్పించిందా ? అన్నానికి పిలుస్తున్నా !

పొరుగింటావిడ : ఇకనే వెళ్ళొస్తానమ్మా. (వెళుతుంది)

కొండయ్య : (లేచివస్తాడు) కూర్చునేప్పటికే కునుకుపట్టేసిందే ! (నిద్రమత్తు విరుచుకుంటూ) హే భగవాన్ ! హే పరమాత్మా ! ఎవరూ ?.... రామయ్య బాబాయా !.... అంతా బాగున్నారా బాబాయ్ ?

రామయ్య : ఎవరూ ? కొండయ్యా ! ....నువ్విక్కడున్నావేం ?

కొండయ్య : నేను మీ చంద్రయ్యదగ్గర నౌకరీ చేస్తున్నానుగా !

రామయ్య : ఏమిటి ?.... నౌకరువా ?.... చూడు.... మా అబ్బాయి దగ్గర నౌకరువా ! నిజంగానా ?

కొండయ్య : నిజమే బాబాయ్ ! ఇదివరలో పట్నంలో ఒక షావు కారుదగ్గర ఉండేవాణ్ణి ! నాలుగుడబ్బులు గడించాను కూడా. కాని అంతా

అయిపోయిందిలే. అందుకని మళ్లా నా పాతపనిలోనే ప్రవేశించాను. నాకు ఇల్లూ వాకిలంటూ యేమీలేదు. అడిగేవాళ్లూ అనేవాళ్ళూ లేరు. అందుకని మళ్ళీ వచ్చి ఇక్కడ పనిలో చేరాను. హే భగవంతుడా ! హే దయానిధీ !

రామయ్య : అయితే .... చూడు .... నాకు తెలీక అడుగుతాను .... మా చంద్రయ్య ఏం పనిచేస్తున్నాడు ? .... చూడు .... ఇద్దరు మనుషులు చేసే పనుందా ---- ఇక్కడ ?

బంగారమ్మ : ఇక్కడ పనిలేకపోతే మాత్రం యేం ? .... ఆయనకు ఇతర వ్యవహారాలు ఎక్కువయ్యాయిగా ! అందుకని ఈయన్ను పెట్టారు.

కొండయ్య : నాలుగుడబ్బు లున్నవాళ్లు నౌకరును పెట్టుకోవటం మంచిదేలే అమ్మా !

రామయ్య : కాదు .... ఇదుగో చూడు .... ఇదంతా పాడైపోవటమే .... చూడు....తనను తాను పాడుచేసుకోవటమే....

బంగారమ్మ : ఇంకా పాడుచేసుకోటానికేముంది మామయ్యా ! అదెప్పుడో జరిగిపోయింది ! ఇప్పుడు అన్నిటికి తెగించి కూర్చున్నారు.

రామయ్య : ఇదుగో చూడు....వెనకటికి సామెతుందిలే....మంచికి పోతే చెడువస్తుందని. చూడు....డబ్బులోనే ఉంది ఈ ప్రమాదం ! డబ్బు పాపిష్టిది....ఇదిగో చూడు....అన్నిటికీ మూలం అదే !

కొండయ్య : మంచిమాట చెప్పావు బాబాయ్! వొళ్లు బలిస్తే కుక్కకు కూడా కళ్లు కనపడవు. ఇక మనిషి విషయం చెప్పేదేముంది? డబ్బు చేతిలో ఉంటే మనిషికి బుద్ధిరావటం కల్ల. నన్నుచూడరాదూ ! డబ్బు ఉన్నన్నాళ్లూ నా ఇష్టంవచ్చినట్టు తిరిగాను. ఉదయంలేచిన లగాయతూ అర్ధరాత్రిదాకా పోరాయి - బుద్ధిమీదబుద్ధి పట్టించాను ! అంతా హరించుకపోయింది. వికారి

నయ్యాను. అప్పుడు ప్రమాణంచేశాను సారాయి ముట్టుకోనని. ఈ వ్యసనం నాశనంగాను....మహాచెడ్డ వ్యసనం బాబాయ్ ఇది!

రామయ్య: అయితే కొండయ్యా....చూడు....ముసలిదాన్నేంచేశావు?

కొండయ్య : మంచిప్రశ్న అడిగావు బాబాయ్! అది ఎక్కడఉండాలో అక్కడే ఉంది. పట్నంలో సారాయిదుకాణాలచుట్టూ తిరుగుతూఉంటుంది. ఒక కన్నులొట్ట. పగలుచూస్తే రాత్రి కలలోకొస్తుంది. నోరువిప్పితే సీమ టపాకాయల గుత్తిలాగ పేలుతుంది_అయితే ఏం_మహానీటుగా ఉంటుం దిలే! ఎప్పుడన్నా చూడు—మత్తులోనే ఉంటుంది. సేవిస్తుందిలే!

రామయ్య : సేవించటమా ?

కొండయ్య : ఏమిటిమరి ? సిపాయిపెళ్లాం! దానికి తగినచోటునే వేసింది మకాం!

రామయ్య : (బంగారమ్మతో)అయితే అమ్మాయ్..చూడు..చంద్రయ్య ఏమైనా తీసుకెళ్లాడా ఏం?....మాలు ఏమైనా వేసుకెళ్లాడా అమ్మటానికి.

బంగారమ్మ : (అన్నంవడ్డిస్తూ) లేదు, ఏమీ తీసుకెళ్ళలేదు. పోస్టాఫీసులో ఉన్న డబ్బు తీసుకోవటానికి వెళ్ళారు.

రామయ్య : (పీటమీదకూర్చుంటూ) డబ్బు!....చూడు....డబ్బుతో ఇప్పుడు ఏమైనా అవసరమైన పనిఉందా?....చూడు....వ్యాపారం ఏమన్నా చేస్తున్నాడాయేం ?

బంగారమ్మ : అలాంటి దేమీలేదు! నాకు చేతిలో దమ్మిడీ ఉండదు. అక్కడా ఇక్కడా నేను పాతికముప్పై రూపాయలదాకా అప్పులుచేసి కూర్చు న్నానుకూడాను! ఆయనమాత్రం బ్యాంకులోఉన్నడబ్బు తీసుకోటానికి వెళ్లారు.

రామయ్య : వీడికి అసలిప్పుడు డబ్బుదేనికంట?....ఇదుగో చూడు...

ఇవ్వాళకొంత తీస్తాడు, రేపు మరికొంత!.... చూడు.... అలాగే క్రమంగా డబ్బంతా హరించుక పోతుంది!

బంగారమ్మ : వడ్డీమాత్రమే తీసుకుంటున్నారట. అసలు అలాగే ఉంటుందట!

రామయ్య : అసలు అలాగే ఉంటుందా?.... చూడు.... ఎలా వుంటుంది... ఒక వేపున తీసుకుంటూఉంటే?... చూడు... ఒక ధాన్యపు రాశి ఉందనుకో; దాంట్లోనుంచి రోజూ తింటూపోతే—అది అలాగే ఉంటుందా? ఇదంతా మోసం.... చూడు... పచ్చిమోసం... డబ్బుతీస్తూపోతే అసలు ఎక్కడుంటుంది?.... అంతా మోసం!

బంగారమ్మ : నాకేమీ తెలీదు. మున్సబు బ్రహ్మయ్యగారు చెప్పిన ఉపాయమే ఇది! డబ్బు బాంకులోఉంటే... వడ్డీ వస్తుంటుందట. అసలు అలాగే ఉండిపోతుందట!

కొండయ్య : (భోజనం ముగించుకొని) నిజమేమరి! నేను ఒక మార్వాడీదగ్గర చూశాను! వాళ్ళంతా ఇలాగే చేస్తారు. డబ్బు బాంకులోపడేసి ఉంచుతారు. పిల్లల జల్సాలుచేస్తారు. బాంకులోనించే ఆదాయంవస్తుందట!

రామయ్య : ఇదుగో చూడు... నువు తలాతోకాలేని కబుర్లు చెబుతున్నావే! ఆదాయం ఎలా వస్తుందయ్యా? ఎక్కడినించి వస్తుంది?... చూడు ...నువు అక్కడేమైనా పాతేశావా?...

బంగారమ్మ : ఏం, వడ్డీవస్తుందటగా!

కొండయ్య : కాస్త నువుండమ్మా... ఆడవాళ్ళకేం తెలుసుగాని! నే చెబుతావిను బాబాయ్! విని, బాగా బుర్రకు పట్టించుకో. చూడు బాబాయ్! నువ్వున్నావు, నేనున్నాను! నీదగ్గిర డబ్బుంటుంది. నాదగ్గర భూమిఉంటుంది. వి త్తనాలకు నా దగ్గిర డబ్బులేదు. మంచి అదునైన సమయమనుకో! నేను

దగ్గిరికొచ్చి పదిరూపాయలివ్వమంటాను. పంటాలయ్యాక డబ్బిచ్చేస్తా
ంటాను; కావాలంటే నీ పొలంకూడా చేసిపెడతానంటాను! నా తాహ
ను పరికిస్తావు! ఇల్లూవాకిలీ చూస్తావు. నాపొలం చూస్తావు. వీటన్నిటిని
చి నువు—డబ్బిస్తానుగాని...నీ శ్రమ నా కక్కరలేదు, అసలుతోపాటు
డు నాలుగురూపాయలు వడ్డీ ఇవ్వు! అని నన్నడుగుతావు!— అవసరం
నక నేను సరేనంటాను! నువు డబ్బిస్తావు. ఎంతో సంతోషంతో ఆ డబ్బు
కెళ్తాను. పంటకొచ్చాక నీ పదిరూపాయలు, దానికి తోడు నాలుగు
పాయల వడ్డీకలిపి నీ కిచ్చేస్తాను.

రామయ్య : అలాగా!.... మాడు....ఇది భగవంతుణ్ణి మోసంచేయ
ం కాదూ? నీతి నియమం తప్పటం కాదూ?

కొండయ్య : ఆగవయ్యా, ఇంకా నేను చెప్పేదంతా విను: కాళ్ళు
పకుండా నీకు నాలుగురూపాయలు లాభించాయా లేదా! ఈ బంగారమ్మ
దనుకో, ఆడకూతురు. ఈమెదగ్గర డబ్బు మూలుగుతూఉంటుంది. ఆ
బ్బు ఏం చేయాలో ఏమిటో ఆమెకు అర్థంకాదు! నీ దగ్గరికొస్తుంది—'ఈ
బ్బును ఏదేనా పనికి ఉపయోగించు!' అని అంటుంది. సరే తెమ్మని ఆ
బ్బ నువు తీసుకుంటావు. మళ్ళా నారు పోయాల్సిన సమయానికి నేనే
దగ్గరికొచ్చి పదిరూపాయలు అప్పు అడుగుతాను. నా తాహతును నువ్వు
ళ్ళా పరీక్షిస్తావు. ఆ బంగారమ్మ డబ్బు నా కిచ్చి వడ్డీ వసూలుచేసుకుం
వు. నా మీద నీకు నమ్మకం లేకపోతే—డబ్బాలేదు డుబ్బా లేదు
మ్మని చెప్పేస్తావు. డబ్బు అవసరమున్న నాలాంటివాడు మరొకడు
రుకులాడేమోనని చూస్తావు, ఇటు నీ దగ్గరున్న డబ్బు, అలాగే బంగారమ్మ
బ్బ రెంటిని కలిపి వడ్డీకి తిప్పాలని చూస్తావు! బాంక్ అంటే ఇదే! ఒక
రి వరసపడిందంటే—ఆ వరస తెగదు! అలాగే వస్తుంటారు జనం
బ్బుకోసం! ఏమనుకుంటున్నావు మరి బాంకు వ్యవహారమంటే? బలే
రుండాలిలే!

రామయ్య : (ఉత్తేజితుడై) రామరామ!....ఇదిగో చూడు !.... ఇదొక వేషం—వచ్చిమోసం ! మోసంకాదు-దోపిడి !....ఇదుగో చూడు.... నిజంగా ఇది చాలా చెడ్డపని ! పల్లెటూళ్ళల్లోకూడా ఇది పాకిందనుకో !.... అయినా ఇదిచాలా నీచమైన పాపకార్యం !....చూడు....నిజంగా చదువుకున్న వాళ్ళు, పెద్దమనుషులు ఇట్టాంటి పాపిష్టిపనులు—

కొండయ్య : చదువుకున్నవాళ్లూ, పెద్దమనుషులూ చేసేపనే ఇది బాబాయ్ ! తెలివితక్కువ నాగన్నలూ, డబ్బు ఎలా దాచిపెట్టుకోవాలో తెలేని ఆడంగులూ .బాంకులకు పరుగెడతారు ! అక్కడ తెలివిగలవాళ్ళు ఆ డబ్బు తీసుకుని, మళ్ళా దాంతో రకరకాల యాపారాలు సాగిస్తారు. ఇందులో భలే చదరంగపు ఎత్తులు,...భలే ఉల్లాసీదాలు....లాభాలకు లాభాలు గడిస్తారు.... బొర్రలు పెంచుకుంటారు !....ఈ యాపారం చేసేవాళ్ళదగ్గర భలే నక్కజిత్తు లుంటాయిలే !

రామయ్య : (నిట్టూరుస్తూ) అదే కొండయ్యా, వచ్చిన చిక్కు.... చూడు.. .డబ్బులేకపోయినా పనిజరగదు. డబ్బు చేతికొచ్చిందో పంచమహా పాతకాలుచుట్టుకున్నాయనుకో....ఇదుగో చూడు.... భలే సుడిగుండంలో పడ్డారు సుమీ మనుషులందరూ....చూడు....కష్టంచేసుకు బతకమని దేవుడు నీకు చక్కపేడుల్లాంటి రెక్కలిచ్చాడే ! కాని నువు బాంకులో డబ్బు దాచి ముసుగుతన్ని పడుకుంటా సోమరిపోతల్లే? బాంకిలో డబ్బు నీకు తిండి పెడుతోంది...చూడు...కష్టం చేయకుండానే, అది దొంగతిండికొండయ్యా ! ....చూడు....నువ్వేమన్నా అను....అది వట్టి తప్పుడు తిండి....నీతిమాలిన తిండి !....చూడు....న్యాయమైంది కాదు.

కొండయ్య : న్యాయం ! భలేమాటన్నావు బాబాయ్ ! న్యాయం ఎవడి క్కావాలయ్యా ఈ రోజుల్లో ! ఈ నాటి చదువుకున్నవాళ్ళు చేసే దోపిడి ఎంత సాఫుగా ఉంటుంది ! వాళ్ళు చేసే గాయానికి మచ్చకూడా కనిపిం చదు. మెచ్చుకోతగ్గ సంగతికాదు బాబాయ్ !

రామయ్య : (నిట్టూరుస్తూ) నిజమేనోయ్ !....ఇదుగో చూడు.... పాపంబిడ్డలమ్యేరోజు ఆట్టేదూరం లేదు. పట్నంలో....చూడు....కక్కోసుల దగ్గర్నుంచీ....ఏం చూసినా....కళ్లు జిగేలుమంటాయి. ఎక్కడ చూసినా మిలమిల్లాడే పింగాణీ బొచ్చెలే ! ఎందుకివన్నీ ? దీనివల్ల ఎవరికి లాభం ?....ఇదుగో చూడు....మనుషులు దేవుణ్ణి మరచిపోతున్నారు.... ఇదుగో చూడు....దప్పుగా మరచిపోయి....మనచే సృష్టి—వద్దమ్మా వద్దు. నా భోజనం అయిపోయింది. (లేస్తాడు)

కొండయ్య : (బల్లమీద పొప్పుంటాడు)

బంగారమ్మ : (ఎంగిలిపళ్ళేలు తీసేస్తూ) ఇంకా ఏముంది మామయ్యా! తండ్రి అయిఉండి కూడా కూతురితో....నాకు చెప్పటానికి నోరు రావటం లేదు.

రామయ్య : ఆఁ ! ఏమిటే-ఈ....చూడు....ఏమన్నావ్ ?

బంగారమ్మ : ఆఁ, ఏమీలేదులే !

(సునంది వస్తుంది)

రామయ్య : ఆహాహోహో ! రా అమ్మా, రా....చూడు....పిల్లంటే ఇలా ఉండాలి ! ఎప్పుడూ ఏదో పనిచేస్తుంటుంది !....ఇదుగో చూడు.... చలిగాలేదమ్మా నీకు ?

సునంది : లేకేం....చలిగానే ఉంది....నువ్వెప్పుడొచ్చావు తాతా !

బంగారమ్మ : మీనాన్న వాళ్లు అక్కడున్నారే ?

సునంది : లేరే. మరే....నారాయణ కనిపించి చెప్పాడు : అతను గూడా వాళ్ళతోపాటు పట్నం వెళ్లాడుట_వాళ్ళిద్దరూ పట్నంలో సారాయి దుకాణం దగ్గర కనిపించారట ! నాన్నేమోనే....బాగాతాగి మత్తుగాపడి ఉన్నాడట అక్కడే !

బంగారమ్మ : సరే, నువ్వు ఇది తిను. తాతయ్య తెచ్చారు !

సునంది : (లడ్డుతింటూ కుంపటిదగ్గరికెళ్ళి) అబ్బ ! ఇది చల్లార బెట్టావేమే ! నా చేతులు కొంకర్లుపోతుంటేను ?

బంగారమ్మ : (అంట్లు తోముతూ)....రాజమ్మ కులాసాగా ఉందా మామయ్యా !

రామయ్య : దానికేం; నిక్షేపంలా ఉంది ! ఇదుగో....చూడు....పిల్ల చాలా తెలివిగలది !....మంచి పనిమంతురాలు....బుద్ధిమంతురాలు ! తన పనేదో తానేమో....ఇతరులవేపు కన్నెత్తయినా చూడదు....చూడు....చాల వినయంగా ఉంటుంది, దానిపని బాగానే ఉందిలే !

బంగారమ్మ : ఆమధ్య రాజమ్మ భర్త బంధువుల్లో ఎవరితోనో మేనక పెళ్ళిమాటలు జరిగాయిలే ! మీ ఊరేగా ! మీరు వినలేదా ఏం ?

రామయ్య : ఆఁ ఆఁ; గోవిందును గురించి ఆడవాళ్లు ఏదో చెప్పు కుంటూంటే ఒకటి రెండు మాటలు నా చెవినపడ్డాయి; కాని నేను పట్టించు కోలేదు....చూడు....నా కలాంటి కబుర్లమీద శ్రద్ధవుండదు. పైగా నాకు కొంచెం స్మరణశక్తికూడా తగ్గిపోయింది !....చూడు...ఆ గోవిందయ్య మాత్రం మనిషి మంచివాడే. పదెకరాల పొలం, ఇల్లు, లోపంలేని సంసారమే !

బంగారమ్మ : ఎలాగయినా ఈ మేనక పెళ్ళిచేయాలని నాకు ఆదుర్దాగా ఉంది !

రామయ్య : నీకెందుకు అంత ఆదుర్దా ?

సునంది : అమ్మా, వచ్చారే !

బంగారమ్మ : ఒసేయ్, వాళ్ళనేమీ అనమాకుసుమీ ! (పాత్రలుతోము తుంటుంది)

(చంద్రయ్య వస్తాడు)

బంగారమ్మ : ఎవరు ? (చంద్రయ్యవంక చూసి తిరిగి తలవంచుకుంటుంది.)

చంద్రయ్య : (కఠినంగా) ఎవరా ? ఏఁ, మరచిపోయావా ?

బంగారమ్మ : నోటికొచ్చినట్టల్లా మాట్టాడక లోపలికిపద.

చంద్రయ్య : (ఇంకొంచెం కఠినంగా) ఏయ్ ! ఎవరు దయచేశారో చెప్పుకో !

బంగారమ్మ : (చేయిపుచ్చుకుని)సరే.... మా దొరగారు వచ్చారు.... ఇక రా లోపలికిరా !

చంద్రయ్య : (చేయి వెనక్కులాక్కుని) మీ దొరగారు వచ్చారని చెప్పావు, బాగుంది ! ఆ దొరగారి పేరేమిటో చెప్పు ?

బంగారమ్మ : చంద్ర.... ఇక నడు !

చంద్రయ్య : ఏయ్ ! రూలంటే రూలే ! కట్టు అంటే కట్టే ! పూర్తి పేరు చెప్పాలిసిందే !

బంగారమ్మ : పూ-ర్ణ-చం-ద-్రా-వు-నా-యు-డు-గా-రు....సరిపోయిందా ! ఇక నడు !

చంద్రయ్య : (వాకిలిపట్టుకొని కదలడు) శహభాష్ ! ఆతరువాతనో !

బంగారమ్మ : (నవ్వుతూ. ఎడమచేత్తో చంద్రయ్య చేయిపట్టుకొని కుడిచేత్తో అభినయిస్తూ) శ్రీవారికి సుస్వాగతము !

చంద్రయ్య : అద్దిగది ! అలా ఉండాలి పెళ్లామంటే !....సరే.... పూర్ణచంద్రరావునాయుడుగారు లోపల ఏపాదం ముందుపెట్టాలి ? చెప్పు-కుడికాలా, ఎడంకాలా ?

బంగారమ్మ : చాలు, చాల్లే ! ఇక్కడ చలేస్తోంది, లోపలికి పద !

చంద్రయ్య : ఏయ్, చెప్పు, ఏ కాలు పెట్టాలిముందు ?

బంగారమ్మ : (స్వగతం) చెప్పకపోతే చంపుకతింటాడు—(చంద్రయ్యతో) ఎడమకాలు పెట్టాలి !

చంద్రయ్య : అదీ లెఖ్ఖ ! అలా ఉండాలి పెళ్ళామంటే !

బంగారమ్మ : చూశావా....ఎవరో వచ్చారు ?

చంద్రయ్య : ఓహో ఫాదర్ ! ఫాదర్ ! మానాన్నదగ్గర నాకు సిగ్గనుకున్నావా ! ఆయనంటే నాకు గౌరవం ! వాట్ ఫాదర్ ! అందరూ సుఖులే ? (వంగి) నమస్కారం !

రామయ్య : (సమాధానం చెప్పడు)....ఛీ ఛీ....సారాయి కంపు.... వెధవసారాయి !....దౌర్భాగ్యుడా !

చంద్రయ్య : ఆ వెధవసారాయి నేను తాగినమాట వాస్తవమే నాన్నా! ఏదో స్నేహితుడు బలవంతంచేస్తే తోడుగా తాగాను ! స్నేహితుడిమాట గౌరవించవద్దూ మరి ? ఒకేఒక గ్లాసు తాగాను. అంతే ! దీంట్లో తప్పేముంది ?

బంగారమ్మ : వచ్చి, కొంచెంసేపు పడుకో !

చంద్రయ్య : ఓహో ప్రియురాలా ! నాజవరాలా ! ఇప్పుడు నేనెందుంటిని ? ఏమిచేస్తుంటిని ?

బంగారమ్మ : నిల్చున్నావులే! వచ్చి పడుకో !

చంద్రయ్య : పడుకోవటమా ! అబ్బే ! ఒక పద్ధతి, ఒక నియమం ఉండక్కర్లేదూ ? ఇప్పుడు నేనూ, ఫాదర్ కలిసి కాఫీ సేవిస్తాం ! తొందరగా తీసుకరా ! ...ఇదుగో మేనకా ! ఇలారా ! (వస్తుంది. మంచిబట్ట లున్నాయి వంటిమీద-చేతిల్లో పట్నంలోకొన్న సామానులున్నాయి.)

మేనక : సామానంతా ఇలా చిందరవందరచేశావే....ఉన్నిదారాలు తెచ్చానే, అవి ఏవి ?

చంద్రయ్య : ఉన్నిదారాలా ! ఎక్కడో ఉంటాయి చూడు !.... ఈ కొండయ్య కన్పించడేం ?... నిద్రపోయాడా ? అప్పుడేనా ? కొండయ్యా, ఓ కొండయ్యా ! వెళ్ళి గుర్రాన్ని విప్పి నీళ్ల మేత చూడు.

రామయ్య : (మేనకను చూడడు, కొడుకునే ధ్యాన్నంగా చూస్తుంటాడు.) రామరామ ! ఏమిటీ వీడి ప్రవర్తన ? ఏమిటి వీడు వాగేది ?.... చూడు....ఆ ముసలాడు ఇప్పుడుదాకా శ్రమపడి వచ్చాడు....వీడేమో.... అక్కడా ఇక్కడా పెత్తనాలుచేసివచ్చి ఆములు ఘాములుచేస్తున్నాడు ! గుర్రాన్ని విప్పమని హుకుం చేస్తున్నాడు ! వట్టి పశువైపోయాడు ! నీతి, నియమం, మాటామంతీ అన్నీ లోపించిపోయాయి—వీడిలో !

కొండయ్య : (లేచి చెప్పులువేసుకుని) హే భగవాన్ ! హే పరమాత్మా ! ఆ గుర్రంచచ్చిందో బతికిందో కూడా ! బుద్ధిమీద బుద్ధి గొంతువరకు పట్టించి వచ్చాడు. హే దయానిధీ, ఎక్కడున్నావు తండ్రీ! (దుప్పటి కప్పుకొని వెళ్ళిపోతాడు)

చంద్రయ్య : (కూర్చుంటూ) నాన్నా ! నన్ను క్షమించాలి : నేను కొంచెం పుచ్చుకున్నమాట నిజమే ! రెండుగుక్కలు పుచ్చుకుంటే ఏం పోయిందో చెప్పు ? ఆఁ, ఎంతలే, చాలా కొంచెం !....క్షమించు ! పాపం కొండయ్య....మనిషి మంచివాడు ! చెప్పినపనల్లా చేస్తాడు !

బంగారమ్మ : కాఫీనీళ్లు పెట్టనా ?

చంద్రయ్య : ఊఁ, తప్పకుండా ! నాన్న వచ్చి ఎంతసేపయిందో ఏమో ! తొందరగా కానివ్వు ! (మేనకతో) సామానంతా తెచ్చావా ?

మేనక : సామానంతా మోసుకరావటానికి నాకేం పట్టింది? నా సామానులు నేను తెచ్చుకున్నాను. తక్కినవన్నీ బండిలోనే ఉన్నాయి. హుఁ, ఇదేదో నాది కాదు! (ఒకప్యాకెట్టు బల్లమీద విసిరేస్తుంది. తన వస్తువులన్నీ తనపెట్టెలో పెట్టుకుంటుంది. సునంది ఆశగా వాటివైపు చూస్తుంది. రామయ్య కొడుకువైపే ఆలోచనగా చూస్తుంటాడు.)

బంగారమ్మ : (బయటికొస్తూ) ఆ పెట్టెలో ఇప్పటికే ఖాళీలేదు! ఇంకా తెచ్చావన్నమాట దాన్ని నింపటానికి!

చంద్రయ్య : (కోపంగా చూట్టానికి ప్రయత్నిస్తాడు) నాన్నా! నా మీద కోపం ఉంచుకోమాకు! నేను తప్పతాగేననీ, తెలివితప్పాననీ అనుకుంటున్నావేమో! అలా అనుకోమాకు! నేను తెలివిలోనే ఉన్నాను. 'ఎంతయినా తాగు, తెలివిమాత్రం తప్పకు' అని చెబుతారు పెద్దలు! నే నెప్పుడూ తెలివితప్పను! ఏ పనైనా చేయగలుగుతాను, సలహాలు ఇవ్వగలుగుతాను! ఆఁ, నువు గుర్రాన్నిగురించి చెప్పావు కదూ....ఆఁ దాని, ఏర్పాటుచేస్తాను! నిమిషాలమీద పని అది! ఎక్కువ మొత్తం కావాలంటే దొరకదుగాని— దీనిదేముందిలే! నేను సమకూర్చిపెడతాను! ఇంతేనా?....

రామయ్య : ఒరేబాబూ! కాలవలో నీళ్ళు ఎండిపోతే పడవ నడవదురా!

చంద్రయ్య : అంటే? తాగినవాడితో మాట్లాడకూడదనేనా నీ అర్థం? ....కాఫీ రావియ్! నే నిప్పుడు ఏ పనయినా చేయగలను! నాకు తెలివి తప్పిందనుకుంటున్నావేమో! మంచి తెలివిలో ఉన్నాను.

రామయ్య : (తలూపుతూ) ఆఁ-ఆఁ....

చంద్రయ్య : డబ్బుకావాలి గదూ నీకు?....ఇదుగో తీసుకో! (జేబులో చెయ్యిపెట్టి నోట్లు తీస్తాడు) గుర్రాన్ని కోనేసెయ్! నేను తల్లి

చంద్రుల్ని మరచేవాణ్ణి కాదు. తండ్రి అంటే నా కెంతో గౌరవం!.... డబ్బంటే నాకు లెక్కలేదు! (లేచి డబ్బు తండ్రి కివ్వబోతాడు. తండ్రి తీసుకోడు. తండ్రి చెయ్యిపుచ్చుకుని) తీసుకో నాన్నా! తీసుకో!

రామయ్య : నేను ఈ డబ్బు తీసుకోను!....చూడు....నేను నీతో మాట్లాడను! నీవిప్పుడు తెలివితప్పు ఉన్నావు.

చంద్రయ్య : తీసుకోవాల్సిందే! నేను ఊరుకోను! (బలవంతంగా చేతిలో పెడతాడు)

బంగారమ్మ : (ప్రవేశించి ఆగిపోతుంది) తీసుకో మామయ్యా! లేకపోతే నన్ను నిలవనివ్వడు!

రామయ్య : (తీసుకుంటూ) మనిషికాదు, వట్టి సారాబుద్ధి!

చంద్రయ్య : నాన్నా! మళ్ళా నువ్వు డబ్బు తిరిగిఇస్తే తీసుకుంటా, లేకపోతే లేదు! కొడుకంటే ఏమనుకున్నావ్?...(మేనకతో) మేనకా, నీ వస్తువులన్నీ తెరిచి చూపించు!

మేనక : ఏమిటీ?

చంద్రయ్య : నీ వస్తువులు చూపించమంటున్నాను.

మేనక : ఎందుకు చూపించటం? నేనన్నీ సర్దుకున్నాను.

చంద్రయ్య : నే చెప్పినట్టుచెయ్ ముందు! తీసుకరా! సునంది చూస్తుంది! అన్నీ తెరిచి చూపించు!

రామయ్య : వీడికి సిగ్గూ ఎగ్గూ, మంచీ చెడూ అన్నీ మటుమాయ మయ్యాయి! (పక్కకు వెళ్ళిపోతాడు!)

మేనక : (వస్తువులన్నీ బల్లమీద పేరుస్తుంది) ఇవిగో చూడమను! ఏం చెయ్యాలేం చూసి!

సునంది : హాయ్‌హాయ్! ఎంత బావుంది ఈ వోణీ హైమ అత్తయ్య దగ్గరున్నదికూడా సరిగ్గా ఇలాంటిదే!

మేనక : హైమా ?.... అదీ ఇదీ ఒకటేనా ? కళ్లుపెట్టుకు చూడు సరిగ్గా ! (మడత విప్పి చూపిస్తూ) అక్కడిదీ-ఇక్కడిదీ అనుకున్నావేం ? ఇది ఫిరాన్సునుంచి వచ్చింది.... తెలుసునా ?

సునంది : అబ్బ ! లతలు బలే బావున్నాయి ! నాగరత్నం చీరెమీద కూడా ఇలాంటి లతలే ఉన్నాయి ! అది కొంచెం తేలికరంగు. ఇదే బావుంది !

చం|ద్రయ్య : అలా చెప్పు !

బంగారమ్మ : (లోనికివెళ్ళి కాఫీకప్పులు వగైరా సామగ్రితో తిరిగి వస్తుంది కోపంగా) చాలుచాల్లే ! సర్దేసెయ్ దుకాణం ! బల్లంతా నింపేశావు గాని !

చం|ద్రయ్య : చూడు, నువుకూడా చూడు.

బంగారమ్మ : ఏమిటి చూసేది ? నేనెప్పుడన్నా చూసి ఎరుగుదునా ? తియ్యి ఇక్కణ్ణించి. (సామానంతా ఒక పక్కకు తోస్తున్నట్టుగానే తోస్తూ వోణీ నేలమీదపారేస్తుంది)

మేనక : అట్టా కింద పారేస్తావేం ! నీ సామాన్లు తీసుకెళ్ళి పారేసుకోరాదూ.... వీధిలో ? (వోణీ తీసుకొని దులిపి భ|ద్రంగా మడతపెట్టుకుంటుంది)

చం|ద్రయ్య : బాంగారం, ఇదుగో-దీనివంక చూడు !

బంగారమ్మ : ఏమిటి చూసేది ? చూసినట్టే ఉందిలే !

చం|ద్రయ్య : నిన్ను మరచిపోయాననుకుంటున్నావేమిటి ? పొరబాటు ! చూడు, నీకోసం నేనేం తెచ్చానో చెప్పుకో ? (ఒక ప్యాకెట్టు తీసి చూపి దానిమీద కూర్చుంటాడు) ఇది నీదే ! కావాలా ? ఆc, అంత తేలిగ్గాదు ! కష్టపడితేనే ఫలితం ! చెప్పుకోమరి, నేను దేనిమీద కూర్చున్నానో !

బంగారమ్మ : ఆహా ! బాగానే ఉందిలే ఆట. ఇక కట్టిపెట్టు. నాకేం పరవాలేదు. ఈ ఖర్చుపెట్టిన డబ్బంతా ఎవరిదేం ? నాది, నాడబ్బు.

మేనక : నీదా ? హుఁ, పాపం ! అంతా కాజేద్దామనే చూశావుగాని, నీ ఆట సాగిందికాదు ! ఇంక పిచ్చివేషాలు వెయ్యకుండా అవతలికి నడు ! (తోసుకుంటూ అవతలకు పోబోతుంది)

బంగారమ్మ : తోసుకుపోతావేమే ? వొళ్ళు పొగరెక్కిందా ? పొగ రణుస్తాను జాగ్రత్త !

మేనక : ఏమిటే నువు అణిచేది ? రా, అణుద్దుగాని, రా. (బంగారమ్మమీదికి వెళ్ళి గెంటుతుంది)

చంద్రయ్య : ఏఁ ఏఁ, ఏమిటది ?....వదిలిపెట్టు ! ఊరుకో ! ఊరుకో ! (ఇద్దరికీ మధ్య నిల్చుంటాడు)

మేనక : మరి అనవసరంగా నోరు పారేసుకుంటుందేం ? అది చేసింది ఎవరికీ తెలీదనుకుంది గామాలు ! అంతా తెలుసు నాకు!

బంగారమ్మ : ఏమిటే నీకు తెలిసింది? చెప్పు ఏమిటో ! దాచుకుంటా వెందుకు ?

మేనక : చెబుతాను, చెబుతాను ! నాకంతా తెలుసు !

బంగారమ్మ : సిగ్గుమాలినదానా ! పరాయిమొగాడితో తిరుగుతూ ఇంకా నంగనాచిమాటలు పోతున్నావా !

మేనక : అవునవును-నువు నీ మొగుడితో ఉన్నట్టు ! విషంబెట్టి చంపావుగా !

బంగారమ్మ : (మీదికి ఉరుకుతుంది) ఏమిటే నువ్వు వాగేదీ.... పాడుముండా ?

చంద్రయ్య : (పట్టుకొని) బంగారం ! ఏమిటది ! వొళ్లు దగ్గర పెట్టుకో—

బంగారమ్మ : నన్ను ఏదో భయపెట్టాలని చూస్తుందేఁ ! నీతరంకాదు, తోస్తాడు) ఏమనుకున్నావో !

చంద్రయ్య : (బంగారమ్మ పట్టుకొని రెండోవైపుకు తిప్పి ఒకతోపు ఫో బయటికి !

బంగారమ్మ : ఎక్కడికి పొమ్మంటా ? ఇదినా ఇల్లు. నా ఇల్లు వదిలి నేను ఎక్కడికీ వెళ్ళను !

చంద్రయ్య : ముందు అవతలికి నడు ! నాకు మొహం చూపించావంటే ఊరుకోను !

బంగారమ్మ : వెళ్ళను, ఏంచేస్తావో చెయ్యి ! (చంద్రయ్య నెట్టేస్తాడు, బంగారమ్మ ఏడుస్తూ గుమ్మం గట్టిగా పట్టుకుంటుంది)

బంగారమ్మ : నా ఇంట్లోనుంచే నన్ను వెళ్ళగొడతావా ? అసలు నువ్వెవడివంట ? దుర్మార్గుడా ! ఏదో చట్టంఅంతా నీవంకే ఉన్నదనుకుంటున్నావేమో !....ముందున్నై రోజులు !

చంద్రయ్య : ఏమిటే నువు కూసేది ?

బంగారమ్మ : నేను ఇనస్పెక్టరుదగ్గరి కెళ్తాను. చూస్తూండు, నీ మీద కేసుబెట్టిస్తాను !

చంద్రయ్య : ఆఁ, పెట్టించు ! నీ తాత్తో చెప్పుకో, ఫో ! (బయటికి తోసేస్తాడు)

బంగారమ్మ : (బయటినుంచి) నేను ఇప్పుడు ఉరిబెట్టుకొని చచ్చిపోతాను !

చంద్రయ్య : పెట్టుకో ఫో; ఇక్కడ భయపడేవాళ్లెవరూలేరు !

సునంది : అమ్మా ! అమ్మా ! (ఏడుస్తుంది)

చంద్రయ్య : హుం, నేనా దానికి భయపడేది ? నువ్వు ఎందుకే ఏడుస్తావు? అదే వస్తుందిలే ఏడవమాకు. దాని బొంద ! అదెక్కడికిపోతుందీ ! పో, వంటయిందేమో చూడు ! (సునంది వెళ్ళిపోతుంది)

మేనక : (వస్తువులన్నీ మడతలుపెట్టి సర్దుకుంటుంది) సిగ్గుమాలిన కుక్క ! నన్నంటున్నదిపైగా!....ఆగు ఆగు ! నీ అంతు కనుక్కుంటా ; పగలగొయ్యా !

చంద్రయ్య : చాలు, చాల్లే ! ఇంకా ఎందుకుకోపం ! దాన్ని వెళ్ళగొట్టానుగా !

మేనక : చూడు, నా వోణీఅంతా పాడుచేసి వెళ్ళింది ! గుడ్లు పీకేసే దాన్ని ! నువ్వు అడ్డమొచ్చావుగాని !

చంద్రయ్య : చాలు చాల్లే ! నేను దాన్ని ప్రేమిస్తున్నాను కదా....

మేనక : నువ్వు ప్రేమిస్తున్నావా ? ప్రేమించాలి కూడాను....పిశాచాలు ప్రేమించాల్సిందే ఆ పాడుముండని! నువ్వు దాన్ని తన్ని తరిమేసినా దానికేమీ చింతలేదు. రొచ్చుపురుగు వెళ్ళి రొచ్చుగుంటలోనే పడుతుంది ! నువ్వు ఏమన్నా అనుకో—ఈ యిల్లునాది—ఈ డబ్బునాది ! నువ్వుకూడా అది నా ప్రియురాలు అంటున్నావే—మొగుడిదగ్గర ఎంత ప్రియురాలుగా ఉందో నువ్వు చూడలా ! అది ఖూనీలు చేస్తుంది !....హంతకి !

చంద్రయ్య : రామరామ, ఈ ఆడవాళ్ళు నోరువిప్పితే మళ్ళీ మూత బడదు గదా ! ఒకటే వాగుడు బడ-బడ, బడ-బడ ! నువ్వు వాగేది ఏమిటో నీకేనా తెలుస్తోందా ?

మేనక : ఆం, తెలుసు ! దాన్ని మాత్రం నాతో ఇక్కడ ఉండ

నివ్వను! దాన్ని బయటికి వెళ్ళగొట్టిగాని ఊరుకోను. ప్రియురాలుట! ఎవడికి ప్రియురాలు, ఎవడుండమన్నాడు! పాడుముండ! అది ఉండవలసింది జైలులోనే! ఇక్కడ కాదు!

చంద్రయ్య : ఇక కట్టిపెట్టు! దానికీ నీకూ సంబంధమేమిటి? నువ్వు చూడవలసింది నన్ను! యజమానిని నేను! నా యిష్టమొచ్చినట్టు నేను చేస్తాను. దాన్ని ప్రేమించటం మానేశాను; ఇప్పుడు నిన్ను ప్రేమిస్తున్నాను! అదంతా నా యిష్టం! అదంతా నా పని! దాన్ని ఈ చెప్పులకింద (తనకాలి చెప్పులు చూపిస్తూ) పడేసి ఉంచుతాను! నీ కెందుకొచ్చిన పేచీలు.... నువ్వూరుకో! (పాడతాడు)

(కొండయ్య వచ్చి, తలగుడ్డతీసి చెప్పులు విడిచి బల్లమీదకు వెళ్ళి కూర్చుంటాడు)

కొండయ్య : ఆడవాళ్ళేదో జుట్లుపట్టుకున్నట్టుందే! ఓ భగవంతుడా! ఓ దయానిధీ!

రామయ్య : (చెప్పులు తొడుక్కుంటూ) కొండయ్యా! ఇలా వచ్చి కూర్చోవయ్యా!

కొండయ్య : ఇద్దరికీ క్షణం పడదు!

చంద్రయ్య : కొంచెం సారాయి తీసుకరా! కాఫీతో కాస్త అది కూడా....

సునంది : (వచ్చి మేనకతో) అక్కా! నీళ్లు మరుగుతున్నాయ్!

చంద్రయ్య : మీ అమ్మ ఎక్కడుంది?

సునంది : దావిట్లో నుంచుని ఏడుస్తోంది.

చంద్రయ్య : ఓ ఇలా పిలు! కాఫీ కలపమని చెప్పు! మేనకా!.... తక్కినపని నువ్వు చూడు! (సునంది వెళ్తుంది)

మేనక : తక్కినవనా ?....సరే ! (ఒక్కోవస్తువు తీసుకొస్తుంది)

చంద్రయ్య : (సారాయి సీసా, బిస్కట్లు, పళ్లా పొట్లాలు విప్పి బయటికి తీస్తాడు) ఇది నాకు ! ఉన్నిదారాలు బంగారానికి । తక్కినవి...' మొత్తం ఎంత ఖర్చయింది ?. ..లెక్కవేద్దాం (లెక్కబెడతాడు) భోజనం హోటల్లో పన్నెండున్నర ! సారాయి....గుడ్డలు....నాన్నకిచ్చినవి పది,... నాన్నా....రావేఁ....కాఫీ తయారయింది ! (క్షణంసేపు అంతా నిశ్శబ్దం. రామయ్య తలపాగా చుట్టుకుంటూవుంటాడు. బంగారమ్మ కాఫీ తీసుకు వస్తుంది.)

బంగారమ్మ : ఎక్కడపెట్టనూ కాఫీ ?

చంద్రయ్య : ఈ బల్లమీద పెట్టు ! వెళ్లావా ఇనస్పెక్టరు దగ్గరకు ? రాయించావా రిపోర్టు ? నోటికొచ్చింది వెళ్ళగక్కుతావు. వెళ్లగక్కింది మళ్లీ మింగేస్తావు !....అంతేనా ! కోప్పడకు ! రా, కూర్చో ! ఇదుగో ఇది.తాగు ! (సారాయి నింపి గ్లాసు ఇస్తాడు.) ఇదిగో నీకు తెచ్చిన బహుమానం !

[తాను వేసుకుకూర్చున్న ప్యాకెట్టుతీసి బంగారమ్మ కిస్తాడు; బంగారమ్మ కిమ్మనకుండా తీసుకుంటుంది; కాని ఇష్టంలేనట్టు తల తిప్పుతుంది. రామయ్య పై బట్టకూడా వేసుకొని ప్రయాణానికి సిద్ధమై పదిరూపాయల నోటు తెచ్చి చంద్రయ్య ముందుంచుతాడు]

రామయ్య : నీ డబ్బు నువ్వు తీసుకో !

చంద్రయ్య : (డబ్బువైపు చూడకుండా) ఇదేమిటి ? చెప్పులు తొడుక్కున్నావేఁ ?

రామయ్య : నేను వెళ్లిపోతున్నాను.... చూడు....నన్ను క్షమించు (తలపాగా సర్దుకుంటాడు)

చంద్రయ్య : అదేమిటి నాన్నా, ఈ రాత్రిపూట ఎక్కడికిపోతావు ?

రామయ్య : ఈ ఇంట్లో నేను ఉండలేను. క్షమించు, నేను వెళ్లాలి.

చంద్రయ్య : కాఫీకూడా తాగకుండానే వెళ్లిపోతావా ?

రామయ్య : ఈ ఇంట్లో....చూడు....నీతి అనేది లేదు! ఇక్కడ ఉండటం అధర్మం!....చంద్రయ్యా....నీ బతుకు కళంకంతో కూడుకుంది... చూడు....పాపపంకిలంలోపడి కొట్టుకుంటున్నావు! నేను వెళ్లిపోతాను!

చంద్రయ్య : ఏమిటినాన్నా, నువ్వనేది ?....సరే ఏమైనాఉంటే తర వాత మాటాడుకుందాం. కూర్చుని కాఫీతాగు।

బంగారమ్మ : అలా అనకు మామయ్యా! నలుగురిలోనూ మేము నగుబాట్లపాలవుతాము. నువుకూడా అలా కోపగించుకుంటే ఎలామామయ్యా!

రామయ్య : నాకెందుకమ్మా కోపం ?....ఇదుగో చూడు.... చంద్రయ్యా, నువు నడుస్తున్న దారి మంచిదికాదు!....చూడు...చాలా నీచమైనమార్గంలో నువ్వు అడుగుపెట్టావు! .... చూడు....పరమపాపిష్టి మార్గంలో పడ్డావు....

చంద్రయ్య : నీచమైనమార్గమూ!...పాపిష్టిమార్గమూనా?...అవేమిటో నాకు తెలీదే!....

రామయ్య : ఇదుగో చూడు....నువు సాగుతున్నది సర్వనాశనం లోకే....చూడు....నువు ఇప్పుడు ఈలోకంలో లేవు....చూడు....సైతాను చేతిలో....చూడు....సైతాను ఉచ్చులో చిక్కుతున్నావు. నేను ఆనాడే చెప్పలేదూ ?

చంద్రయ్య : చెప్పావులే, ఏదేదో చాలానే చెప్పావు. అయితే ఇప్పుడేం మునిగిపోయిందంటావ్ ?

రామయ్య : ఇదుగో చూడు....నువు ఒక తల్లిదండ్రులు లేని పిల్లను చెరగొట్టావు....ఆ రాజమ్మను నిలువునా మోసంచేశావు!

చంద్రయ్య : మళ్ళీ మొదలెత్తుతున్నావ్? ప్రాణంలేని శవాల్ని పాతేసే ఉంచుదూ! అ పాతపురాణాలన్నీ మళ్ళీఎందుకు తవ్వటం ?

రామయ్య : (ఉత్తేజపడుతూ) అవి పాతపురాణాలు కావురా, అబ్బాయ్....చూడు....వాటిని నువు పాతేసి ఉంచలేవు ఇదుగో చూడు.... ఒక్కసారి పాపానికి ఒడిగడితే....ఆ వెంటనే మరోపాపం....చూడు... ఆ వెంటనే మరోటి...చూడు...గొలుసుకట్టులా ఆ వరస తెగదు !.... చూడు...నువు పాపాల్లో కూరుకుపోతున్నావు !...దించుకుపోతున్నావు !

చంద్రయ్య : సరే, ఆ పాపపుణ్యాలమాట ఇప్పుడు కట్టిపెడుదూ !— ముందు కూర్చో ! కాఫీ తాగు !

రామయ్య : ఇదుగో చూడు...ఈ కొంపలో ఇక నేను పచ్చి మంచి నీళ్లుకూడా ముట్టుకోను !...చూడు...ఇక్కడి గాలిలోకూడా పాపాలకంపు కలిసిపోయింది.

చంద్రయ్య : నీ పిచ్చి నీదేగాని-నే చెప్పినది వినవే...కూర్చో ముందు !

రామయ్య : నువ్విప్పుడు సంపత్తి మైకంలో పడి కొట్టుకుంటున్నావు! ...ఇదుగో చూడు...ఈ మైకం నిన్ను పాపాలకూపంలో దించేస్తుంది చంద్రయ్యా!...చూడు...భగవంతుడు చూసేది మాయను కాదురా-మనస్సును!

చంద్రయ్య : ఇక ఆపవయ్యా, నా ఇంటికొచ్చి నన్నే బెదిరిస్తున్నావే! ఎందుకట్టా చించుకుంటావు—ఊరుకోమని చెబుతున్నకొద్దీ ? నేనేమన్నా పసిపిల్లగాణ్ణా చెవులు మెసి కూర్చోపెట్టటానికి ? నీ చిన్ననాటి రోజులు కావు ఇప్పుడు ! కాలం చాలానే మారింది !

రామయ్య : నిజమేరా బాబూ !...నిజమే ! ఇదుగో చూడు...ఈ కాలం కొడుకులే తండ్రిని చెవులుపట్టుకు ఆడిస్తున్నారంట !...చూడు...

కాలం మారింది. నిజమేలే ! ఇది సత్యకాలం కాదు...కలికాలం ! ఎదురీత కాలం !

చంద్రయ్య : (కోపంగా) నేను నిన్నేమీ పెట్టమనలేదు, పొయ్యమన లేదు. నా యింట్లో నా మనసొచ్చినట్టు నేనుంటాను. నువ్వొచ్చిన పని గడుపుకొని మర్యాదగా వెళ్లు. నన్నుమాత్రం వేధించమాకు !

రామయ్య : ఓహో ! ఆ పదిరూపాయలసంగతా !....చూడు....నాకు లేకపోతే ముష్టెత్తుకుంటాను కాని....నీ పాపిష్ఠిసొమ్ము నా కొద్దు.

చంద్రయ్య : ఓహో, అలాగా ! సరే పోనియ్....కోప్పడకు ! ఇప్పటికే చాలా అన్నావు ! ఇక వదిలిపెట్టు ఆ గోలంతా ! రా కూర్చో (చేయిపట్టుకొని కూర్చోపెట్టబోతాడు)

రామయ్య : (బిగ్గరగా అరుస్తూ) నన్ను వదిలెయ్ !....ఇదుగో చూడు....నేను మాత్రం ఒక్కక్షణంకూడా ఉండను !....చూడు....ఇంత కంటే ఏ చెట్టుకిందైనా పడి ఉండటం మంచిది !....చూడు....ఈ పాపాల కొంపలో ఉండేదానికంటే అదే వెయ్యిరెట్లు మెరుగు ! శివశివ ! పరమే శ్వరా ! కరుణించు ! (వెళ్ళిపోతాడు)

చంద్రయ్య : బలే బావుందే వరస !

రామయ్య : (గుమ్మంలోనించి) చంద్రయ్యా....ఇదుగో .చూడు.... తెలివితెచ్చుకో....ఎందుకు చెడిపోతావు ! భగవంతుడు చూసేది-ఐశ్వర్యాన్ని కాదు-ఆంతర్యాన్ని !....గుర్తుంచుకో ! (వెళ్ళిపోతాడు)

మేనక : (ఒక కాఫీకప్పు తీసుకొని) ఈ కాఫీ పారబొయ్యనా ? (ఎవరూ మాట్లాడరు)

కొండయ్య : (బిగ్గరగా) హే పరమాత్మా! హే దయానిధీ! పాపుల్ని క్షమించు స్వామీ! పాపుల్ని కరుణించు స్వామీ! (అంతా ఉలికిపడతారు)

చంద్రయ్య : (బల్లమీద పడుకుంటాడు) ....అంతా వ్యర్థమై పోయింది! అంతా వ్యర్థమైపోయింది! (మేనకతో) హార్మొనీ ఎక్కడుంది?

మేనక : హార్మొనీయా? బలే గుర్తొచ్చిందే నీకు! బాగు చేయించటానికి నువ్వేగా తీసుకెళ్లావు! ఇదుగో ఈ కాఫీ తాగు! .... నేను కలిపాను!

చంద్రయ్య : తీసెయ్, నా కక్కర్లేదు! దీపం తగ్గించు! అబ్బా!.... అంతా వ్యర్థమై పోయింది! అంతా వ్యర్థమైపోయింది! (చేతుల్లో మొహం పెట్టుకొని ఏడుస్తాడు)

# నాలుగో అంకం

[చలికాలం వెళ్ళిపోయే రోజులు. సంధ్యవేళ గడిచిపోయింది. దూరంగా చంద్రుడు కన్పిస్తూన్నాడు. ఇంటి వెనుకభాగం. ఒకవైపున రెల్లు కప్పిన ఇల్లుఉంది, ఆ లోపలినించి తాగినవాళ్ళ అరుపులు వినవస్తున్నాయి. ఇంట్లోనుంచి రెండో పొరుగింటావిడ బయటికొచ్చి మొదటి పొరుగింటామెను సంజ్ఞచేసి పిలుస్తుంది]

రెండో పొరుగింటావిడ : ఏమిటివిశేషాలు ? మేనక కన్పించటం లేదే ?

మొదటి పొ : ఏఁ, ఎందుకు కన్పించదు !. దానికేం ఘోషాలేదు. కాని ఈ మధ్య జబ్బుగా ఉందని విన్నాను....నీకు తెలిసిందో లేదో....ఒక సంబంధంవాళ్లు చూట్టానికికూడా వచ్చారు. కాని....ఇక్కడ అమ్మగారు రాణీవాసంలో జబ్బుతో తీసుకుంటున్నారు. లేచేస్థితిలోకూడా లేరట !

రెండో : ఏఁ ? అసలుసంగతేమిటి ?

మొదటి : ఆఁ, దిష్టి తగిలిందట, ఎవరో చేతబడి చేశారట ! కడుపు నొప్పితో బాధపడుతున్నది. మహాబాధగా ఉందటలే.

రెండో : అంతేనా ?

మొదటి : నిజం....నీకు తెలీదా ?....కాదా యేం ? (నెమ్మదిగా మాట్లాడుతుంది)

రెండో : చాల్లెద్దూ, నిజం నువు చెప్పరాదూ ?....పిల్లను చూడ వచ్చిన వాళ్ళకుకూడా ఈ విషయం తెలిసే ఉంటుంది !

మొదటి : తెలియకుండా ఎలా ఉంటుంది ? అంతా తప్ప తాగి పడి ఉన్నారు. అయినా ఆ వచ్చిన వాళ్ళకు కావలసింది కట్నం ! కట్నంకూడా కాస్తాకూస్తా కాదు—వాళ్ళడిగినంత !....సొమ్ములు, సారె, చీరె, ఫర్నిచర్....పైగా నగదుడబ్బు !....డబ్బుకూడా కాస్తాకూస్తా కాదు !

రెండో : ఎంత ఇస్తే మటుకు ఆ చెడ్డపేరు ఎలా మాసిపోతుంది ?

మొద : ఉష్ !....(పెళ్ళికొడుకు తండ్రి వస్తాడు) అదిగో, ఆయనే పిల్లవాడితండ్రి.! (వాళ్ళిద్దరూ లోనికి వెళ్ళిపోతారు. పిల్లవాడితండ్రి దగ్గుతూ దగ్గుతూ రెల్లుగడ్డి ఇంట్లోనుంచి వస్తాడు)

తండ్రి : అబ్బా ! ఎంతవేడిగా ఉంది ! ఒకటే ఉడకపోస్తున్నదే ! అమ్మయ్య, ఇక్కడ కాస్త ఊపిరిసలుపుతోంది. (నిలబడి) ఆ భగవంతుడికే తెలియాలి....ఏదో రహస్యం ఉన్నట్టుంది....చూస్తే ఈ ముసలిది చాలా వ్యవహారం నడిపేట్టుంది !

తులశమ్మ : (బయటికి వచ్చి) ఓహో, ఇక్కడున్నారా ! వియ్యంకుడుగారు ఎక్కడున్నారో అని నేనంతా వెదుకుతున్నాను ! ఏమండీ నాయుడుగారూ....వ్యవహారమంతా తేలిపోయింది ! అంతా ఆ భగవంతుడి కృప ! అయినవాళ్ళం గనక....సంబంధం విషయంలో తరచి తరచి చూడాల్సిన అవసరంలేదు. నేనుకూడా ఎక్కువగా చెప్పేదాన్నికాదు ! లోకులు కాకులు—వాళ్ళకు చెవిఒగ్గితే ఎవో పుల్లగొండిమాటలు చెప్పక మానరు ! అందుచేత మీరు ఎవ్వరిమాటా వినకండి. కోడలు మాత్రం రత్నలాంటిది. ఇలాంటి రత్నాలు దొరకటం మహాకష్టం ! నూటికి ఏ ఒక్కరో ఉంటారు ! ఈ జిల్లామొత్తంలో ఇలాంటి మంచిపిల్ల లేదంటే నమ్మండి.

తండ్రి : పిల్లవిషయం అలాఉంచు, కట్నం సంగతేమిటి ?

తులశమ్మ : ఏముందిచెప్పటానికి ? అది మీకు తెలిసినవిషయమేగా?

తండ్రి మిగిల్చిన రొఖ్ఖం యావత్తూ పిల్లకు చెందుతుంది. పెళ్ళిఖర్చులన్నీ పోను పదిహేనొందలపై గానే మీకు దక్కుతుంది. అంత రొఖ్ఖం పిల్లకు ఈరోజుల్లో ఎవరిస్తారు చెప్పండి ?

తండ్రి : ఏమిచ్చినా పిల్లకిచ్చినట్టే. మేం తీసుకునేది పిల్ల సుఖం కోసమే !

తులశమ్మ : నా ప్రయత్నంలేకపోతే ఇలాంటి పిల్ల మీకు దొరికేదేనా ? వరహాలపురం జమీందారీ కుటుంబానికి చెందిన సంబంధ మొకటి వస్తే.... మేమే ఇవ్వమని చెప్పేశాం !....డబ్బు విషయంలో మీ కెలాంటి అనుమానం ఉండనవసరంలేదు. పిల్లతండ్రి చాలా మంచివాడు ! చనిపోతూ చనిపోతూ....నగదుఅంతా పెద్దపిల్లకు ముట్టజెప్పాలనీ, బంగారమ్మను చంద్రయ్య చేసుకోవాలనీ చెప్పిపోయాడు. పాపం చచ్చి స్వర్గానఉన్నాడు ఆ జోగయ్యగారు. అరగంటకు ప్రాణం వదుల్తాడనగా నన్నూ బంగారమ్మనూ చంద్రయ్యనూ పిలిచిచెప్పాడు ఈ నాలుగుమాటలూను. ఈవిధంగా అంతకుముందే విల్లునామాకూడా రాయించేశానని చెప్పాడు. మా చంద్రయ్య నీతిపరుడు గనక....ఆ డబ్బు జాగ్రత్తచేశాడు. ఇంకొకడయితే ఆ డబ్బు కాస్తా స్వాహాచేసి కూర్చునేవాడే నాయుడుగారూ....డబ్బుకూడా కాస్తా కూస్తానా....

తండ్రి : ఏమో, ఆ డబ్బు ఇంకా చాలా ఉండేదనీ, మీ చంద్రయ్య చాలానే గుటకాయస్వాహా చేశాడని లోకులు చెప్పుకుంటున్నారే !

తులశమ్మ : రామరామ ! మనుషుల కళ్లు కప్పితే దేవుడికళ్లు కప్పగలమా నాయుడుగారూ ? గిట్టనివాళ్ళు చెప్పేమాటలు అలాగే ఉంటాయి. పొరుగువచ్చగా ఉంటే ఓర్వలేనివాళ్లు లోకంలో అనేకమందుంటారు. అందుకనే నేను ముందేచెప్పాను : చెప్పుడుమాటలకు చెవిఒగ్గద్దని, ఉన్న డబ్బు అంతా పిల్లకే ముట్టజెపుతాం. అనవసరమైన అనుమానాలుపెట్టుకొని బంగారం

లాంటి సంబంధం పాడుచేసుకోవద్దు। ఇక పిల్లఉందంటే నాయుడుగారూ, అందాలరాణి అనుకోండి। చిదిపి దీపం పెట్టొచ్చు. వికసించిన గులాబి పువ్వునుకూడ వెక్కిరిస్తుందంటే నమ్మండి।

తండ్రి : కావచ్చునమ్మా; కాని ఇంతవరకు మా కంట పడనేలేదు। దీని రహస్యమేమిటో మా కర్థంకావటంలేదు। రోగిష్టి మారిదేంకాదుగదా?

తులశమ్మ : రోగిష్టిదీ-ఈ। రామరామ। అలాంటిదేమీలేదండీ। అసలు అలాంటి ముత్యంలాంటిపిల్ల కంచుకాగడాలుబెట్టి వెదికితేమాత్రం మీకు దొరుకుతుందండీ? మాంచి జబర్దైనపిల్ల; రథంలాగా ఉంటుంది. అసలు మీరు చూస్తే-రంభ భూమ్మీదికి దిగొచ్చిందనుకోరూ? ఇంటి పనులన్నీ మహానేర్పుగా తీర్చిదిద్దగల తెలివితేటలున్నాయి. ఆఁ। కాని అయితే కాస్త చెపుతున్నమాట వాస్తవమే। మీకు తెలియందేముంది। చంద్రుడులోమాత్రం మచ్చలేదూ? మనిషన్నతరువాత ఆమాత్రం మచ్చలేకుండా ఉంటుందా చెప్పండి? ఇకపోతే బయటికిరాకపోవటానికి కారణం ఏమిటంటే....ఈమధ్య ఎవరో చేతబడిచేశారండీ. నాలుగురోజుల్నుంచి బొత్తిగా పిల్ల లేవడంలేదు. దీనికితోడు దిష్టికూడా తగులుతుందని భయం. అంతేగాని....అయినా పిల్లను మీరు ఎరగనివాళ్లా ఏమన్నానా? ఆ చేతబడి చేసిందెవరో నాకు తెలుసు! పెళ్ళిసంబంధాలు వస్తున్నాయంటే ఇలాంటి దుర్బుద్ధులు పుడతాయివాళ్ళకి! ఈ తంత్రాన్ని కట్టేసే విద్య నాకూ తెలుసు। రేపీపాటికి పిల్ల లక్షణంగా లేచి తిరిగేట్టు చేయగలను। పిల్లనుగురించి మీరేమీ ఆలోచించకండి.

తండ్రి। అయితే నాకీ సంబంధం ఇష్టమే।

తులశమ్మ : శుభం। ఈ మాటమీదనే నిలబడాలి। మళ్ళీ మాటతప్పారంటే బావుండదు। పోతే నాయుడుగారూ, నన్నుమాత్రం మరిచిపోకూడదు సుమండీ। (లోపల్నుంచి ఎవరిదో పిలుపు)

కంఠధ్వని : ఇక పదవయ్యా నారాయణస్వామీ ! ఏడీ ఎక్కడ ?.... ఏమయ్యో, ఓ నారాయణస్వామీ !....ఏమిటి వచ్చేదా రాందా ?

తంత్రి : (బయటికి వచ్చి) వస్తున్నా, వస్తున్నా ! (అతిధులంతా వెళ్ళటానికి సన్నద్ధులవుతారు)

సునంది : (పరుగెత్తుకుంటూ వచ్చి తల్లిని పిస్తుంది) అమ్మా ! అమ్మా !

బంగారమ్మ : (లోపల్నుంచి) ఏమిటే ?

సునంది : ఇలా రా అమ్మా ! తొందరగా రావాలి ! (బంగారమ్మ బయటికొస్తుంది-ఉభయయులూ రెల్లుగడ్డి ఇంటిపక్కకు వెళ్తారు)

బంగారమ్మ : ఆఁ, ఏమిటే ? మేనక ఎక్కడుంది ?

సునంది : అయింట్లోనే ఉంది ! ఏందుకో నాకయితే తెలీదు గాని - కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నదే ! 'ఈ బాధ నేను సహించలేకుండా ఉన్నాను, నేను చచ్చిపోతాను, నేను ఏడ్చేస్తాను, నేను గోలచేసేస్తాను....అంటూ మెల్లిగా కుళ్ళికుళ్ళి ఒకటే ఏడుస్తోంది !

బంగారమ్మ : ఇప్పుడెలాగు ? అవతల చుట్టాలొచ్చి కూర్చున్నారు ! ముందువాళ్ళపనేదో చూసి తరవాత అక్కడికొస్తాను ! అందాకా పడి ఉంటుందిలే !

సునంది : చాలా బాధపడుతున్నదే ! చాలా కోపంగాకూడా ఉంది ! 'చస్తే చస్తాను, బతికి బయటపడినా నేను పెళ్ళే చేసుకోను !' అంటున్నదే ! నిజంగానే చచ్చిపోయేట్టుగా ఉంది ! చాలా భయంగా ఉంది నాకు !

బంగారమ్మ : భయంలేదు గియంలేదు !....నువ్వు దాని దగ్గరకు

వెళ్ళమాకు! అది అంత తొందరగా చావదులే! రా, వెళ్దాం! (ఇద్దరూ వెళ్ళిపోతారు)

కొండయ్య : (వచ్చిగడ్డిపోగుచేస్తూ)హే భగవాన్! హే దయానిధీ!— అబ్బ, అబ్బ ! ఏం వాసన ! ఎన్ని సీసాలు ఖాళీ అయినాయి ! వారెవా ! సీసా నోటిముందు తెరిచిఉన్నట్టుగానె ఉంది !....ఛీ!....నాకొద్దూ....నేను తాగను ! ఒట్టంటే ఒట్టే ! అంతే....వద్దు....హాఁ, గడ్డి అంతా ఎలా తొక్కేశారో ! దున్నపోతులు!....సుబ్బరంగా తిన్నా బావుండేది ? ఆహా.... ఏం వాసన....ఛీఛీ !....(ఆవులిస్తాడు) నిద్దరోస్తోంది....లోపలి కెలా వెళ్ళటం ? వెళ్తే....అమ్మో, ఇంకేముంది....వాసనతోటే వాళ్లు మత్తెక్కుతుంది....నేనుకూడా సీసా పుచ్చుకున్నానన్నమాటే ! అబ్బ! ఏం వాసన!.... (అతిథులు వెళ్తున్న చప్పుడు) వెళ్తున్నట్టున్నారే ! హే భగవాన్ ! హే దయానిధీ !....గొంతువరకు తాగింది చాలక తలా ఒక సీసా చంకను పెట్టుకుపోతున్నారే ! వారెవా ! ఏం మజాగాఉంది అయ్యగార్లపని....

(చంద్రయ్య వస్తాడు)

చంద్రయ్య : కొండయ్యా ! వెళ్ళి పడుకో! ఆపనేదో నేనుచూస్తాను!

కొండయ్య : సరే...ఈ గడ్డి ఎత్తికెళ్లి గొడ్లముందు పడెయ్యి ! ...అవి తింటాయిలే !—వాళ్లు వెళ్ళిపొయ్యారా !

చంద్రయ్య : వెళ్ళారనుకో, కాని వ్యవహారం ఇరుకున పడింది. ఏం చేయాలో తెలీకుండా ఉంది.

కొండయ్య : నిజమే మరి ! గడ్డుసమస్యే ఇది ! ఆస్పత్రుల్లోనూ అనాథశరణాలయంలోనూతీసుకుంటారటగా! ఎవరూ అడిగేవాళ్ళే ఉండరట! అక్కడేఉండి దాది పనిచేస్తే జీతంకూడా ఇస్తారట; అక్కడికి పంపిస్తే బావుంటుందికదూ ?

చంద్రయ్య : సరేగాని—నువుమాత్రం ఎవరితోనైనా నోరుజారేవు సుమా !

కొండయ్య : అబ్బే.... అంతపనే !.... ఎట్టా ఈ వ్యవహారాన్ని మాయంచేస్తావో చెయ్ !—అబ్బ ! నీ దగ్గర నించుంటే....సీసా ముంద నించునట్టే ఉంది !....సరే, నేను వెళుతున్నా, హే భగవాన్ ! హే దయా నిధీ ! (అవలిస్తూ వెళ్ళిపోతాడు)

(చంద్రయ్య చాలాసేపటిదాకా ఆలోచిస్తూ కూర్చుంటాడు)

చంద్రయ్య : అర్థంకాకుండా వుందే. ఏం చేయాలో !

(బంగారమ్మ వస్తుంది)

బంగారమ్మ : ఇక్కడేం జేస్తున్నా ?

చంద్రయ్య : ఏఁ ?

బంగారమ్మ : ఏమేమిటి ? ఏం జేస్తున్నావంటున్నా ! ఆలస్యంచేస్తే ఎలాగు ? వెంటనే ఏదో ఒకటి చేసెయ్యాలి !

చంద్రయ్య : ఆఁ ? ఏం చెయ్యాలంటావ్ ?

బంగారమ్మ : నేను చెప్పాలా ఏం చెయ్యాలో ?.... సరే అయితే, చెపుతాను, చెప్పినట్టుగా చెయ్ !

చంద్రయ్య : ఏదేనా అనాథాలయానికి తీసుకెళ్తే?....నాకు అంత కంటే మరేమీ తెలీదు.

బంగారమ్మ : పాపం ! ఏమీ తెలీదు!....పైలాపచ్చీసుగా తిరగటం తెలుసు ! ఇలాంటి వెందుకు తెలుస్తాయి ? అనాథాలయానికి ఏ మొహం పెట్టుకు తీసికెళ్తా ? లే ముందు !

చంద్రయ్య : లేచి ఏంచెయ్యను ?

బంగారమ్మ : ఆ మూలగదిలో కెళ్ళి గొయ్యితవ్వు !

చంద్రయ్య : మరో మార్గంలేదా ?

బంగారమ్మ : (వెక్కిరింపుగా) మహోమార్గంలేదా ?....ఏమీలేదు ! సంవత్సరం క్రిందట ఏమైంది ఆః ఆలోచన ? ఇప్పుడాలోచిస్తున్నావు—మహోమార్గం ! పద ! నే చెప్పినట్లు చెయ్ !

చంద్రయ్య : ఆరి భగవంతుడా ! ఎంత విపత్తు తెచ్చావురా !

(సునంది వస్తుంది)

సునంది : అమ్మా ! నాయనమ్మ పిలుస్తోంది. అక్కకు ఏమైందే ? అక్కగదిలో క్యార్ క్యార్ మని ఏడుపు వినిపిస్తోందేమిటి ?

బంగారమ్మ : ఛీ, నోర్ముయ్, పిల్లికూనలు అరుస్తుంటాయ్ ! నీకెందుకు వాటిగోల ? నువు పోయి పడుకుంటావా దెబ్బలు కావాలా ?

సునంది : నిజంగానమ్మా, పాపాయి యేడుపు నేను విన్నానే !

బంగారమ్మ : (చెయ్యి ఎత్తి) నువు ముందు వెళ్ళి పడుకుంటావా దెబ్బ వెయ్యనా ? అటువేపు వెళ్ళావంటే చెంప పగుల్తుంది. (సునంది లోపలికి పారిపోతుంది. చంద్రయ్యతో :) వినిపించిందా ? వెళ్ళు. నేను చెప్పినట్టు చెయ్ ! (వెళ్ళిపోతుంది)

చంద్రయ్య : (ఒంటరిగా కొంతసేపు ఆలోచిస్తూ ఉంటాడు) హుం, పాడుగోల ! ఈ ఆడమేళం అంతా నా ప్రాణాలు తీస్తున్నారు ! దుంపల్తెగ ! సంవత్సరం క్రిందటే ఆలోచించాలట ! ఏమిటి నాబొంద....అప్పుడు ఆలోచించేది ? అసలు ఎవరికేనా ఆలోచన పుట్టేది ఆ పనొచ్చినప్పుడా....పని లేకుండానా ? ముందటేడు-ఈ బంగారమే నావెంటబడ్డదిగా ! నేనేంచేస్తాను? నేనేమన్నా యోగినా ? తపస్వినా ? ప్రాణంలేని బండనా ?....యజమాని కళ్లు మూస్తే చేసేదిలేక ఈవిడగారిని పెళ్లిచేసుకొని ఇంటిగుట్టు రచ్చకెక్కకుండా సహాయపడ్డాను ! దాంట్లో నా తప్పేముంది ? ఇలా లోకంలో ఎక్కడేనా జరుగుతుంది ! పైగా ఆ మందుపొట్లాల గొడవ నాకేమన్నా తెలుసునా?

....ఈకుక్క ఇలాచేస్తున్నదని తెలిస్తే ఆరోజే దాన్ని తవ్విపాతేసేవాణ్ణి! చివరకు ఆ పాపం నా నెత్తికికూడా చుట్టింది. పిశాచపుముండ! అమ్మ చెబితేగాని దాని దుర్బుద్ధి తెలిసింది కాదు! ఆ విషయం తెలిసినప్పటినుంచి దాని మొహం చూట్టం అంటేనే అసహ్యంగా ఉంది!....ఆ తరువాత.... ఇదొక మేళం! ఈ కుర్రది ఒకతె....నన్ను చంపుకుతింది. ఏం చెయ్యను? తప్పలేదు! నేను కాదంటే మరొకర్ని చూచుకునేది!....ఇక ఇప్పుడు జరిగినదానికి బాధ్యుణ్ణి నేనేనంటే ఎలాగు?....అహా, పోనిద్దూ, వెధవ గొడవ! వాళ్ళ చావు వాళ్ళేచస్తారు. నాకేం?....ఈ ఆడవాళ్ళు ఎంతకైనా తెగిస్తారు! సాహసమంటే వాళ్ళది! ఆలోచనంటే వాళ్ళది!....ఫో....నా కెందుకు?....నేను దూరంగా ఉంటాను.

(తులశమ్మ వస్తుంది లాంతరు తీసుకొని. వణుకుతుంటుంది)

తులశమ్మ: ఇక్కడ పిరికి దద్దమ్మలాగా కూర్చున్నావా? త్వరగా లేచి అదేదో చూడు!

చంద్రయ్య: ఏమి ఆలోచించారు?....ఏం చేస్తారు?

తులశమ్మ: మేం చేయాల్సింది మేంచేస్తాం! నీ పని నువు కానీ....!

చంద్రయ్య: ఏదో ఉచ్చు తగిలిస్తున్నారు నా మెడకు!

తులశమ్మ: లేకపోతే వ్యవహారం ఇంతదాకా వచ్చాక నిన్ను వది లెయ్యమంటావా?

చంద్రయ్య: నిజమేననుకో అమ్మా! ఇప్పుడా ఆ పసిప్రాణాన్ని మరి ఏమిటి చెయ్యటం?

తులశమ్మ: ఒరేయ్! ఇంకా ఏం ప్రాణంరా, నీ బొంద! ప్రాణ మనేది పోకుండానే ఉంటుందా? చెప్పు ఎల్లకాలం? అనాథాలయంలో ఇస్తానన్నావటనే? అక్కడ అయితే ఆ ప్రాణం సురక్షితంగా ఉట్టికట్టుకు

ఊగుతుందా యేం ? పైగా నలుగురికీ తెలిసిపోతుంది !....పదిమందిలో పంచాయితీ !.... అందరూ తలా ఒక విధంగా చెప్పుకుంటారు !.... ఇక దానికి పెళ్లి కాదు !.... బతికినంతకాలం నీకూ దానికీ పచ్చిమంచినీళ్ళుకూడా పుట్టవు లోకంలో....

చంద్రయ్య : మరి ఈసంగతి ఎవరికేనా తెలిస్తే ?

తులశమ్మ : ఎలా తెలుస్తుంది ? ఇంటిగుట్టు ఇంట్లోనే ఉండి పోతుంది ! ఎవరికీ తెలియనీయకుండా ప్రయత్నం చేద్దాం ! మేం ఆడవాళ్ళం, ఒక మగవాడి సహాయం లేకుండా ఏం చేయగలం ? ఇదుగో పార ! గొయ్యి తవ్వు ! నేను లాంతరు చూపిస్తాను.

చంద్రయ్య : ఏమిటమ్మా ? నన్నేం చేయమంటున్నావు ?

తులశమ్మ : (నెమ్మదిగా) గొయ్యి తవ్వావెళ్లి ! పూడ్చిపారేస్తే తీరిపోతుంది ! అదుగో నన్నెందుకో పిలుస్తూంది. నే వెళ్ళొస్తా ! నువు నీ పని కానీ తొందరగా !

చంద్రయ్య : అయితే పిల్లవాడు చచ్చిపోయాడా యేం ?

తులశమ్మ : అవునవును; నీ పని నువు కానీ ! వాళ్లకీ వీళ్లకీ తెలిసిందంటే కొంప మునుగుతుంది ! ఇప్పటికే అందరూ అనుమానంగా చూస్తున్నారు మనవేపు ! వెట్టివాడుకూడా అడిగాడు ! ఏదో చెప్పి సమాధాన పరచాను ! కానీ తొందరగా ! ఈ పారతీసుకుని (పార చేతికిస్తుంది) అదుగో, ఆ మూలనున్న గదిలోకెళ్లి గొయ్యి తవ్వు ! అక్కడ తడిమట్టి, తొందరగా వస్తుంది. ఆ తరువాత మట్టితో పూడ్చెయ్యి ! ఈ భూమాత ఎవర్నీ కాదనదు. అందర్నీ తనలో ఇముడ్చుకుంటుంది. వెళ్ళు, బాబూ ! త్వరగా వెళ్లు.

బంగారమ్మ : (వచ్చి) తవ్వటం అయిందా ?

తులశమ్మ : అరే, నువుకూడా వచ్చావేం? పిల్లాణ్ణి ఏంచేశావ్ ?

బంగారమ్మ : బాగా గుడ్డల్లో చుట్టేశాను; ఎవరికీ ఏమీ వినిపించదులే! గొయ్యి తవ్వారా ?

తులశమ్మ : ఇంకా ఎక్కడ ? వీడు చెయ్యి కదపందేనా ?

బంగారమ్మ : (కోపంగా) చెయ్యి కదపడూ ? అయితే జైలు కెళ్తాడా ? పోలీసుస్టేషనుకు వెళ్లి అంతా చెప్పేసివస్తాను !

చంద్రయ్య : (గాభరాపడి) ఏమనిచెబుతావు ?

బంగారమ్మ : అంతా చెప్పేస్తాను. డబ్బు కాజేసిందెవరు ? నువ్వేగా ?....(చంద్రయ్య మాట్లాడడు) విషమిచ్చిందెవరు ?....ఇచ్చింది నేనే, కాని నీకోసం! నీ ఇష్టంమీదనే ! అందరూ కూడబలుక్కుని చేసిందే ఈపని !

తులశమ్మ : సరే సరే, చాల్లే! ఇక నోరుమూసుకో ! బాబూ చంద్రయ్యా ! గడిచిపోయినదాన్ని తవ్వుకుంటే ఏంలాభం ? ఇప్పుడు చెయ్యాల్సినదాన్నిగురించి ఆలోచించు ! పద నాయనా, నామాట విను.

బంగారమ్మ : ఇప్పుడేమీ తెలీనట్టు నటిస్తున్నావా ? పాపం, అయ్యగారికి ఇప్పుడు భయంగా ఉందన్నమాట !....ఇప్పటిదాకా నన్ను వేధించుక తిన్నదంతా మరిచిపోయావా ? కాలికింద నల్లిని నలిచినట్టు నలిచేశావే ! ఇప్పుడు నావంతు వచ్చింది ! చెయ్యి నేచెప్పినట్టు ! లేకపోతే పోలీసు స్టేషనుకు దారితీస్తాను ! తెలిసిందా ?....తీసుకో పార !

చంద్రయ్య : అయితే నువ్వు నన్ను వదలవన్నమాట ?....(పార తీసుకొని మళ్ళీ ఉలికిపడి నిలిచిపోతాడు) నా కిష్టంలేదు, నేను వెళ్ళను.

బంగారమ్మ : సరే:అయితే ! ఊరందర్నీ పిలుస్తాను..(బిగ్గరగా) ఓ క్షాంతీ, ఓ అక్కాయ్, అందర్నూ రండే !

తులశమ్మ : (నోరుమూసి) ఏమిటే నువ్వు చేసేది ? పిచ్చెక్కిందా ఏమిటి?....వాడు వెడుతూండేనే గోల చేస్తావేం ? పదనాయనా, నువ్వు పద !

బంగారమ్మ : ఉహూం, నేను అరిచేస్తాను....ఓ కుంతీ, ఓ రంగయ్య బావా!....ఖూనీ....ఖూనీ !

చంద్రయ్య : ఏయ్, నోరుమూసుకో ! వెళ్తున్నాలే. ఈ ఆడవాళ్ళతో చావు దగ్గరకొస్తుంది. ఎలాగూ చచ్చేటప్పుడు స్వర్గమైతేనేం, నరకమైతేనేం ? ఎందులోదూకినా ఒకటే ! (వెళ్తాడు)

తులశమ్మ : అంతేబాబూ, అంతే ! సుఖం అనుభవించినట్టే కష్టాల్ని కూడా ఎదుర్కోవాలి !

బంగారమ్మ : (వెనుకటి ఉద్రేకంతోనే)....నేనంటే ఒంటికాలిమీద లేచేవాడు !... అదిమాత్రం తక్కువదా ? ఇద్దరికి ఇద్దరే ! ఇప్పుడుగాని తెలిసిరాదు. ఒంటరిగా ఈ పాపభారాన్ని నేను మోయలేను ! నేను పాపాత్మురాలినయాను, ఇతగాడూ హంతకుడు కావలసిందే ! పాపమంటే ఏమిటో —హత్య అంటే ఏమిటో— తెలిసొస్తుందిలే పద !....

తులశమ్మ : ఇంత ఉద్రేకపడితే ఎలాగే కోడలా ! కోపతాపాలు చూపుకోవలసిన సమయమేనా యిది. పోఅమ్మా, నువ్వు పోయి మేనకదగ్గర ఉండు ! ఇంతలో చంద్రయ్య? ఆ గోతిపని పూర్తిచేసేస్తాడు. (చంద్రయ్య వెంట వెళుతుంది. చంద్రయ్య మూలగదిలో ప్రవేశిస్తాడు !)

బంగారమ్మ : (స్వగతం) ఇతగాడిచేతులారా ఆ పసిగుడ్డుప్రాణాలు తీయించకపోతే నా పేరు బంగారమ్మే కాదు. (అదే ఉద్రేకంతో) పాప భారంతో ఒంటరిగా అణగారిపోతున్నాను....కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాను. పెని మిటిని చంపుకున్న బాధ....నన్ను తరిమితరిమి కొడుతోంది.... నా మనసులో ఒక విషపు గోలీగా తయారయింది. ఇప్పుడు ఇతగాడికికూడా దాని

చి ఎలావుంటుందో తెలిసితీరాలి। నేనెలాగూ నరకానికి వెళ్తాను। నే నిప్పుడు ఎలాంటి పుణ్యం ఆచరించినా నాకు ముక్తిలేదు। నా పాపాల కన్నిటికి కారణమైన ఇతడుకూడా నాలోపాటు నరకంలో పడిపోవాల్సిందే? ఈ దెబ్బతో।

చంద్రయ్య: (గదిలోపల్నించి) వెలుగు చూపించు।

తులశమ్మ: (లాంతరు ఎత్తి చూపుతుంది. బయటనిల్చున్న బంగా రమ్మతో) చంద్రయ్య గొయ్యితవ్వుతున్నాడు। నువ్వెళ్ళి తీసుకరా।

బంగారమ్మ: జాగ్రత్త। నువ్విక్కడే ఉండు, ఈనాశగొట్టోడు మళ్ళీ ఎక్కడికేనా పారిపోయ్యేను। నే వెళ్ళి యిప్పుడే తీసుకొస్తాను.

తులశమ్మ: చూడు, ఆపసిగుడ్డు నోట్లో రెండు చుక్కలు తులసి తీర్థం వేసి తీసుకురా....లేకపోతే పోనీలే, ఇక్కడే భగవన్నామం చెవిలో ఊదుతాను — సరిపోతుంది।

బంగారమ్మ: అలాగే, నాకు తెలుసులే, తాగిస్తాను. (వెళ్తుంది)

తులశమ్మ: చూశావా, ఆడది।....ఎంత రోషంతో మండిపోతూ వుందో!....అవునులే పాపం....అదీ యమయాతనలే అనుభవించింది.... ఎలాగోలాగ....ఈ కాస్తంతపని పూర్తయితే తెరిపినపడలాం। ఆపిల్ల పెళ్ళి కూడా చేసేస్తే ఇక ఏగొడవాఉండదు। ఆ తరువాత నా కొడుకు జీవితం హాయిగా గడిచిపోతుంది। భగవంతుడిదయవల్ల....ఆస్తిపాస్తులున్నాయి. కాలిమీద కాలేసుకొని హాయిగా కాలక్షేపంచేయగలడు।....అప్పుడు ఈ తల్లిని మరచిపోతాడా? నేను వాడికి ఎంత సహాయంచేశాను।....ఇంకెవ రేనా అయితే ఇలా చేయగలరా। (గదిలోకి తొంగిచూస్తూ) అయిపో యిందా బాబూ?

చంద్రయ్య: (బయటికి తలపెట్టి) అయింది। తొందరగా తీసుక రండి। ఇంకెందుకు ఆలస్యం?. చేయాల్సిందేదో....చేసిపారేస్తేపాయె।

తులశమ్మ : (బయటికి వెళుతుంది. ఎదురుగా బంగారమ్మ గుడ్డల్లో చుట్టుకొని పిల్లవాణ్ణి తీసుకువస్తుంది.) తులసితీర్థం తాగించావా ?

బంగారమ్మ : ఓ, తాగించాను; అది పిల్లవాణ్ణి తీసుకరానీయలేదు. ఎలాగో బలవంతంగా లాక్కొచ్చాను. (వచ్చి, కుర్రవాణ్ణి చంద్రయ్య కందిస్తుంది)

చంద్రయ్య : (తీసుకోడు) నువ్వే తీసుకరా !

బంగారమ్మ : తీసుకో ! తీసుకుంటావా లేదా ?....(విసిరేస్తుంది అతని చేతుల్లోకి)

చంద్రయ్య : (గుడ్డలు తొలగించి) అరే, బతికేఉన్నాడే ! రామ రామ....కాళ్ళు చేతులు ఆడిస్తున్నాడు !....ఈ నిండు ప్రాణిని యేం చేయ్యను ?

బంగారమ్మ : పిల్లవాణ్ణి విసురుగా లాక్కొని గోతిలో ఎత్తి పడే స్తుంది) ఇక తొందరగా కాదనీ ! కసాపిసాతొక్కి చంపేసెయ్యి ! అప్పుడు గాని కాళ్ళు చేతులు ఆడించటం మానడు ! (చంద్రయ్యనుకూడా ఒక్క తోపు తోసేస్తుంది) అది నీ బొమ్మే ! చావు నువ్వుకూడా దాంతోపాటు.

తులశమ్మ : (గుమ్మంమీద కూర్చుంటూ) వాడి మనస్సంతా కుంగి పోయిందే తల్లీ ! బిడ్డ !....ఎంత యేడుస్తున్నాడో కదా ! కాని ఏం చేస్తాడు ! చేసుకున్నంతా అనుభవించక తప్పదు గదా !

బంగారమ్మ : (బయట నిల్చుంది)

తులశమ్మ : (వాకిలిదగ్గర కూర్చునే—చంద్రయ్యవంక చూస్తూ చెపుతుంటుంది) అయ్యో....వణికిపోతున్నాడే ! వణికి లాభమేమిటి ? మన సొప్పదు; కాని తప్పదు! మరో ఉపాయంలేదు!...ఎంతోమంది పిల్లలకోసం పూజలు పురస్కారాలు చేస్తారు. ఆ భగవంతుడు కావలసినవాళ్ళకు ఇవ్వడు!

ఒకవేళ ఇచ్చినా....సరైనరూపంలో ఇవ్వడు! అక్కర్లేదనుకున్న వాళ్లకు మాత్రం దివ్యమైనవాళ్ళను ప్రసాదిస్తాడు! (లోపలికిచూస్తూ) యేదో చేసి నట్టే ఉన్నాడే!

బంగారమ్మ : (లోపలికి చూస్తూ) పైన ఒక బల్లపెట్టి దానిపైన తాను కూర్చున్నాడు! ఈపాటికి చప్పగా చంపేసే ఉంటాడు!

తులశమ్మ : రామరామ! శివశివ! ఏమనుకుంటే యేముంది? తప్పదు! ఎవ్వరూ యేమీ చెయ్యలేరు!

చంద్రయ్య : (బయటికొస్తాడు, మనిషి వణుకుతున్నాడు)....ఇంకా ఆ గుడ్డు బతికేఉన్నాడు....నేనేం చేయలేను....ఏం చేయలేను....బతికే ఉన్నాడు బాబోయ్! ఇంకా బతికే ఉన్నాడు!

బంగారమ్మ : బతికే ఉన్నాడా?....అయితే నువు పారిపోయే దెక్కడికి? (ఆపటానికి ప్రయత్నిస్తుంది)

చంద్రయ్య : (ఆమెమీదికి దూకబోయి) లే, అడ్డంలే!....లేవకపోతే నీ పీక పిసికేస్తాను! (బంగారమ్మ చెయ్యి పట్టుకుంటాడు. ఆమె తప్పించుకొని పారిపోతుంది. చంద్రయ్య పారతీసుకొని ఆమెవెంట పడతాడు. తల్లి పరుగెత్తుకువచ్చి అతన్ని వారిస్తుంది. బంగారమ్మ ఇంటిగుమ్మం ముందుకు పోయి నిలబడుతుంది. తులశమ్మ చంద్రయ్య చేతిలోని పార లాక్కోబోతుంది. చంద్రయ్య తల్లితో-) పో, బయటికి పో! నిన్నుకూడా చంపేస్తాను! (తులశమ్మకూడా పారిపోయి బంగారమ్మ దగ్గరకు వెళ్తుంది)....చంపేస్తాను. అందర్నీ చంపేస్తాను....ఎవరినీ బతకనీయను!

తులశమ్మ : బాగా భయపడిపోయాడు! ధైర్యం చాలటంలేదు! అదే సర్దుకుంటుందిలే!

చంద్రయ్య : అయ్యో....నేనేం చేశాను?....వీళ్ళు నాచేత ఎంతపని చేయించారు?.... ఎంత దీనంగా మూలిగాడు ....బల్లకిందనుంచి కిర్ర్ కిర్ర్ ....

....మని ఎముకలు ధ్వనిచేశాయి. కిర్ర్‌కిర్ర్ ...అయ్యో....నే నెంతపని చేశాను?.... ఆ పసిగుడ్డు ఇంకా బతికేఉన్నట్టున్నాడు!....(వింటాడు) అదిగో! ఇంకా మూల్గుతున్నాడు!....(గదివైపు పరుగెత్తుతాడు)

తులశమ్మ: (బంగారమ్మతో) వెళ్తున్నాడే. వెళ్ళి పిల్లవాణ్ణి పూడ్చేస్తాడనుకుంటాను! బాబూ, చంద్రయ్యా! ఇదిగో, లాంతరు తీసుకెళ్ళరా నాయనా!

చంద్రయ్య: (వినకుండా వెళ్ళి) ఆ గదిముందర నిలబడి శ్రద్ధగా వింటున్నాడు) ఏడుపు వినిపించటంలేదు_మూలుగుకూడా లేదు....అదంతా నా భ్రమేనేమో! (తిరిగివస్తూ ఆగిపోతాడు) ఆ పసికందు నరాలూ, ఎముకలూ కిర్ర్‌ర్ర్‌మని నలిగిపోయాయి, నేను పైన కూర్చునేటప్పటికి! అబ్బా! నాచేత ఎంతపనిచేయించారు! (మళ్లీ వింటాడు)....ఇంకా యేదో మూలుగు విన్పిస్తోందే....అదిగో కీఁ కీఁ కీఁ. నిజంగానే కేవురుమంటున్నాడు, పిల్లవాడు!....లేకపోతే యేమిటా ధ్వని?....ఓ అమ్మా! (తల్లి దగ్గరి కెళ్తాడు)

తులశమ్మ: యేమిటి బాబూ?

చంద్రయ్య: అమ్మా! అమ్మా! నాకు చేతులు రావటంలేదే! ఇక నేనేం చేయలేనమ్మా!....నన్ను వదిలెయ్యండే....నన్ను కరుణించండే!...

తులశమ్మ: బాబూ! నువు బాగా భయపడిపోయినట్టున్నావు! రా బాబూ! రా....రెండు గుక్కలుతాగు!....కొంచెం బలమొస్తుంది!

చంద్రయ్య: అమ్మా! నాకు అంత్యకాలం సమీపించింది! నాచేత ఎంతపని చేయించావే!....ఆ కేవురు మనటం....ఆ ఎముకలు నాకింద కిర్ర్‌ర్ర్‌ర్ మనటం....అన్నీ గుర్తుకొస్తున్నాయి! అమ్మా! నువు నన్ను అగాధంలోకి నెట్టేశావు! నాబతుకు బండలుచేశావే! (కింద కూలబడతాడు)

తులశమ్మ : లే బాబూ! లే! ఇదికొంచెం తాగు! రాత్రిపూట కొంచెం భయంగానే ఉంటుంది. ఏం పరవాలేదులే! చీకటిపోతుంది, వెలుగొస్తుంది! రెండురోజులు గడిస్తేచాలు. అంతా మరిచిపోతావు! ఏం పర్వాలేదు, భయపడకు బాబూ! ఏమీలేదు....ఆ పిల్ల పెళ్ళయిపోతే....ఆపైన నీ ఇష్టం! అప్పుడు నీకు ఎంతో హాయి! తాగుబాబూ తాగు-రెండుగుక్కలు తాగి కొంచెం ధైర్యం తెచ్చుకో!....నే వెళ్ళి ఆ గదిలో మిగతా పని పూర్తిచేసేస్తాను.

చంద్రయ్య : (ఏదో ఆశగా లేస్తాడు) ఇంకా ఏమన్నా ఉందా? తే, ఇలాతే, నేను అంతా చుప్తాచేసేస్తాను. (ఇంట్లోకి వెడతాడు)

[ఇంతవరకు గుమ్మంలో నిలబడ్డ బంగారమ్మ అతనికి దారిచ్చి తప్పుకుంటుంది]

తులశమ్మ : వెళ్ళుబాబూ. నువు వెళ్లు! నేను వెళ్ళి పూడ్చిపెట్టివస్తాలే, పార ఎక్కడ పారేశాడు....? (పారతీసుకుని ఆ కొట్టువైపు వెళ్తుంది) బంగారమ్మా, ఇలా రా, లాంతరు కొంచెం చూపించు!

బంగారమ్మ : ఆయన రాడా?

తులశమ్మ : ఇంక వాడేం వస్తాడులెద్దూ....వాడిలో సాహసం చచ్చిపోయిందే. నీమటుకు నువుకూడా వాణ్ణి నానా మాటలన్నావు! పోనియ్ పాపం! భగవంతుడే వాణ్ణి కరుణించాలి! నెమ్మదిగా మళ్ళీ వాడు మన ప్రపంచంలోకి వస్తాడులే!....మిగిలినపని నేను పూర్తిచేసేస్తాను. లాంతరు పట్టుకో. ఆc, అది, అలాగే నిలబడు! (తులశమ్మ లోపలికి వెళ్తుంది)

బంగారమ్మ : (చంద్రయ్యవెళ్ళినవైపు చూస్తూ)....అయ్యగారి గర్వం అణిగింది. మహా రొమ్మువిరుచుకుని నడిచాడు ఇప్పటిదాకా! ఇప్పుడు తెలుస్తుంది బాధంటే ఎలా ఉంటుందో! ఇక పొగరు అణుగుతుందిలే!

# చంద్రయ్యలో చైతన్యం

చంద్రయ్య : (ఇంట్లోనించి పరుగెత్తుకుంటూ వస్తాడు) అమ్మా, అమ్మా ! ఇదుగో—

తులశమ్మ : (బయటికి తలపెట్టి) ఏమిటి బాబూ ?

చంద్రయ్య : పూడ్చేశావా ? వద్దు వద్దు—పూడ్చమాకు !.... ఇంకా పిల్లవాడు బతికే ఉన్నాడే ! బాతికే ఉన్నాడు.... కేవురుమనటం నీకు వినిపించటంలేదూ ?.... విను, విను ! అంత స్పష్టంగా విన్పిస్తూంటే !....

తులశమ్మ : బాబూ ! ఇంకెక్కడి కేవురుమనటంరా నాయనా ! నువ్వు పైన బల్లపెట్టి కూర్చునేప్పటికే.... పిల్లవాడు అప్పడంలాగా అయిపోయాడు. సిరస్సు అప్పచ్చిలాగా అయిపోయింది.

చంద్రయ్య : అయితే ఈ ఏడుపు నాకెక్కడినుంచి విన్పిస్తోంది ? (చెవుల్లో వేళ్ళు పెట్టుకుంటాడు) ఇంకా కేవురుమంటున్నాడు. అయ్యో ! ఎంత పని ! ఎంత అఘాయిత్యం !.... ఎంత ఘోరం ?.... నేను నిలువునా మునిగిపోయాను !.... నన్ను నాశనంచేశావే నువ్వు !.... నా బతుకేమవుతుంది ? నాకేది దారి ? (అక్కడే కూలబడిపోతాడు)

•

# ఐదో అంకం

## మొదటి దృశ్యం :

[ఒకవైపున వడ్లునూర్చిన పొట్టు-మరోవేపున కల్లం-ఎదురుగా వడ్లు నిలవజేసే గది కన్పిస్తున్నది. వెనక నివసించే ఇల్లు ఉంది....లోపల్నుంచి పాటలధ్వని విన్పిస్తోంది. ఇద్దరు ఆడపిల్లలు కల్లందగ్గరనుంచి ఇంటివైపు బయలుదేరారు]

మొదటి అమ్మాయి : చూశావా, కాళ్ళకు తడికాకుండా వచ్చేశాం ; బయట బజార్లో....చెడ్డ బురదగా ఉంది....అబ్బబ్బా !....(వాళ్ళిద్దరూ వడ్ల పొట్టుతో కాళ్లు తుడుచుకుంటారు. మొదటిపిల్ల....పొట్టుపక్కన దేన్నో పరీక్షగా చూస్తుంది.)

రెండో అమ్మాయి : (పరీక్షగా చూస్తుంది)....అరే....ఎవరిక్కడ ? కొండయ్యలాగా ఉన్నాడే ! మైకంలో ఉన్నట్టున్నాడు !

మొదటి : అబ్బే, అతనికి త్రాగుడు అలవాటులేదని విన్నానే ?.... తాకనుకూడా తాకడట !

రెండో : అవునవును....దొరక్కపోతే తాకడు; దొరికితే....

మొదటి : మంచిమాటచెప్పావు ! గడ్డి తీసుకెళ్ళటానికి వచ్చిఉంటాడు. చూడు....చేతిలో ఏదో తాడుకూడా ఉంది....అట్టాగేపడి నిద్రపోయాడు !

రెండో : (వింటుంది) ఇంకా ఆటపాటలు సాగుతూనేఉన్నాయే ! పెళ్ళివారింకా వెళ్ళలేదనుకుంటా. మేనక అసలు ఏడవనేలేదటగా !

మొదటి : మా అత్త చెబుతూంటే విన్నాను_అసలు దానికి పెళ్ళంటే ఇష్టమేలేదట ! దాని రెండోతండ్రే బలవంతంగా చేశాడట ; లేకపోతే అది

పెళ్ళిచేసుకునేదేకాదట.... ఈ పెళ్ళినిగురించి అంతా చాలా విడ్డూరంగా చెప్పు కుంటున్నారు....విన్నావా నువ్వు ?

రాజమ్మ : (వాళ్ళను సమీపించి) బావున్నారా అమ్మాయిలూ ?

అమ్మాయిలు : ఆ(....నువు కులాసాగా ఉన్నావా ?

మొదటి : పెళ్ళికొచ్చావా ?

రాజమ్మ : అయిపోయిందిగా !....ఏదో ఒక్కసారి చూసిపోదా మని....చూడు....కొ_త్త మా ఆయన్ను ఇలా పిలుస్తావా ?....తెలుసుగా ఆయన....కిష్టయ్యగారు !

మొదటి : తెలీకే( ? ఈ పెళ్ళికొడుకు ఆయన బంధువులనికూడా విన్నావే(?

రాజమ్మ : అవును, ఆ అబ్బాయికి బాబాయి అవుతారు.

రెండో : అయినా....నువ్వే ఎందుకు వెళ్ళగూడదు లోపలికి ?

రాజమ్మ : నాకు వెళ్ళటానికి ఇష్టంలేదు, పైగా సమయంకూడాలేదు. తొందరగా వెళ్లాలి. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. పెళ్లికి రావాలనుకోలేదు; బండిమీద జొన్నలబస్తాలు వేసుకుని మేము పట్నంవెళ్తా ఎడ్లకు నీళ్ల పెడదామని ఇక్కడ ఆగేం ! ఇంతలోకే ఏవరోచూసి పెళ్లికి ఉండమని బలవంతంచేశారు.

మొదటి : అయితే నువ్వు ఎక్కడున్నావు ఇంతసేపు ? రాధమ్మగా రింట్లోనా ?

రాజమ్మ : అవును !....చెబుతారుగదూ ?....అప్పటిదాకా నేనిక్కడే నిలుచుంటాను. నేను పిలుస్తున్నానని చెప్పండి....చెబుతారుగా ?....

మొదటి : చెబుతాంలే ! (ఆ పిల్లలిద్దరూ ఇంట్లోకి వెళ్లిపోతారు)

రాజమ్మ : (స్వగతం, ఆలోచిస్తుంది) నేను లోపలికి వెళ్ళవచ్చును

గాని....వెళ్లాలనిపించటంలేదు. అతన్ని చూసి చాలాకాలమైంది. నన్నువదిలేసి నప్పుడు చూట్టమే! సంవత్సరంపైగానే అయింది. ఒకసారివెళ్ళి బంగా రమ్మతో ఎలా వుంటున్నాడో చూడాలనిపిస్తోంది. ఇద్దరికీ పడటంలేదని విన్నాను! ఆవిడ అలాంటిమనిషే, తన చిత్తమొచ్చినట్టు నడిచే స్వభావం! అలాంటప్పుడు చంద్రయ్య నన్ను తలుచుకుంటూనే ఉంటాడు! డబ్బు వ్యామోహంలోపడి నన్ను వదిలేశాడు. అయినా అతను సుఖంగాఉంటే చాలు. ఒకరు చెడిపోవాలని నేను కోరను. కాని ఆనాడు నేను ఎంత బాధ పడ్డాను?....ఎంత ఏడ్చాను?....పోనిద్దూ, అవన్నీ గడిచిపోయిన సంగ తులు! అయినా ఒక్కసారి అతన్నిచూస్తే పోయిందేముంది? (ఇంటివైపు చూస్తుంది. చంద్రయ్య కన్పిస్తాడు) అరే....అతనే వస్తున్నాడే! పొరపా టున ఆ పిల్లలు వెళ్ళి ఇతనితో చెప్పలేదుగదా! పెళ్ళిపెద్దల్ని వదిలి బయటి కెందుకొస్తున్నాడు?....నే వెళ్ళిపోతాను. (చంద్రయ్య తలవంచుకొని దగ్గ రగా వస్తాడు. మనిషి బలహీనంగా ఉన్నాడు. ఏదో గొణుక్కుంటున్నాడు!) ఏదో చాలా బాధపడుతున్నట్టు కన్పిస్తున్నాడే!

చంద్రయ్య: (రాజమ్మను గుర్తుపట్టి) రాజీ! ఓహో! నా రాజీ! నువ్వొచ్చావా? ఇక్కడున్నావేం?

రాజమ్మ: మా ఆయన్ను పిలుచుకు వెళ్ళటానికి వచ్చాను.

చంద్రయ్య: లోపలికి రాలేకపోయావా? వచ్చి నా పరిస్థితిచూసి నవ్వేపని!

రాజమ్మ: ఒకరినిచూసి నేనెందుకు నవ్వాలి? మా ఆయన్ను పిలు చుకు వెళ్ళటానికే వచ్చాను.

చంద్రయ్య: అబ్బా. రాజీ! నా రాజీ! (దగ్గరగావచ్చి కౌగలించుకో బోతాడు)

రాజమ్మ : (కోపంగా, కొంచెం దూరంగా జరిగి) గడిచిపోయిం దేదో గడిచిపోయింది. ఇప్పుడు ఇలాంటి మాటలేవీ నాతో మాట్లాడవద్దు !

చంద్రయ్య : అయితే గతాన్ని గుర్తుకు తెచ్చుకోవద్దంటావా ! ఏం ఎందుకు రాజీ, గడిచిన రోజుల్ని తలుచుకోటానికికూడా నేను తగనా ?

రాజమ్మ : తలుచుకున్నందువల్ల ప్రయోజన మేమిటి ? ఉన్నదేదో పోనేపోయిందిగా ?....

చంద్రయ్య : ప్రయోజనమేమీ లేదంటావా ? ఆ పోయింది మళ్ళీ రాదంటావా ?

రాజమ్మ : ఎలా వస్తుంది ? రాదు !....పెళ్ళి మండపంనుంచి ఇలా లేచివచ్చావేం?....యజమానివి, పైగా అప్పగింతల సమయంలో వస్తే పెళ్ళి వారు ఏమనుకుంటారు ?

చంద్రయ్య : (అక్కడే కూర్చుంటూ) ఇలా ఎందుకు లేచి వచ్చా నని అడుగుతున్నావా ?....రాజీ....నా మనసులో రేగుతున్న తుఫాను నీకర్థ మైతే ఎంత బావుండును !....రాజీ....నేను ఏమీ చూడలేకపోతున్నాను.... చేయలేకపోతున్నాను...భరించలేక లేచి బయటికొచ్చాను...ఎవరికీ కన్పించ కుండా వెళ్ళిపోవాలని ! ఇంతలో నువు కన్పించావు!...అబ్బా, భరించలేకుండా ఉన్నాను !....నేను గుడ్డివాడినైపోయినా బావుండేది !

రాజమ్మ : (దగ్గిరగావెళ్ళి) అదేమిటి ? ఏం జరిగిందేం ?

చంద్రయ్య : ఏం జరిగిందని చెప్పమంటావు ?....తింటున్నా.... తిరుగుతున్నా...అదే దృశ్యం నా ఎదుట కన్పిస్తుంది... నిద్రలో, మెళకు వలో...ఎప్పుడూ అదేరూపు....నా ముందర తారట్లాడుతూ ఉంటుంది. నాలో జీవం చచ్చిపోయింది. ఇక నేను బతకను !...ఇంకా అసలు విషయమేమి టంటే...రాజీ !...నేను ఒంటరిగాణ్ణయిపోయాను !.... కేవలం ఏకాకిని !... బాధను పంచుకునేవాళ్లు ఎవరూ లేరు !

రాజమ్మ : అనవసరంగా ఎందుకు బాధపడతావు చంద్రం? అన్నీ మరచిపోయి నీ బతుకు నువు బతకలేవూ? నా వ్యథను నేను కన్నీటితో కడిగివేసుకున్నాను...తెలుసునా!

చంద్రయ్య : రాజీ, నా బాధ నీకు తెలీదు. నీ బాధను నువు కన్నీటితో కడిగివేసుకో గలిగావు! కాని నా బాధ అలాంటిది కాదు; నా ప్రాణాలు నా కంఠందాకా వచ్చి అడ్డంపడ్డాయి: (కంఠం చూపిస్తాడు) అవి లోపలికీ పోవటంలేదు; బయటకీ పోవటంలేదు.

రాజమ్మ : అంత విపత్తేమొచ్చింది నీకు?

చంద్రయ్య : ఏమిటంటావా? నాకు నేనేబరువై పోయాను....బాధయి పోయాను! బ్రతుకుమీద రోతపుట్టింది! రాజీ! జీవితంమీద నాకు ఆశకలిగేట్టు నువు చేయలేవూ?...నువ్వు నాకు ఇలా ఎందుకు దూరమయిపోయావు! పడిపోతున్న తరుణంలో పట్టి నిలబెట్టకుండా, నా కర్మానికి నన్ను ఎందుకు విడిచిపెట్టేశావు రాజీ! ఇప్పుడు చూడు, నా బ్రతుకు బండలయిపోయింది. చివరకు నీ జీవితాన్నికూడా పాడుచేసుకున్నావు కదా!

రాజమ్మ : (ఏడుస్తుంది-మరల తనను తాను సంబాళించుకొని) నా జీవితం బాగానేఉంది—చంద్రం! నా కెలాంటి లోటులేదు! నా కిచ్చిన సౌభాగ్యాన్నే పరమేశ్వరుడు ప్రతిస్త్రీకి ప్రసాదించుగాక! నేను అన్నివిషయాలు నా భర్తతో చెప్పేశాను! ఆయన నన్ను క్షమించారు! ఆయన నన్నేమీ అనరు! ఇద్దరం సుఖంగా ఉన్నాం! నేను ఆయన పిల్లల్ని ప్రేమగా చూసుకుంటున్నాను. ఆయనకు నేనంటే ఎంతో ప్రేమ! నా కే లోటూ లేదు...ఏ బాధాలేదు! కాని నువు అంతగా బాధపడటానికి కారణం? నీకు కావలసినంత డబ్బుందిగదా—

చంద్రయ్య : లేదు రాజీ లేదు! నాకు సుఖంలేదు! నా బతుకు బద్దలై పోయింది! పెళ్ళివారింకా వెళ్ళలేదు. ఈ శుభకార్యం చెడగొట్టటం

ఇష్టంలేకనే ఊరుకున్నాను. లేకపోతే ఈతాడుతో (అక్కడపడివున్న తాడు తీసి) మెడకు ఉరేసుకొని ఇప్పటికెప్పుడు ఈ ప్రపంచాన్ని విడిచిఉండే వాణ్ణి!...విన్నావా, రాజీ,...ఏనాటికైనా ఇదే నాకు దారి!

రాజమ్మ: అరి భగవంతుడా! నీకేమన్నా మతిపోతోందా చంద్రం?

చంద్రయ్య: నేను సుఖంగా ఉన్నానని నువు అనుకుంటున్నావేమో! తాగేనని అనుకుంటున్నావేమో! లేదు రాజీ! నేను తాగలేదు. ఈనాడు ఎంతతాగినా పనిచేయదు....మైకంరాదు! నన్ను నేను మరిచిపోగలగటం అసంభవం! రాజీ, నన్ను ఏదో లోలోపల తినేస్తోంది... నా కండలు బొమికెలు కొరికేస్తోంది! ఎవరో కడుపులో చెయ్యిబెట్టి దేవుతున్నారు! మెదడంతా శూన్యమైపోతోంది. నన్నేదో శక్తి పీల్చేస్తోంది! నేనిక దేన్నిగురించీ ఆలోచించలేకపోతున్నాను!....నీతో గడిపిన రోజులు ఎంత మధురమైనవి రాజీ!....ఇసుకతిన్నెలమీద....వెన్నెలలో గడిపిన ఆ రాత్రులు.... స్మృతిలో నాకు స్పష్టంగా కన్పిస్తున్నాయి రాజీ!....

రాజమ్మ: ఆ విషయాలన్నీ కెళ్లగించకు చంద్రం! మానిపోయిన నా గాయాల్ని మళ్ళీ ఎందుకు కెలుకుతావు? నా వివాహం అయింది....నీ వివాహమూ అయింది. నేనాచరించిన పాపాలకు నాకు క్షమాభిక్ష లభించింది. ఇక ఇప్పుడు పాతగాయాల్ని రేపమాకు!

చంద్రయ్య: ఏం చేయను రాజీ! ఈ మాటలు నేను మాట్లాడటం లేదు; నా హృదయం పలికిస్తోంది!....చెప్పు....దాన్ని ఏంచేయమంటావు... ఎక్కడ పారేయమంటావు... ఎలా పారేయమంటావు? చెప్పు రాజీ! నన్నేం చేయమంటావు? ఎక్కడికి పొమ్మంటావు?

రాజమ్మ: ఎక్కడికో పోవటం ఎందుకు? నీది ఎక్కడ ఏముందని! ఎవరివేపూ నువు చూడమాకు. నీలో నువు సంతోషంగా ఉండు! బంగారమ్మను వెనుక ఎలా ప్రేమిస్తూ ఉండేవాడవో, అలాగే ఇప్పుడుకూడా ప్రేమిస్తూ ఉండు!

చంద్రయ్య : నాముందు ఆ పేరెత్తకు ! ఆ పేరు వింటేనే నా కసహ్యం ! అది రాక్షసి !....పిశాచి ! కాని అదే తన కబంధహస్తాలలో నన్ను ఇరికించుకొని....ఏం చెప్పమంటావ్ ?

రాజమ్మ : ఏంచేసినా ఆవిణ్ణి నువు పెళ్ళిచేసుకున్నావు చంద్రం ! భార్యాభర్తలన్నతరువాత ఎప్పుడన్నా మాటామాటారాకుండా ఉంటుందా ! వెళ్ళు చంద్రం, పెళ్ళివారి ఏర్పాట్లు చూడు ! ఇప్పుడు ఎన్ని అనుకుంటే ఏం లాభం ? నామాటవిని వెళ్లు. వెళ్ళి కాస్త మా ఆయన్ని ఇలా పంపించు.

చంద్రయ్య : రాజీ ! జరిగినసంగతులన్నీ నీకుతెలిస్తే ఎంత బావుండును !....అయినా....నువు అన్నట్టు....ఇప్పుడు ఎన్ని అనుకుంటే ఏం లాభంలే !

(రాజమ్మభర్త వస్తాడు....తాగిన మైకంలో ఉన్నాడు. సునంది కూడా వుంది వెంట)

రాజమ్మ భర్త : రాజీ, డార్లింగ్ ! ఎక్కడున్నావ్ ప్రియతమా !

చంద్రయ్య : అదుగో, మీ ఆయన పిలుస్తున్నాడు, వెళ్లు !

రాజమ్మ : నువు ?

చంద్రయ్య : నేనా ?....నేనిక్కడే కాసేపు పడుకుంటాను. (గడ్డి మీద పడుకుంటాడు)

రాజమ్మ భర్త : ఏయ్ ! ఎక్కడున్నావు డార్లింగ్ !

సునంది : అదిగో, కళ్ళందగ్గరుంది.

రాజమ్మ భర్త : అక్కడేంచేస్తోంది ?....రావోయ్,....రా, రా, నువు కూడా లోపలికిరా. అంతా నిన్ను అడుగుతున్నారు. వచ్చి నువుకూడా కొంచెం సేవించు ! పెళ్లివారు అటు బయలుదేరటంతోనే మనమూ ఇటు బయలుదేరి వెళ్దాం !

రాజమ్మ : (భర్తకు దగ్గరగావచ్చి) నాకు లోపలికిరావటం ఇష్టం లేదు.

రాజమ్మభర్త : రవాలేదులే, పద ! మనవాడి పెళ్ళికావడమేమిటి, నువ్వు దూరంగా ఉండటమేమిటి ? కొంచెం లోనికొచ్చి అందర్నీ కలుసుకో లేక పోతే బావుండదు. వాళ్ళేమన్నా అనుకుంటారు. (రాజమ్మభర్త రాజమ్మ భుజాలమీద చేయివేసి తూలుతూ వెళ్తాడు)

చంద్రయ్య : (లేస్తాడు, మళ్ళీ అలాగే గడ్డిమీద పడిపోతాడు) అబ్బా ! ఈమెను చూసేప్పటికి ఎందుకో మనసంతా మరింత వికలంగా ఉంది ! జీవించటం మరీ దుర్భరంగా తోస్తున్నది. ఆమెతోగడిపిన ఆరోజులు ఎంత మధురమైనవి ! ఆ జీవితం ఎంత ఆనందమైంది ! అబ్బా....నన్ను నేను నాశనంచేసుకున్నానుగదా ! ఇప్పుడెక్కడికి వెళ్ళను ? కూర్చున్న పళంగా ఈభూమి పగిలి నన్ను తనలోఇముడ్చుకుంటే ఎంత బావుండును !

సునంది : (చంద్రయ్యనుచూసి పరుగెత్తుకుంటూ వస్తుంది) నాన్నా ! ఓనాన్నా ! పెళ్ళివారు అంతా నిన్ను అడుగుతున్నారు ! అంతా ప్రయాణాలు అవుతున్నారు.... ఇక అప్పగింతలే మిగిలాయి !....నీకోసమే ఎదురుచూస్తు న్నారు ! తొందరగా రా నాన్నా. నువ్వు కనిపించటంలేదని అంతా చిరాకు పడుతున్నారు.

చంద్రయ్య : (తనలో) నేను ఎక్కడికి వెళ్ళను ? ఎటుపోను ?

సునంది : ఏమిటినాన్నా అంటున్నావు ?

చంద్రయ్య : ఏమీలేదమ్మా-ఏమీలేదు !

సునంది : లే నాన్నా ! లే వెళ్దాం ! (చంద్రయ్య మాట్లాడడు ! సునంది చెయ్యిపుచ్చుకొని లాగుతుంది) లే నాన్నా ! ఇప్పుడు అక్క వెళ్ళి పోతుందిగా ! అందరూ నీకోసమే ఎదురుచూస్తూ తలా ఒకమాటా అనుకుం టున్నారు.

చంద్రయ్య : (చేయిలాక్కొని) వదులు, నా చెయ్యి వదిలెయ్ !

సునంది : ఏం నాన్నా !

చంద్రయ్య : ఏంలేదులే, నువ్వెళ్ళిపో !....వెళ్తావా లేదా ?

సునంది : వెళ్ళి అమ్మతో చెబుతాను (పరుగెత్తుతుంది)

చంద్రయ్య : (లేచి) నే నెలా వెళ్ళను ? ఏముఖం పెట్టుకు వెళ్ళేది వాళ్ళందర్లోకి ? ఆశీస్సులు ఎలా ఇవ్వటం ? దాని ముఖం చూసేదెలాగు ? (మళ్లా లేచినచోటనే పడుకుంటాడు) అబ్బా ! ఈ భూమి బద్దలైతే ఎంత బావుండును....ఎవరికీ నామొహం కన్పించకుండాపోతే ఎంత బావుండును ! (మళ్ళా లేస్తాడు) నే వెళ్ళను....తిట్టుకుంటే తిట్టుకుంటారు ! నేను వెళ్ళేదే లేదు ! (తాడు వుచ్చుపోసి మెడలో వేసుకుంటాడు; కాని ఎదురుగా తల్లి కన్పించటంతో తాడు తీసేస్తాడు ! మళ్ళీ గడ్డిమీద అలాగే పడుకుంటాడు)

తులశమ్మ : (పరుగెత్తుకుంటూ వచ్చి) బాబూ, చంద్రయ్యా!.... విన్పిస్తున్నదా ? మాట్లాడవేం ? ఏమిటిరా ? ఎక్కువ తాగేవా ఏమిటి ?.... లే బాబూ లే, అంతా నీకోసం చూస్తున్నారు !

చంద్రయ్య : అమ్మా !....ఎంతపని చేశావే అమ్మా !....నా బతుకు నిరర్థకం చేశావు !

తులశమ్మ : ఇప్పుడివేం మాటలురా ? లే నాన్నా, లే ! అప్పగింతల సమయం వచ్చింది. మర్యాదగా ఈ పనికూడా పూర్తిచేశావంటే....నీకు దిగులనేది ఉండదు....లే బాబూ, లే !

చంద్రయ్య : అప్పగింతల సమయంలో నేనెలా ఆశీర్వాదాలివ్వనే అమ్మా ? ఎలాగే అమ్మా ?

తులశమ్మ : అందరు తండ్రులూ ఇచ్చినట్టే ఇవ్వు ! నీకు తెలీందేముంది దీంట్లో ! పురోహితుడు పలికించినట్టు పలుకు ! అంతే !

చంద్రయ్య : తెలుసు ! కాని ఎవరికీ ఆశీర్వాదాలిచ్చేది ? పిల్లకేనా ? ఆపిల్లతో నేను ఎంతటి ఘోరకృత్యానికి పాలుపడ్డాను !

తులశమ్మ : నువ్వేం పాలుపడ్డా ? ఎప్పటి సంగతో ఇప్పుడెందుకు నీకు ? నిన్నెవరడిగారు ? అసలు ఎవరికి తెలుసు ?.... ఈవిషయం పిట్టకు కూడా తెలీదు ! పైగా పిల్ల తనఇష్టంమీదనే ఈపెళ్ళికి ఒప్పుకున్నదాయె !

చంద్రయ్య : ఏమిటి ! నిజంగా ఒప్పుకున్నదా ?

తులశమ్మ : పోనీ కొంతవరకు లోకానికి జడిసే అనుకో ! ఇప్పుడెలాగూ అత్తవారింటికి వెళ్తున్నది గదా ! జరగవలసినవన్నీ జరిగిపోయాక ఇప్పుడేమనుకుంటే ఏం లాభం !.... అంతగా కాదంటే ఆ ఆలోచనముందే ఉండాలి గాని—! పిల్లవాడి తరపువాళ్ళు రెండుసార్లు వచ్చి పిల్లనుచూసి వెళ్లారు.... ఇప్పుడు కట్నం డబ్బుకూడా వాళ్ళచేతిలో పడిపోయింది, ఇంత వరకు అన్నీ సక్రమంగానే జరిగిపోయాయి గదా !—

చంద్రయ్య : మరి ఆగదిలోనో ?.... అక్కడేముంది ?

తులశమ్మ : (నవ్వి) ఏముందిరా నాన్నా, ఆ గదిలో ? కూరగాయలున్నాయి—బంగాళాదుంపలు, బీరకాయలు, వంకాయలు .... ఇంకేమున్నాయి? గడచిపోయిన సంగతుల్నిగురించి అనవసరంగా ఆలోచించి మనసు ఎందుకు పాడుచేసుకుంటావు ?....

చంద్రయ్య : నిజమేనమ్మా.... ఎలాగైనాసరే ఆవిషయం మనసులోకి రానీయకుండా ఉంచేందుకే ప్రయత్నిస్తున్నాను; కాని వీలుపడటంలేదు. నిత్యం నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూంటుంది—ఆ కర్ర్ .... కర్ర్ మనేధ్వని ! అమ్మా ! నీ కొడుక్కి ఎంత అన్యాయం చేశావమ్మా !

తులశమ్మ : నీకేమన్నా మతిపోయిందా ఏమిరా పిచ్చినాగన్నా !

చంద్రయ్య: (బొర్లాపడుకుంటాడు) అమ్మా ! నన్ను బాధపెట్టకు, నా ప్రాణాలు కంఠందాకా వచ్చి ఆగిపోయాయి ! (కంఠం చూపిస్తాడు)

తులశమ్మ : అయినా చేసేపని పూర్తిచెయ్యాలి. అక్కడ నలుగురూ నాలుగుమాటలంటున్నారు! పిల్లతండ్రి ఏడని ప్రతివాళ్ళూ అడుగుతున్నారు. కన్పించదేమంటున్నారు. పిల్లను భర్తతో పంపించటం తండ్రికి ఇష్టంలేదా ఏమిటని అడుగుతున్నారు. ఇలాంటివెన్నో మాటలు వస్తున్నాయి. నీకు తెలీందేముంది? ఇలాంటి సమయంలోనే లోకులు ఒకటికి నాలుగు పుట్టిస్తారు. నీ దిగాలుమొహం చూసేప్పటికే వాళ్ళు రకరకాలుగా ఆలోచించటం ప్రారంభించారు. నీకెందుకు నువు రొమ్ము విరుచుకు నడు — నిన్నెవరు అనుమానిస్తారో నే చూస్తాను. లే నాన్నా, లే! కొంచెం మనసును దిట్ట పరుచుకొని ఈ పనికూడా పూర్తయేట్టు చూడు!....నాకు మాత్రం తెలీదూ?....నీకు చాలా బాధగా ఉండిఉంటుంది....అయినా బాధను పైకి కన్పించనీయకూడదు. ఇలాంటప్పుడే ధైర్యం వహించాలి. అధైర్యపడకూడదు! నువు దిగులుపడ్డకొద్దీ వాళ్లు ఇంకా ఇంకా రహస్యాల్ని పసిగట్టేస్తారు. అప్పుడు లేనిపోని చిక్కులు ఎదురౌతాయి.

చంద్రయ్య : అమ్మా! నన్నెందుకే ఇలాంటి అగాధంలోకి నెట్టావు?

తులశమ్మ : పిచ్చిపిచ్చి మాటలన్నీ కట్టిపెట్టి పిల్లను పంపించే విషయమేదో చూడు!....ఈ రగడ విరగడవుతుంది.

చంద్రయ్య : (బోర్లాపడుకునే)....లేదమ్మా! లేదు....నేను రాలేను!

తులశమ్మ : (తనలో) వీడికేమైంది? ఇంతకుముందుదాకా బాగానే ఉన్నాడుగా! బహుశా దృష్టిదోషం తగిలిఉంటుంది. ఒరే బాబూ! లే, చూడు బంగారమ్మ వస్తోంది....అందర్నీ వదలిపెట్టి అదికూడా నీకోసమే పరిగెత్తుకువస్తోంది.

బంగారమ్మ : (మంచిబట్టలున్నాయి వంటిమీద! తాగినట్టుంది. సంతోషంగా ఉల్లాసంగా ఉంది) అత్తా, పనులన్నీ పూర్తయిపోయాయి! అంతా అనుకున్నట్టుగానే గౌరవంగా జరిగిపోయింది. అందరికీ సంతోషంగానే

తులశమ్మ : ఇదుగో, గడ్డిమీద పడుకున్నాడు. ఎంతచెప్పినా రానంటున్నాడు.

చంద్రయ్య : (భార్యవైపు చూసి తనలో) ఈమెగారుకూడా సేవించి నట్టుంది! అందుకే ఇంత సంతోషం! అబ్బా!! చూస్తుంటేనే అసహ్యం మేస్తున్నది. ఇలాంటి మనిషితో ఎలా ఉండటం ?....(ముఖం తిప్పుకుంటాడు) ఏదో రోజున దీన్నికూడా నేనే చంపేస్తానేమో !....

బంగారమ్మ : ఇదుగో....ఈగడ్డిమీదపడి ఏం జేస్తున్నావంట ? బాగా తాగావేంటి ? (నవ్వుతుంది) పరవాలేదులే! నాక్కూడా ఈ గడ్డిమీదనేవచ్చి పడుకోవాలనిపిస్తోంది; కాని ఇప్పుడు తీరికలేదు! నువుకూడా లే! రా, నేను తీసుకెళ్తాను. ఇంట్లో అంతా కోలాహలంగా ఉంది. చూస్తే నీమనసు సంతోషంతో ఉప్పొంగిపోతుంది. వెళ్దాం లే! ఏమి ఆటలు! ఏమి పాటలు ! అలాంటివాళ్ళను ఇదివరలో నువు చూసి ఉండవు! ఏమి సౌందర్యం !.... ఏమి యౌవనం....ఎంత వైభవం....

చంద్రయ్య : వైభవమా ?

బంగారమ్మ : కాదామరి! ఈ పెళ్ళి ఎంతవైభవంగా జరిగిపోయింది! ఇంత కోలాహలం ఎక్కడా చూడలేదని చెప్పుకుంటున్నారు! లే....ఇద్దరం చేయిచేయిపుచ్చుకొని వెళ్దాం! నేనుకూడా కొంచెం తాగాను! అయినా పరవాలేదులే! నీకు సహాయంగా రాగలను! (చెయ్యి పుచ్చుకుంటుంది)

చంద్రయ్య : (కోపంగా విదిలించుకొని)....నువ్వు పద ముందు! నేను తరువాత వస్తాను.

బంగారమ్మ : ఇంకా అట్టా విదిలించుకుంటావే! వ్యవహారం సమసిపోయింది! మనిద్దరి మధ్య ఉన్న అడ్డంకు కాస్తా తొలగిపోయింది. ఇక ఇద్దరం సుఖంగా కాలంగడుపుదాం! నా కివేళ చాలా సంతోషంగా ఉంది. ఈ పెళ్ళి మళ్ళీ నీకూ నాకూ జరుగుతున్నట్టుగానే ఉంది నాకు. ఇవేళ మన

ఇంటికి పెద్దపెద్దవాళ్లంతా వచ్చారు....మన ఊరి మున్సబు, సీతారామయ్య గారూ, పట్నంనుంచి తహశీలుదారుగారూ, పోలీసు ఇనస్పెక్టరూ అంతా వచ్చారు. మన పెళ్లి ఏర్పాట్లుచూసి వాళ్లుకూడా పొగుడుతున్నారు.

చంద్రయ్య : నువు అక్కడే వాళ్లలోనే ఉండక ఇక్కడికెందుకు వచ్చావు ?

బంగారమ్మ : సరే, వెళతాను. వెళ్లకపోతే వాళ్ళేమన్నా అనుకుంటా రేమో ! ఇంటి యజమాని, యజమానురాలుకూడా అతిథుల్ని వదలిరావటం మంచిపనికూడా కాదు ! పైగా వాళ్లంతా పెద్దపెద్ద హోదాలవాళ్లు....

చంద్రయ్య : (లేస్తాడు, గుడ్డలకు అంటుకున్న గడ్డిపరకల్ని తీసేసు కుంటాడు) నువు పద నేను వస్తాను.

తులశమ్మ : చూశావా ? ముసలిదానిమాట ఎవరూ వినరు కదా ! పడుచుపిల్లలు రావాలి పనిజరుపుకు పోవాలి ! (తులశమ్మ, బంగారమ్మ వెళ్ల టానికి అటు తిరుగుతారు) ఏం, వస్తున్నావు కదా !

చంద్రయ్య : ఇప్పుడే వచ్చేస్తున్నా ! వచ్చి ఆశీర్వాదాలిస్తాను, పిల్లకి !....మీరు పదండి, నేను వస్తాను ! (మళ్ళీ కూర్చుంటాడు) నేనా వెళ్లేది !....ఇంకొంచెంసేపటికి మీరంతా వచ్చి నన్నే చూడాల్సిఉంటుంది— ప్రాణాలు పోయిన ఈ శవాన్ని ! గొంతుకు తాడేసుకుని....ఈ ప్రపంచం నుంచి శలవుతీసుకుంటా ! కొంచెంసేపటికి వచ్చి చూడండి నన్ను ! ఇదే తాడు....(ఆలోచిస్తాడు) అబ్బా....ఇంకేదయినా బాధయితే సహించి ఉండే వాణ్ణి; కాని ఇది మాత్రం నా గుండెను తినేస్తున్నది. ఎంత సహించాలను కున్నా, సహించలేకపోతున్నా ! (ఇంటివైపు చూస్తాడు) వాళ్లు మళ్ళీ రావటం లేదుగదా !...,లేదు ! (బంగారమ్మ మాటల్ని అనుకరిస్తూ....)....నాకూ_డా ఈ గడ్డిమీదనే వచ్చి పడుకోవాలనిపిస్తున్నది...,వచ్చి పడుకో, ఎలా పడు కుంటావో....నీ మనసు తీరా ! రాక్షసి ! హంతకి ! ప్రాణాలుపోయిన ఈ

శరీరాన్ని నీ ఇష్టం వచ్చినట్టు ప్రేమించు! అంతే, అదే మార్గం!...,
(తాడును సరిజేస్తూ ఉంటాడు)

కొండయ్య : (మైకంలో ఉన్నాడు; గడ్డిలోనుంచి లేచి కూర్చుంటాడు. తాడుమాత్రం వదిలిపెట్టడు.) నేను వదలను; నేనే తీసుకెళ్తాను....గడ్డితీసుక వెళ్లటానికే నేనిక్కడికొచ్చాను. ఎవరు? చంద్రయ్యా? (నవ్వుతాడు) గడ్డి కోసం నువ్వే వచ్చావా?

చంద్రయ్య : ఈ తాడు వదులు!

కొండయ్య : వదలనని చెప్పానుగా! ఎంత మూర్ఖుడవయ్యా చంద్రయ్యా! వట్టి పశువ్వి! (నవ్వుతాడు) అయినా నువ్వంటే నాకెంతో అభిమానం!....నేనుకూడా తాగాను....ఏమిటి అట్లా చూస్తున్నావు? నేను.... ఆఁ, గుర్తురావటంలేదుగాని....నేను కాశ్మీరు ఫ్రంటులో ముందునిలబడి యుద్ధంచేసిన సైనికుణ్ణి! దేశానికి ఎంతో సేవచేశాను. మన నాయకుల్ని గౌరవించాను....నువ్వనుకుంటున్నావేమో....నేనేదో పెద్ద వీరుడనని! అబ్బే కాదు, కాదు....నేను వట్టి పనికిమాలిన పశువును! దారంతెగిన గాలిపటంలా రకరకాల దెబ్బలు సహిస్తున్నాను. నాకు ఇల్లూ వాకిలీ అంటూ లేదు!.... నేను తాగనంటే తాగనని ఒట్టేసుకున్నాను; కాని ఆవాసన....పోనియ్.... నన్నుగురించి నువ్వేమనుకుంటున్నావు? నువ్వంటే నాకు భయమనుకున్నావా? నాకెవరన్నా భయంలేదు. సారాయితాగను!....బాగా తాగాను.... నేను సైనికుడుగాఉన్నప్పుడు ఎన్నోసార్లు కొరడాదెబ్బలుకూడా సహించాను. ప్రతిసారి ఇక మానేస్తావా?—అనే వారు. నేను ఉహూఁ అంటే ఉహూఁ అనే వాణ్ణి! వాళ్లు ఎన్నివిధాలుగా చూశారు నాచేత తాగుడు మాన్పించాలని! ఏమైనాసరే నేను భయపడలేదు. నేను నేనే! నన్ను పుట్టించినవాడుదేవుడు! వాళ్లుకాదుగా! వాళ్లకి ఎందుకు నేను భయపడాలి? చివరకు నా అంతట నేనే మారాను. తాగనంటే తాగనని ఒట్టేసుకున్నాను. తాగలేదుకూడాను. కాని ఇవ్వాళ తాగాను....ఇంకా తాగుతాను....నే నెవరికీ భయపడను....నే

నెప్పుడూ : అబద్ధాలాడనుగా !....పట్టిగొప్పలు చెప్పుకునేవాళ్లే మనుషుల్ని చూసి భయపడతారు....మనుషులకు భయపడేవాణ్ణి యమదూతలు మెడపట్టు కొని తీసుకెళ్తారుట !....నేనుమాత్రం మనుషుల్నిచూసి భయపడను ! నాకేంచింత ?....యమదూతలుకాదు, వాళ్ల బాబొచ్చినాసరే, నాకేం భయం లేదు. సైతానొచ్చినా నేను జడపను !

చంద్రయ్య : నిజమే, నువ్వు చెప్పింది నిజమే కొండయ్యా.... (తాడు కింద పడేస్తాడు)

కొండయ్య : ఏమిటి ?

చంద్రయ్య : (లేచి నిలబడతాడు) మనుషులకు భయపడాల్సిన అవసరం లేదంటున్నావుకదూ కొండయ్యా నువు ?

కొండయ్య : లేకపోతే ఏమిటి ? ఈ మనిషి సన్నాసుల్ని చూసి భయపడ టమా ?....వంటిమీద గుడ్డలులేకుండా....ఏ కాలవలోనో స్నానంచేసేప్పుడు చూస్తే తెలుస్తుంది : మనుషులంతా ఒకేరకం మట్టిబొమ్మలు ! బొజ్జమాత్రం ఒకడిది పెద్దది, ఇంకొకడిది చిన్నది. అంతే తేడా ! ఇంతమాత్రానికే భయ పడటమా ?....ఈ మిడిసిపడేవాళ్ల రోజులు ముందుంటాయి !...

తులశమ్మ : (ఇంటివాకిలిదగ్గర నిలబడి)....వస్తున్నావా, లేదా ?

చంద్రయ్య : సరే—వస్తున్నా....(ఇంటివైపు వెళతాడు)

## రెండో దృశ్యం :

[ఇంటిలోపలిభాగం....అతిథులతో నిండిఉంది....కొంతమంది బల్ల చుట్టూ కూర్చున్నారు....కొంతమంది నిలబడిఉన్నారు. ఎదురుగా—వధూవరు లున్నారు. అతిథుల్లో రాజమ్మ, ఆవిడభర్త, పోలీసుఅధికారి, పురోహితుడు, మున్సబు మొదలైనవాళ్లున్నారు. ఆడవాళ్లు అప్పగింతపాటలు పాడుతున్నారు. బంగారమ్మ గ్లాసుల్లో సారాయిపోసి అందరికీ అందిస్తూఉంటుంది]

బండివాడు : బాబుగారూ, మనం వెళ్లిపోవాలి.

మున్సబు : తండ్రి పిల్లను అప్పగించనివ్వ ! ఏడీ కన్పించడే ?

బంగారమ్మ : వస్తున్నారు. ఈలోగా మరో గ్లాసు పుచ్చుకోండి. వద్దనకూడదు.

పురోహితుడు : ఆయన ఎక్కడున్నాడు ? ఆయన వస్తే ఈ పని ముగుస్తుంది....

బంగారమ్మ : వస్తున్నారు. నిమిషంలో వచ్చేస్తారు. మీరు ఈ ఒక్క గ్లాసుతాగటం పూర్తయ్యేలోగా వారు వచ్చేస్తారు! తీసుకోండి. (ఇస్తుంది) ఈ లోగా మీరు ఇంకోపాట పాడండి అమ్మాయిలు !

బండివాడు : వాళ్లు పాడవలసిన పాటలన్నీ ఎప్పుడో పాడేశారు ! వియ్యంకుణ్ణి పిలిపించండి. (ఆడవాళ్లు పాటలు ఆరంభిస్తారు....అప్పుడే చంద్రయ్య. రామయ్య వస్తారు)

చంద్రయ్య : (తండ్రిచేయిపట్టుకొని తాను వెనుక ఉంటాడు) నడువు నాన్నా, నువు ముందు నడువు ! నువు లేకపోతే ....నాకు ధైర్యంచాలదు!....

రామయ్య : ఇదుగో చూడు....నాకు ఇలాంటివేమీ నచ్చవురా !

చంద్రయ్య : (ఆడవాళ్ళతో) చాలు చాలు, ఇక మీ పాటలు ఆపండి. (నాలుగువేపులా కలియజూస్తాడు) రాజీ ! నువుకూడా ఉన్నావా !

పురోహితుడు : ఇవిగో అక్షింతలు....కూతురికి ఆశీర్వచనాలు చెప్పు !

చంద్రయ్య : కాస్త ఆగండి ! (మళ్ళీ అందర్నీ కలియజూస్తాడు) మేనకా ! నువ్వూ ఇక్కడే ఉన్నావు !

పురోహితుడు : ఇదేమిటయ్యా, పేరుపేరునా పిలుస్తున్నావు....పెళ్ళి కూతుర్నికూడా అడుగుతున్నావు. నాకేమీ అర్థంకావటంలేదు.

బంగారమ్మ : అరెరె !....ఈయన సరైనబట్టలుకూడా వేసుకోలేదే !

చంద్రయ్య : నాన్నా ! నువుకూడా ఇక్కడే ఉన్నావుగా ! అతిథులు కూడా అంతా ఉన్నారు ! అయ్యలారా ! మీరంతా నావైపు ఒకసారి

చూడండి! బంధువులంతాకూడా ఉన్నారు! నేనూ ఉన్నాను! నేను.... (కాళ్ళు మోకరిస్తాడు)

బంగారమ్మ : చంద్రం! చంద్రం....ఏమిటిదంతా! అబ్బా....నా తల తిరిగిపోతోంది!

పురోహితుడు : చూస్తే అంతా తమాషాగా ఉన్నదే!

తులశమ్మ : కొంచెం అధికంగా తాగేడని నేచెప్పలేదూ?....బాబూ! చంద్రయ్యా! కొంచెం స్పృహ తెచ్చుకోరా! (చెయ్యి పుచ్చుకొని పైకి లేప టానికి ప్రయత్నిస్తుంది; కాని లెక్కచెయ్యడు. అందర్నీ వింతగాచూస్తాడు)

చంద్రయ్య : కులపెద్దలారా! నేను చాలా పాపాలు చేశాను....నేను హృదయం విప్పి నా తప్పులు మీకు వినిపిస్తాను!

తులశమ్మ : (భుజంపట్టుకొని ఊపుతూ) పిచ్చి ఎక్కలేదు గదా నీకు! అయ్యో! వీడి మతి స్థిమితంగా లేదు! కొంచెం వీణ్ణి అవతలకు పంపించండి.

చంద్రయ్య : (వక్కకునెట్టి) వదులు. నన్ను ముట్టుకోకు! నాన్నా! నువుకూడా విను! రాజీ, నువుకూడా విను! (రాజమ్మ దగ్గరికెళ్ళి భూమి మీద వంగి నమస్కరించి లేస్తాడు) నేను నీకు చాలా అపరాధంచేశాను. పెళ్ళిచేసుకుంటానని చెప్పి నిన్ను నమ్మించి, నీ శీలాన్ని చెడగొట్టాను. ఆ తరువాత మోసంచేసి నిన్ను వదిలేశాను! భగవంతుడి పేరు చెప్పి నన్ను క్షమించు రాజీ! క్షమించు! (మళ్ళా భూమ్మీదకు వంగి నమస్కరిస్తాడు)

బంగారమ్మ : చూస్తే పిచ్చిఎక్కినట్టేఉంది. లేకపోతే ఏమిటిదంతా? అసలు ఎవరైనా నిన్ను అడిగారా, పెట్టారా? లేలే! పెద్దలముందు ఇంత అమర్యాదగా ప్రవర్తిస్తావేమిటి?

తులశమ్మ : ఏదో దయ్యం పట్టినట్టుంది వీడికి! ఎవరో చేతబడి చేశారు! లే బాబూ లే! (చేయిపట్టుకు లాక్కువెళ్ళబోతుంది.)

చంద్రయ్య : (విదిలించుకొని) ఇక్కు! మధ్యలో నన్ను చెడగొట్టి

మాకు ! రాజీ ! నీకు నేను చాలా అపరాధంచేశాను. క్షమించు రాజీ ! నన్ను క్షమించు ! (రాజమ్మ చేతులతో మొహం కప్పుకుంటుంది-ఏమీ మాట్లాడదు)

బంగారమ్మ : ఏమిటి నువు చేసేది ? ఇంత అమర్యాదగా ప్రవర్తిస్తావేం ? మనిషన్న తరువాత కొంచెమైనా సిగ్గుండాలి !....నోటికొచ్చినట్టు మాట్లాడతావేమిటి ? అబ్బో! ....నా తల ! ... ఇదేం తిక్కరోగం పట్టుకుంది నీకివాళ ?

చంద్రయ్య : (భార్యను ఒక పక్కకు నెట్టేసి మేనకవైపు తిరుగుతాడు) మేనకా, ఇక నువు విను ! ఇక్కడ కూర్చున్న పెద్దలారా ! మీరంతా కూడా వినండి !.... మేనకా !.... నేను అధమాధముణ్ణి ! పాపిని ! రాక్షసుణ్ణి! నేను చాలా పాపంచేశాను. నిన్ను చెడగొట్టాను !.... మీ నాన్న ఊరికే చనిపోలేదు....విషం తాగిస్తే చనిపోయాడు !

బంగారమ్మ : (బిగ్గరగా అరుస్తూ) అబ్బో ! నా తల !.... అయ్యో ! ఏమిటీ ఘోరం !

తులశమ్మ : అయ్యో, అయ్యో. వీడికి పిచ్చెక్కింది. కొంచెం వీణ్ణి బయటికి లాక్కెళ్ళండి బాబుల్లారా ! (కొంతమంది చంద్రయ్యను బయటి తీసుకుపోటానికి వస్తారు)

రామయ్య : (ఎవర్నీ రావద్దని సంజ్ఞచేస్తాడు) ఉండండి బాబూ ఉండండి !.... ఇదుగో చూడండి.... కొంచెం ఆగండి !

చంద్రయ్య : మేనకా ! మీ నాన్నకు విషమిచ్చింది నేను ! నన్ను క్షమించు మేనకా ! నన్ను క్షమించు !

మేనక : (ఉలికిపాటులో ఎగిరిపడుతుంది) వట్టిది ! ఇదంతా అబద్ధం ! విషమెవరిచ్చారో నాకు తెలుసు !

పురోహితుడు : ఇదుగో, అమ్మాయీ, నువేం మాటాడబోకు. మెదలకుండా కూర్చో !

రామయ్య : హే భగవంతుడా ! ఎంతపాపం !.... ఎంత ఘోరమైన పాపం !....

పోలీసు అధికారి : ఇతన్ని అరెస్టుచేస్తున్నా ! మేజిస్ట్రేటును పిలవండి. రిపోర్టు తయారుచేయాలి ! సాక్షులు కావాలి ! వింటున్నావా చంద్రయ్యా ? ఇలా రా !

రామయ్య : (ఇనస్పెక్టరుతో) ఇదుగో చూడు.... ఏమయ్యో.... ఓ మెరిసేగుండీలాయనో ! నీ పేరేమిటో ! కొంచెమాగు.... చూడు.... వాడు చెప్పదలచుకున్న దేమిటో చెప్పనీ !

పోలీసు అధికారి : ఏయ్ ముసలాడా ! నీ గోలేమిటి మధ్య ? చట్ట రీత్యా నేను వెంటనే రిపోర్టు తయారుచేయాలి !

రామయ్య : ఇదుగో చూడు.... ఏమి మనిషివయ్యా నువ్వు ? కొంచెం ఆగమంటూంటే రిపోర్టు గిపోర్టు అంటావు.... చూడు.... వాడు భగవంతుడు సాక్షిగా తన తప్పులు ఒప్పుకుంటున్నాడు ! మధ్య నీ గొడవేమిటి ? చట్టమూ చట్టుబండలనుకుంటూ !

పోలీసు అధికారి : మేజస్ట్రేటును పిలవ్వోయ్ !

రామయ్య : చూడు.... మొదట భగవంతుడిపని_ఆ పైన నీ మేజస్ట్రేటూ గేజిస్ట్రేటూనూ !

చంద్రయ్య : మేనకా ! నీ ఎడల నేను చాలా ఘోరపాపం ఆచరించాను ! నిన్ను మోసంచేశాను ! భగవంతుడుసాక్షిగా క్షమించమని కోరుతున్నాను ! నన్ను క్షమించు మేనకా ! (ఆమెముందు వంగి నమస్కరిస్తాడు)

మేనక : (లేచి వెళుతుంది).... నన్ను వెళ్ళనివ్వండి.... నాకీ పెళ్ళి అక్కర్లేదు. ఈ పెళ్ళి నా కిష్టంలేదు ! ఏదో బలవంతంచేస్తే ఒప్పుకున్నాను!

పోలీసు అధికారి : ఇప్పుడు చెప్పింది మళ్లా మరోసారి చెప్పు !

చంద్రయ్య : అయ్యా ! కొంచెం ఆగండి ! నన్ను చెప్పనియ్యండి.

రామయ్య : (చాలా సంతోషపడుతూ) చెప్పు బాబూ, చెప్పు! అంతా చెప్పేసెయ్ నాయనా! నీ మనసు నిర్మలమవుతుంది.... ఇదుగో చూడు.... ఆ భగవంతుడిముందర నువు చేసిన పాపాలన్నీ ఒప్పుకో! మాన వుణ్ణి చూసి భయపడకు నాయనా! అందరికీ పైన ఉన్నవాడు ఆ భగవం తుడే! సర్వం ఆయనే నాయనా!

చంద్రయ్య : నేను తండ్రిలాంటి వ్యక్తికి విషమిచ్చాను! కూతుర్ని చెడగొట్టాను. ఆమె జీవితాన్ని నాశనంచేశాను!.... పైగా ఆమె కొడు కును....

మేనక : అవును.... నిజమే!....

చంద్రయ్య : పిల్లవాణ్ణి నేను గదిలోపడేసి పైన బల్లపెట్టి కూర్చు న్నాను. ఆ పసికందు.... బొమికెలు కర్ర్ర్ర్—కర్ర్ర్ర్ మంటూ పిప్పి పిప్పి అయిపోయాయి! తల అప్పచ్చిలాగా అయిపోయింది....(ఏడుస్తాడు) ఆతరువాత ఆ పిల్లవాణ్ణి నేను గొయ్యితీసి పూడ్చిపెట్టాను. ఇదంతా నే నొక్కణ్ణే చేశాను!

మేనక : అబద్ధం, నేనే అలా చేయమన్నాను.

చంద్రయ్య : నన్ను రక్షించటానికి ప్రయత్నించకు మేనకా! ఇప్పుడు నే నెవర్నీ చూసీ భయపడను!.... అయ్యాలారా! అతిథులారా! మీరంతా నన్ను క్షమించండి. (అందరిముందుకూ వెళ్ళి వంగి నమస్క రిస్తాడు. కొంచెంసేపు అంతటా ప్రశాంతంగా ఉంటుంది)

పోలీసు అధికారి : ఈయన చేతులు కట్టేయండి. ఈ పెళ్ళి ఆగి పోయినట్టే!

[చుట్టూఉన్న జనంలోనుంచి చాలామంది చేతికి దొరికింది తీసుకుని చంద్రయ్యను కట్టివేయడానికి ముందుకొస్తారు]

చంద్రయ్య : అయ్యా! కొంచెం ఆగండి! (తన తండ్రిదగ్గరికెళ్ళి భూమ్మీద మోకరిస్తాడు) నాన్నా! ఓ నాన్నా! ఈ భ్రష్టుడైన నీ కొడుకును క్షమించు నాన్నా! నేను చెడుమార్గం అవలంబిస్తున్న రోజున వచ్చి నువు నన్ను హెచ్చరించావు—'ఒకసారి కాలుజారితే మళ్ళా తీసుకోవటం నీవల్ల

కా'దని నువు ఎన్నో విధాల చెప్పావు నాన్నా! కాని నేను నీ మాటల్ని లెక్కచేయలేదు! అతి నికృష్టమైన జీవితాన్ని గడిపాను! నన్ను క్షమించు నాన్నా! క్షమించు!

రామయ్య: (హర్షాతిరేకంతో) బాబూ! భగవంతుడు నిన్ను క్షమిస్తాడు....తప్పక క్షమిస్తాడు బాబూ! (కొడుకును కౌగలించుకుంటాడు! ....చూడు....ఆ భగవంతుడు నిన్ను కరుణిస్తాడు! నీవంటి వీరుల్ని దేవుడు ఆశీర్వదిస్తాడు!....అంతేకాదు....చూడు....నీవంటి వీరులకోసం దేవుడు విలపిస్తాడుకూడా?

(మేజస్ట్రేటు వస్తాడు)

మేజస్ట్రేటు: సాక్షులు చాలామందే ఉన్నారనుకుంటాను!.

పోలీసు అధికారి: వెంటనే అపరాధి వాఙ్మూలం తీసుకోండి!

(చంద్రయ్యను కట్టివేస్తారు)

మేనక: (చంద్రయ్యవద్దకు వెళ్ళి అతన్ని ఆనుకుని నిలబడి) అయ్యా! జరిగిందంతా నే చెబుతాను! అంతా నిజం చెబుతాను. నా వాఙ్మూలంకూడా తీసుకోండి!

చంద్రయ్య: ఎందుకు నీ వాఙ్మూలం? చెప్పవలసిందంతా నేను చెప్పేశానుగా? చేసిందంతా నేను! నేనే దీనికి మూలకారకుణ్ణి! నేనే అపరాధిని! ఇప్పుడు నన్ను మీ ఇష్టంవచ్చిన చోటికి తీసుకెళ్ళండి. ఇంతే నేను చెప్పదలుచుకున్నది.

